# ఒక్క పోస్టు కార్డు చాలు!...

ఇంట్లో ఉంటూ తీరుబాటు
సమయాల్లో పోస్టుద్వారా
ఇంగ్లీషు నేర్చుకోవడానికి అవ
కాశం కలిగించే 'వివేకానంద
ఇన్‌స్టిట్యూట్' వారికి -
నా జోహార్లు. నేను తెలుగు
భాష ద్వారా ఇంగ్లీషు నేర్చుకోవ
డానికి కావలసిన వివరాల
పుస్తకము మరియు అప్లికేషన్
ఫారము వెంటనే పంపమని
కోరుతున్నాను. ఇట్లు,
B. USHA
ANANTAPUR.

WRITE PIN CODE IN ADDRESS

INDIA 15

TO,
VIVEKANANDHA INSTITUTE,
POST BOX NO:4986.
NO. 9. MADLEY ROAD.
T.NAGAR, MADRAS-17.
PIN 600017

మీకూ, మీ అభ్యుదయానికీ మధ్యవున్న దూరం ఒక పోస్టుకార్డే అని మేమంటే మీకు విచిత్రంగానూ, తమాషాగానూ వుండవచ్చు. కానీ అది నిజం!

మీ అభ్యుదయానికి ఇంగ్లీషుభాష తెలియక పోవటమే ఒక కారణమైతే.....

ఇతరులు ఇంగ్లీషులో మాట్లాడుతుంటే మీకు అర్థమైనాకూడా వాళ్ళకి ఇంగ్లీషులోనే సమాధానాలు చెప్పలేకపోతున్నామే అని మీరు మానసికంగా బాధపడ్తూంటే....

ఇదివరకూ యెన్నో మార్గాలలో ప్రయత్నించినా, యెన్ని పుస్తకాలు చదివినా, ఇంగ్లీషులో మాట్లాడ లేకపోతున్నామే అన్న విసుగు మీలో పుట్టి వుంటే....

మీరు యెదురుచూసే అభ్యుదయాన్ని సాధించటానికి ఒక పోస్టుకార్డు వ్రాస్తేచాలు.

నిజమే!

ఇంగ్లీషులో వ్యాకరణ తప్పులు లేకుండా వుత్తరాలు, వ్యాసాలు వ్రాయటానికీ, చక్కగా, సరళంగా మాట్లాడటానికి మీరు చేయవలసిన ముఖ్య పని ఒక్కటే. మీ కోర్కెను వివరంగా తెలుపుతూ ఒక పోస్టుకార్డుని పోస్టు చెయ్యండి. మీ పోస్టుకార్డు అందిన వెంటనే ఈ వివేకానందా ఇన్‌స్టిట్యూట్ వారు మీకు కావలసిన వివరాలను, మీరు తీసుకోవలసిన అభ్యాసాలన్నింటినీ పూర్తిగా అందిస్తారు.

ఎక్కడికి బయలుదేరారండీ? పోస్టుకార్డు కొనటానికేనా? అయితే మీ అభ్యుదయానికైన మొదటి మెట్టు ఎక్కారు!

శభాష్!!

మీ కోర్కెను పోస్టుకార్డు ద్వారా వివరంగా తెలిపి మీ యొక్క పూర్తి చిరునామాను కూడా తెలుపుతూ వెంటనే పోస్టు చేయడం మరువకండి సుమా!

మీరు పోస్టు చేయవలసిన చిరునామా -

## VIVEKANANDHA INSTITUTE

POST BOX NO:4986, 9.MADLEY ROAD, T.NAGAR, MADRAS-17.

# చతుర సమీక్ష

ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్లీ చెప్పకుండా, అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒక వైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', 'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్టుచేయాలి.

మాకు అందిన సమీక్షలలో ఉత్తమమైనవిగా ఎంపికచేసి ప్రచురించిన వాటిలో మొదటి మూడింటికి రూ. 100/-, రూ. 75/-, రూ. 50/- చొప్పున; మరో మూడింటికి రూ. 25/- చొప్పున నగదు బహుమతులు పంపగలం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటు చేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

✱ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

---------- కూపన్ ----------

డిసెంబర్ చతుర నవల 'పంతులుగారి పట్నవాసం'

సమీక్షకుని పేరు: ..............................

చిరునామా: ..............................

..............................

..............................

..............................

# రచయితలకు సూచనలు



ప్రచురించే ప్రతి నవలకు రు. 2,000/- పారితోషికం అందజేస్తున్న 'చతుర' లో ప్రతిభావంతులైన రచయితలకు నెలనెలా నవలల పోటీయే. వైవిధ్య పూరిత ఇతివృత్తాలతో, ఆసక్తికర రచనా సంవిధానంతో పాఠకులను ఆకట్టుకో గల నవలలకు వేదిక 'చతుర'.

★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, చతుర కథలు, చతుర ప్రపంచం వంటి శీర్షికలు కాక కేవలం నవల మాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. "చతుర"లో అచ్చులో ఒక పేజీలో సుమారుగా 350 పదాలు వస్తున్నాయి. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచటంగాని, తగ్గించటంగాని ఉండదుగనుక నవలలన్నీ సరిగా ఈ సైజుకు సరిపడేలా, మొత్తంమీద 35వేల పదాలకు తక్కువకాకుండా ఉండాలి. వ్రాత ప్రతిలో వారివారి దస్తూరీని బట్టి, ఒక పేజీకి ఎన్నిపదాలు వస్తున్నాయనే దానినిబట్టి మొత్తం నవల ఎన్ని పేజీలు ఉండాలనేది ప్లాన్‌వేసుకోవటం అవసరం.

★ ఈ లెక్క ప్రకారం "చతుర" కొరకై ప్రత్యేకంగా రాసిన నవలలు మాత్రమే పరిశీలనార్హాలవుతాయి.

★ నవలను ప్రచురించే సమయంలో అవసరాన్నిబట్టి కొంత కుదించవలసివచ్చే పక్షంలో, అందుకు అభ్యంతరంలేనివారే తమ నవలలను పంపించాలి.

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు త్రిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయిన సందర్భాల్లో మా బాధ్యత ఉండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపర్చటమో, లేనిపక్షంలో తిప్పి పంపటమో జరుగుతుంది.

★ పారితోషికం ఏ నెల చతురలో ప్రచురిస్తే ఆ నెల మొదటివారంలో పంపబడు తుంది.

ఎడిటర్

# చతుర

'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్-500 482



# 'ఎండమావి'పై చతుర సమీక్షలు

అక్టోబర్ నెల 'చతుర'లో ప్రచురితమైన ఎం.ఎస్.ఆర్. చౌదరి నవల 'ఎండమావి'పై మాకు అందిన సమీక్షలలో ఉత్తమంగా ఉన్న ఆరింటిని ఈ సంచికలో ప్రచురిస్తున్నాం.

## ఇది ఈనాటి సమస్యే

*(ప్రథమ బహుమతి రూ. 100/- పొందిన సమీక్ష)*

**ఒ**క సమస్యను తీసుకుని ఏదైనా పరిష్కారాన్ని గాని, ఒక నీతినిగాని చెప్పగలిగే రచన 'ఉత్తమ రచన' అవుతుంది. ఆ రచయిత ఉత్తమ రచయిత అవుతాడు. అక్టోబరు నెలలో 'చతుర' ప్రచురించిన నవల "ఎండమావి" పైకోవకు చెందుతుంది. చక్కటి కథాబలంగల రచనలను నెలనెలా ప్రచురించే ప్రతిభ ఒక్క "చతుర"దే సుమా అని పాఠకులకు మరొకసారి నిరూపించింది "ఎండమావి" నవల.

నవల ఎత్తుగడ, ప్రధాన కథకు మూడు ఉప కథలను జోడించినతీరు, ముగింపు బావున్నాయి. ప్రారంభంలోనే 'పాండవ వనవాసం' నాటక ప్రస్తావనద్వారా ధర్మరాజు జూదాన్ని విమర్శించడం, "జూదగాళ్ల అంతిమస్థితి దుఃఖసాగరంలో మునగడమే" అనడంద్వారా నవలయొక్క ఇతివృత్తాన్ని బీజప్రాయంగా పాఠకుడికి సూచించారు రచయిత.

ప్రధానపాత్ర - త్రివిక్రమరావు, అతని కొడుకులు కలసి నలుగురూ నాలుగు రకాల జూదాలకు ప్రతీకలు. ఒక్కొక్కరికీ ఒక్కొక్క బలహీనత. త్రివిక్రమరావుకు లాటరీ, మట్కాపిచ్చి అయితే, అతని కొడుకులు సత్యం, శివం, సుందరంలు కోడిపందాలు, గుర్రపుపందాలు, పేకాటలకు దాసులు. తండ్రీ కొడుకులను జూదానికి బానిసలుగా చిత్రించడంద్వారా కుటుంబ యజమాని వ్యసనపరుడయితే అతని కుటుంబమంతా అలాగే నడుచుకునే అవకాశం ఉంటుందన్న విషయాన్ని నొక్కి చెప్పారు. ఇందులో అసహజత్వం ఏమీ లేదు. 'పెద్దలబట్టి పిన్నలు' అన్న నానుడి మనమెరిగినదేకదా!

'జూదం' అనేది 'దీపం' అయితే దాని చుట్టూ తిరిగే సామాన్య మానవులు 'శలభాల'వంటివారు. ఎలాంటి జూదమయినాసరే అది దీపంలాగే మొదట వెలుగుల్ని విరజిమ్ముతూ ఆకర్షింపజేసి చివరకు దగ్గర చేరిన పురుగుల్ని పొట్టన పెట్టుకున్నట్టు సామాన్యుడిని సమూలంగా నాశనం చేస్తుంది. పేకాట, మట్కా, గుర్రపుపందాలు మొ॥ జూదాలు 'సుదర్శన్'వంటి లక్షాధికారులకి వినోదాలయితే, త్రివిక్రమరావువంటి మధ్యతరగతి మానవుడికి విషసర్పాలతో చెలగాటం ఆడటం వంటిది. త్రివిక్రమరావు అంతిమస్థితి ద్వారా ఈ విషయం చక్కగా నిరూపించగలిగారు రచయిత.

నవల ఇతివృత్తం బావున్నప్పటికీ కథారచనలో కొంత పట్టు, శైలిలో కొంత చిక్కదనం కొరవడ్డాయనిపిస్తుంది అక్కడక్కడా. త్రివిక్రమరావుకు బుద్ధిచెప్పడానికి వెంకట్రామయ్య పాత్ర ద్వారా రచయిత ఎంచుకున్న పథకం 'సేమ్ ఓల్డ్ ట్రిక్కే' అనిపించకమానదు. వనితను గర్భవతిగా నటించమనడం నగటు తెలుగుసినిమా కథను గుర్తుకు తెస్తుంది. ఈ సన్నివేశాన్ని మరోలా మలిస్తే బావుండేది.

మధ్యతరగతి జీవితాన్ని గురించి,

కవర్ పేజీ ఫొటో గ్రాఫర్ : ఎస్. శివన్నారాయణ

జూదంగురించి రచయిత స్వయంగానూ, పాత్రలద్వారానూ వినిపించిన చెణుకులు బావున్నాయి. జీవితాన్ని కాచివడపోసిన రచయిత తప్ప వేరొకరు ఇలా చెప్పడం అసాధ్యం. జూదం అనేది నైతిక విలువలకు సంబంధించినది. విడిగాచూస్తే వ్యక్తిగత సమస్య. లేదా ఒక కుటుంబ సమస్య. కొన్ని ఇలాంటి కుటుంబాలను కలిపి చూస్తే అదే సాంఘిక సమస్య అవుతుంది. ఇది చూసే దృష్టినిబట్టి ఉంటుంది. ఏమైనా ఇటువంటి జటిల సమస్యను తీసుకుని నీతిని అందించడంలో విజయం సాధించిన రచయిత, ఇటువంటి ఉత్తమ రచనను ప్రచురించిన 'చతుర' అభినందనీయులు.

**-పి.రాధారాణి,** సికింద్రాబాద్.

## ముళ్లకంచె

*(ద్వితీయ బహుమతి రూ. 75/- పొందిన సమీక్ష)*

ఎందరో నిర్భాగ్యులున్న ఈ దేశంలో అన్నీ ఉండి కూడా వ్యసనాలకు బానిసలై బతుకు నాశనం చేసుకునేవారికీ, ఎప్పటికో ధనవంతులమవుతామని ఉన్నదంతా ఊడ్చి జూదాలకి, లాటరీలకి తగలేసే ప్రబుద్ధులకూ 'ఎండమావి' నవల గుణపాఠంలాంటిది.

తాగుడు, లాటరీలకు అలవాటుపడి కుటుంబాన్నినయితం పట్టించుకోకుండా జీవితాన్ని ముళ్లకంచెగా తయారు చేసుకున్నాడు త్రివిక్రమరావు. కన్నకొడుకులు కూడ తండ్రి అడుగుజాడల్లోనే గుర్రప్పందాలు, కోడిపందాలు, పేకాటలకు తలఒగ్గారు. ఈ దుర్వ్యసనాలన్నీ అన్నా తమ్ముళ్లాంటివని రచయిత చాలా బాగా విశ్లేషించారు. సహోద్యోగి రామనాథం లాటరీ అలవాటుతో పిచ్చివాడైనా త్రివిక్రమరావుకి బుద్ధిరాలేదు, అలాగే చివరి క్షణంలో చెల్లెలి పెళ్లికని తెచ్చిన డబ్బును కొడుకు శివం గుర్రప్పందాల్లో పెట్టాడంటే వ్యసనానికి ఎంత పవరుందో అర్థమవుతుంది. బావకు బుద్ధి చెప్పాలని వెంకట్రామయ్య ఆడిన నాటకం బాగుందికానీ, అది చివరకు త్రివిక్రమరావు చావుకి కారణం కావడం బాధ కల్గించింది. తన శీలాన్ని దోచుకోవాలని చూసిన రాకేష్‌లాంటి నీచుడిని ప్రతిఘటించి తాగుబోతు భర్తకు బుద్ధి చెప్పిన పావని అభినందనీయురాలు. సరదాలకోసం భర్తల్ని వేధించే కాంతంలాంటి పెళ్లాలు ఈ సమాజానికే చీడపురుగులు.

'పెద్దలు పిల్లలకు ఆదర్శంగా నిలవాలేగాని వారి పతనానికి పునాదులు కారాదు' అనే నీతివాక్యం పాఠకుల మనసులో చిరస్థాయిగా నిలిచిపోతుంది. దురలవాట్లకు లోనయిన వ్యక్తులు బంధువులకు, స్నేహితులకు, భార్యాపిల్లలకు, చివరకు ఈ సమాజానికే లోకువౌతారనే నగ్నసత్యాన్ని చాటిచెప్పారు రచయిత. అక్కడక్కడ సందర్భాన్నిబట్టి ఉపమానాలు వాడటం ఈ నవలకు హైలైటు.

దుర్వ్యసనమనేది మనిషిని సర్వనాశనం చేస్తుంది. ఇదొక 'మంచువల్లకి'లాంటిది అనే నీతిని, వ్యసనపరులకు బుద్ధివచ్చేలా చెప్పిన రచయిత ఎం.ఎస్.ఆర్.చౌదరిగారికి, ఓ మంచి నవల పాఠకలోకానికి అందించిన 'చతుర'కు కృతజ్ఞతలు.

**-అవుసలి ఆంజనేయులు,** మూసాపేట.

## ఒక్క విషపుచుక్క చాలు...

*(తృతీయ బహుమతి రు. 50/- పొందిన సమీక్ష)*

కడివెడు పాలను కలుషితంచేయడానికి ఒక్క విషపు చుక్కచాలు. మనిషిలో ఎన్ని సుగుణాలుంటేనేం సమాజంలో వ్యక్తిగా 'అపకీర్తి శేముడు' కావడానికి ఒకే ఒక బలహీనత చాలు. ఇలాంటి సత్యాన్ని నిరూపిస్తుంది 'ఎండమావి' నవల.

వరకట్నం వంటి సాంఘిక దురాచారాలతో పాటు నేటి మధ్యతరగతిని పట్టిపల్లారుస్తున్న విషరోగాలు జూదం, రేసులు, మద్యపానం, లాటరీలు. ఈ సామాజిక అంటు రోగాలకు గురియైన వ్యాధిపీడితులు అటు సమాజానికి ఇటు తమ జీవితాలకు ఎలా ముప్పును కొని తెచ్చుకుంటారో వివరిస్తూ సాగిందీనవల.

లాటరీ జూదం వంటి సమస్యలు సమాజానికి కొత్తవి కాకపోయినా సాహిత్యంలో వీటిని ప్రధానంగా చిత్రించే నవలలు ఈ మధ్యరాలేదు. ఆ రకంగా ఇతివృత్తం కొత్తగావుంది.



వ్యక్తులలోని రకరకాల బలహీనతలకు ప్రతిరూపాలుగా త్రివిక్రమరావు, సత్యం, సుందరం, శివం కనిపిస్తారు. త్రివిక్రమరావు తన బలహీనతల ఉచ్చులోపడి సంసార బాధ్యతలు విస్మరించి చివరికి 'చేతులు కాలాక ఆకులు పట్టుకున్నా లాభంలేక' ఆత్మాహుతి చేసుకుంటాడు. అతని సమస్యకి పరిష్కారం 'చావు' కాకపోయినా ఆ పరిస్థితులలో ఏ వ్యసనపరుడి జీవితానికయినా అదే ముగింపు అనిపిస్తుంది.

త్రివిక్రమరావు కథ ప్రధానంగా సాగుతూ, సత్యం, శివం, సుందరంల బలహీనతలు వాళ్ల జీవితాలను ఎలా భ్రష్టు పట్టించాయో చెప్పే ఉప కథలు వరుసగా వస్తాయి. వీరి కథలను చెప్పి, ప్రధానపాత్ర త్రివిక్రమరావు కుమారులుగా ఈ ఉపకథా నాయకులను పరిచయం చేయడంతో కథలో ఏకసూత్రత, ఒక బిగువూ ఏర్పడ్డాయి. వ్యసనానికి బానిసలుగా మారిన వ్యక్తులు తమ జీవితాలనేకాక తరువాతి తరాలను కూడా ప్రభావితంచేయగల ప్రమాదాన్ని ఇందులో ధ్వనించారు రచయిత.

వ్యసనపరులు "మంచుపల్లకీ'లలో ఊరేగే మిధ్యాబింబాలు. గెలుపులో ఉన్నప్పుడు అందంగా, ఆకర్షణీయంగా ఉంటారు. ఓటమి ఎదురైతే ఎండకు కరిగి నీరవుతారు అంటూ నవల చివర ఒకే ఒక వాక్యంతో కథాసారాంశాన్ని వ్యక్తీకరించిన తీరు ప్రశంసనీయంగా ఉంది. మొత్తంమీద సామాజిక సమస్యలపట్లా, రచనా విధానం పట్లా కూడా మంచి అవగాహన కలిగివున్న రచయిత నుండి వచ్చిన చక్కని నవల 'ఎండమావి'.

—పి.కళ్యాణ సుందరి, హైదరాబాద్.

## సందేశాత్మకం

*(రు: 25/- బహుమతి పొందిన సమీక్ష)*

ఎం.ఎస్.ఆర్.చౌదరిగారి "ఎండమావి"ని సందేశాత్మక నవలగా గుర్తించవచ్చు. ముఖ్యంగా తాగుడు, జూదం, కోడిపందాలు, గుర్రపందాలు, లాటరీల ద్వారా భవిష్యత్తులో ఏదో గొప్పవాళ్ళమై పోదామనుకుని పతనం కాబోయేవారికి యీకథ మంచి గుణపాఠం అవుతుంది.

కథలో ఆదినుండి ఆఖరి వరకు మనిషిలోని ఆశ- దురాశ ఎలా పతనానికి దారితీస్తుందో చక్కగా చిత్రించి చూపించారు. అయాచితంగా ఎక్కువ డబ్బు ఒక్కసారిగా చేతికి వచ్చినా అదికూడా ఎలా అనర్థానికి దారితీస్తుందో రామనాధం పాత్ర ద్వారా రచయిత చూపారు. కాని రామనాధం జీవితంలో చేసిన ఆ మొదటి పొరపాటును మరికొంచెం స్పష్టంగా వివరించి ఉంటే ఇంకా బాగుండేది.

త్రివిక్రమరావు, సత్యం, శివం, సుందరం కథలు ముందు విడివిడిగా ప్రారంభించి చివరలో వారి బంధాలు కలపడం కొంత నూతన ప్రయోగం!

కాంతంవంటి స్త్రీలు ఆకాశంలో విహరింపజేసే నవలలు చదివి, తమకంటే పైస్థాయిలో ఉన్నవారిని చూసి డాబు, దర్పాలు పదిమందిలో ప్రకటించాలనే మూర్ఖత్వంవలన భర్తల పతనానికి ఎలా కారకులవుతారో చూపుతూ అటువంటి స్త్రీలకు జ్ఞానోదయం కలిగించేటట్లుగా వర్ణించారు.

వ్యసనాలకు బానిసలయ్యేవారిపట్ల, ఊహల్లో ఆకాశహర్మ్యాలు నిర్మించేవారిపట్ల రచయిత రాసిన ధోరణిలో కొంత వ్యంగ్యం కనిపించి సహజత్వం కోల్పోయింది.

"తన ఆస్తిపాస్తులనేకాక నుదుటి రాతను కూడా కోడళ్ళకు వారసత్వంగా ఇవ్వవలసి..." వంటి వాక్యాలు బాగున్నాయి. "వ్యసనాలు లేని భర్త కావాలనుకున్నాను, అందం గురించి, ఆస్తి గురించి ఏ క్షణమూ ఆలోచించలేదు" అని చెప్పిన పావని మాటలలో పెళ్ళికాని యువతుల ఆశలు, ఆశయాలు స్పష్టంగా కన్పిస్తున్నాయి.

కథలోని సారాంశం, గుణపాఠం అరటిపండు వలిచినట్లు చేతిలో పెట్టాక "ఉపసంహారం" అనవసరమే!

మంచి సందేశాత్మక నవల అందించిన చౌదరిగార్కి అభినందనలు. ప్రస్తుతం వస్తున్న కథలతో- చతుర అందిస్తున్న కథలు చదువుతూ గులకరాళ్ళలో ఆణిముత్యాలు ఏరుకుంటున్న అనుభూతి పొందుతున్నాం.

—ఎస్.సులోచన, బాపట్ల.




## సమస్య సమకాలీనమే గానీ...

*(రు: 25/- బహుమతి పొందిన సమీక్ష)*

మనిషి తన బాధ్యతలను గుర్తెరిగి ప్రవర్తించాలనీ, కృషితో మాత్రమే ఉత్తమ జీవితం సృష్టించుకోగలమనీ, ధనార్జనకి దగ్గర మార్గాలు లేవనీ, ఉన్నట్టు కనిపించే జూదం, పేకాట, లాటరీలు నిజానికి వ్యసనాలనీ, అవి జీవితాన్ని సమూలంగా నాశనం చేస్తాయనీ రచయిత ఈ నవలలో చెప్పదలచుకున్న నీతి. రచయిత అందివ్వదలచుకున్న ఆదర్శం మంచిదేకాని, ఉత్తమ రసానుభూతి అందివ్వడంలో 'ఎండమావి' నవల పాఠకులకు ఎండమావిగానే మిగిలిపోయింది. అది ఒక నీతిబోధ. నీతులు బోధించడానికి ఒక అవాస్తవిక కల్పనచేశారు. రచనలో విశిష్టతకాని, కల్పనలో కొత్తదనంకాని, వర్ణనలో సౌందర్యంగాని మృగ్యం. తండ్రికి లాటరీ, కొడుకులకు వరుసగా కోడిపందాలు, రేసులూ, పేకాట. ఇక వారివారి సంసారాల్లో యిబ్బందులు. అవి వివరిస్తూ పాతబడిన సంభాషణలు. వ్యసనాలకులోనైన భర్తలు లేక వ్యక్తులు ఎలా వంచనకు పాల్పడేది, ఎలా భార్యలకు శారీరక మానసిక క్షోభ కలిగించేది, వారి సంసారాలు ఎదుర్కునే భయంకర పరిణామాలూ, అన్ని వరసగా ఒకే మూసలో రాశారు. రచనంతా కృతకంగా ఉంది. వ్యసనాలకు నాశనమైన కుటుంబాలు నిజజీవితంలో ఎలా తిరిగి నిలబడగలవు అన్న విషయం కూడా రచయిత ఒక అభూత కల్పనతో సాధించాలని ప్రయత్నించారు. అయినా ఇదంతా రచయితను నిరుత్సాహపరచాలనికాదు కాని నిజం చెప్పాలనే యీ విమర్శ. రచయిత మరో మంచి ప్రయత్నం చేయగలరని ఆశ.

**—సీతాదేవి.డి, తణుకు**

## ఓటి పడవలు

*(రు. 25/- బహుమతి పొందిన సమీక్ష)*

వ్యసనపరుడు తన జీవితం వృధాచేసుకోవటమేకాక తన వారి బతుకులని కూడా అంధకారమయం చేస్తాడు అనే మాటకి అద్దంపట్టినట్లు నిలుస్తాడు ఈ నవలలోని ప్రధాన పాత్రధారి త్రివిక్రమరావు. అతని పాలిటికి అతనే హీరో అతనే విలనూ కూడా. భరద్వాజ కొడుకుతో తన కూతురి సంబంధం కట్నం కారణంగా కుదరనప్పుడు "అందని దానికి అర్రులు చాచటమే" అని తేల్చిపారేశాడు. అపుడు భర్తతో "అన్నీ తెలిసీ కూడా లాటరీ, మట్కాలంటే దురాశపడటం దేనికో" అనాలనుకుని కూడా మౌనం వహించిన సామ్యులాలు ఆయన భార్య.

చూస్తూ వూరుకోలేక మంచిమాటలతో చెప్పీ ప్రయోజనంలేక ఏవిధంగాను మారని బావగారిని సరైన దారిలో నడపాలనే సదుద్దేశంతో చెల్లెలికి మనశ్శాంతి కలిగించాలనే ధృఢనిశ్చయంతో, మేనకోడలితో కలిసి నాటకమాడించాలనే వ్యర్థప్రయత్నం చేసిన వెంకట్రామయ్య పాత్రయొక్క మంచితనాన్ని మనం మర్చిపోలేం. ఈ సూత్రధారుడి అంచనాలని, ఆశలనీ వమ్ముచేస్తూ, కూతురు పెళ్ళి కట్నంకోసం, అడుగడుగునా అవమానించబడి, స్నేహితులచేత మొండిచెయ్యి చూపించుకుని, తన తప్పులకు తానే కుమిలిపోతూ, కనీసం కొడుకులయినా తనను ఆదుకోకపోతారా అనే వెర్రి ఆశతో, ఒక్కొక్క ఇంట్లో ఎదురయిన అనుభవాలని మూటకట్టుకుని భారంగా ఇల్లుచేరాడు త్రివిక్రమరావు. చివరికి ఉన్న ఇల్లు తెగనమ్మి అయినా కన్నబిడ్డ పెళ్ళి చేయబోయిన తండ్రి ఆఖరి ప్రయత్నాన్ని కూడా కూలదోస్తూ, కొడుకు ఆ డబ్బుని రేసుల్లో సమర్పించేసి భోరున ఏడ్చాడు. తన వ్యసనాలకి వణంగా చివరికి తన జీవితాన్నే అర్పించాల్సి వచ్చింది త్రివిక్రమరావుకి.

ముగ్గురు కొడుకుల ఇళ్ళల్లో త్రివిక్రమరావుకి ఎదురయిన సన్నివేశాలు మటుకు కాస్త నాటకీయంగా అనిపించినా చెప్పాలనుకున్నది పాత్రోచితంగా చాలా చక్కగా, హృద్యంగా చెప్పారు రచయిత. అంతర్గతంగా ప్రతిపాత్రతో సంభాషిస్తున్నట్లు, పాఠకులని సమయానుకూలంగా హెచ్చరిస్తూ తన అభిప్రాయలను స్పష్టంగా, సూటిగా చెప్తూ ఏకబిగిన చదివింపజేసిన రచయితఎం.ఎస్.ఆర్.చౌదరిగారుఅభినందనీయులు.

**—పి.కనకదుర్గ, మద్రాస్.**



# చతుర కథలు

## మారణాయుధాలు

మారణాయుధాలమ్మాడన్న నేరం క్రింద మా క్యాంటీన్ జగన్నాథాన్ని పోలీసులు అరెస్టుచేశారన్న వార్త విని షాక్ తిన్నాన్నేను.

జగన్నాథమేమిటి? మారణాయుధాలమ్మడమేమిటి? అదీ సంఘవిద్రోహ శక్తులకి! ఓ పట్టాన నమ్మశక్యం కావడం లేదు నాకు.

నాకు తెలిసినంతవరకూ జగన్నాథం వట్టిడద్దమ్మ. కనీసం వ్యాపారం ఎలా చేసుకోవాలో కూడా తెలిసి చావదు. ఒక్క పదార్థమూ రుచిగా చేయడు. మాడుకంపుతో కొన్ని ఉంటే ఉడికీ ఉడకనివి కొన్ని. వాటికే ఇడ్లీ, అట్టు, ఉప్మా అంటూ ఏవేవో పేర్లు పెట్టి మా ముఖాన తగలేస్తుంటాడు. అందుకే మాలో చాలామంది మా కాలేజి క్యాంటిన్‌కి పోకుండా రెండు



ఫర్లాంగుల దూరమైనాసరే, రోడ్డు మీద ఉన్న 'పద్మజ కేఫ్'కే వెడుతుంటారు. అయినా మా వెధవకి బుద్ధిరాదు. ఎదుటివాడు అదే బిజినెస్‌లో ఎలా పైకి వస్తున్నదీ గమనించడు. అలాంటి జగన్నాథం... ఉల్లిపాయనెలా కోయాలో తెలీని సన్నాసి, మారణాయుధాలమ్ముడమా! నో... నో ఇట్స్ ఇంపాజిబుల్! ఇందులో ఏదో తేడా ఉంది. ఎవరో కుట్రచేసి వాడ్నీకేసులో ఇరికించారు అనుకున్నాను.

★ ★ ★

ఎంత ప్రాధేయపడినా జగన్నాథానికి బెయిల్ యివ్వడానికి యస్సై అంగీకరించలేదు.

''పోనీ ఒక్కసారి అతనితో మాట్లాడతాం సార్!'' అన్నాం వినయంగానే.

మొదటవద్దన్నా తర్వాత ఏమనుకున్నాడో ఒప్పుకున్నాడతను.

మమ్మల్ని చూడ్డంతోనే ఘొల్లుమన్నాడు జగన్నాథం. అతి ప్రయత్నంమీద ఎలాగో సముదాయించి, అసలు విషయం ఆరాతీశాను.

''నాకే పాపం తెలియదు సార్... నిన్న మంచిగిరాకీ బేరాలు తగిలాయి. బయట నుంచి పెద్దపెద్ద ఆర్డర్లు కూడా వచ్చాయి. ఆ సంతోషం ఎక్కువసేపు నిల్వకుండానే ఈ పోలీసోళ్లు లాక్కొచ్చి ఇక్కడ పడేశారు సార్''

''ఎందుకు?''

''గుడివీధిలో కొట్లాటేదో జరిగిందట'' ఏడుపు ముఖంతో అన్నాడు జగన్నాథం.



''అయితే దానికీ నీకు సంబంధమేమిటి?'' ఆశ్చర్యంగా అడిగాన్నేను.

''అది నేచెబుతాను...'' ఎప్పుడొచ్చాడో ఏమో యస్సై కంఠం ఖంగున మ్రోగింది. మేమిద్దరం ఉలిక్కిపడి అటుతిరిగాం.

''...నిన్న సాయంత్రం జరిగిన కొట్లాటలో నలుగురి తలలు పగిలాయి. పదిమందికి కాళ్లూ చేతులూ విరిగాయి...''

నేను ఏదో అనేంతలో ఆయనే, ''అందుక్కారణం ఈ జగన్నాథం అమ్మిన మారణాయుధాలే! అవి ఉపయోగించడంవల్లే ఇరువర్గాలూ తీవ్రంగా గాయపడ్డాయని మా దర్యాప్తులో తేలింది. కావాలంటే మీరే పరీక్షించి చూడండి ఇందులోనే ఉన్నాయవి'' అంటూ ఓ సంచిని నాకందించబోయాడు.

భయంతో నాచెయ్యి వణకడంతో సంచిజారి మా సుబ్రావ్ కాలిమీద పడింది. అంతే... హృదయవిదారకమైన ఆర్తనాదమొకటి సుబ్రావ్ నోటినుంచి అప్రయత్నంగా వెలువడింది.

అలా జారిపడిన సంచిలోంచి ఇనుప బంతుల్ని సీసపుగుండ్లని సవాలుచేసే పుణుగులు, వడలు బయటకు దొర్లాయి. గచ్చునేల అక్కడక్కడా పగుళ్లు చూపింది. అవన్నీ మా జగన్నాథం తయారీనే అనడంలో మాకెవరికీ సందేహం కలగలేదు.

—చంద్రప్రతాప్

## కొత్త అధ్యక్షుడు

''దేశసేన'' పార్టీ ప్రధాన కార్యాలయంలో మీటింగు. అది దేశంలోకెల్లా పెద్ద పార్టీ. ఇప్పుడు దాని అధ్యక్షుడు ఎనభయ్యేళ్ల మహా నాయకుడు. ఆయన కొడుకులు అందరూ మంత్రులుగా ఉన్నారు. అల్లుళ్ళు ప్రభుత్వంలో అత్యున్నతాధికారులుగా పనిచేస్తున్నారు. మనవళ్లు ఎమ్మెల్యేలుగా ఉన్నారు.

ఆరోజు పార్టీలోని ప్రముఖ సభ్యులందరూ మహోత్సాహంతో కార్యాలయంలో సమావేశమయ్యారు.

కారణం, ఎన్నికలలో ఆ పార్టీ అనుకోకుండా ఘనవిజయం సాధించింది. పార్టీ అధ్యక్షుడు దేశాధినేత అవుతున్నాడు. అందువలన పార్టీ నిబంధనల ప్రకారం కొత్త అధ్యక్షుడిని ఎన్నుకోవాలి.

సమావేశం ప్రారంభమైంది.

అధ్యక్షుడు లేచి ''సభ్యులారా పార్టీకి కొత్త అధ్యక్షుడిని ఎన్నుకోవాలి. ఏకగ్రీవంగా ఎన్నుకుంటే మనపార్టీకి మంచిపేరు వస్తుంది. నాదృష్టిలో ఒకే ఒక వ్యక్తి గొప్ప సమర్థుడు ఉన్నాడు. ఆయనను మన అధ్యక్షునిగా నియమిస్తే బాగుంటుంది- ఏమంటారు'' అన్నాడు.

సభ్యులంతా ఒకరి ముఖం ఒకరు చూచుకున్నారు.

ఒకరు లేచి ''ఆయన గొప్ప నిజాయితీపరుడై ఉండాలి'' అన్నాడు.

''ఆమాత్రం నాకు తెలీదా! ఆయన చాలా నిజాయతీపరుడు'' అన్నారు అధ్యక్షులవారు.

''అవినీతి ఆరోపణలుండకూడదు'' అన్నాడు కార్యదర్శి

''ఏమీలేవు'' అధ్యక్షుడు ధీమాగా సెలవిచ్చారు.

''సత్ప్రవర్తన కలిగి ఉండాలి. క్రమశిక్షణగా ఉండాలి'' అన్నారింకొకరు.

''ఆహా! ఉంటాడు'' అన్నారు అధ్యక్షులవారు.

అంతే! ఇక ఏ ప్రశ్నలూ రాలేదు.

''ఎవరాయనా? ఎక్కడున్నారు'' అని మాత్రం అడిగారు.

అధ్యక్షుడు ''ఈరోజు సాయంత్రం 5 గంటలకు ఆయనను తీసుకొనివస్తాను. అతడ్ని ఏకగ్రీవంగా ఎన్నుకోందాం. ఈలోగా పత్రికలవారికి, రేడియో, టి.విల వారికి కబురు చేయండి'' అని చెప్పి కార్లో వెళ్ళిపోయాడు.

సాయంత్రం అయింది. పార్టీ కార్యకర్తలందరూ పెద్దపెద్ద పూలమాలలు, దండలు చేతుల్లో ఉంచుకొని ఎదురుచూస్తున్నారు. కార్యాలయం ఆవరణ అంతా మహాసందడిగా ఉంది. ఒక ప్రక్క టి.వి. రేడియోవాళ్లు, పత్రికా




విలేఖరులు నిలబడి ఉన్నారు. పెద్దపెద్ద అధికారులు కూడా ఆహ్వానించడానికి వచ్చారు.

కొత్త అధ్యక్షుడు ఎవరా అని వాతావరణం అంతా గొప్ప ఉత్కంఠపూరితంగా ఉంది. కొత్త అధ్యక్షుని మంచిచేసుకోవడాన్కి ఎవరికివారే ముందు వరుసలో నుంచోవడానికి ప్రయత్నిస్తున్నారు.

ఇంతలో కార్లు వచ్చాయి. ముందుకార్లో నుంచి అధ్యక్షుడు దిగి నవ్వుతూ- ''రండి. కారు వెనకసీట్లో కొత్త అధ్యక్షుడు ఉన్నారు. వెళ్ళి తీసికొని రండి'' అన్నాడు.

అందరూ పోలోమంటూ కారుదగ్గరికి వెళ్ళి చూసి నిర్ఘాంతపోయారు.

టివి కెమేరా ఆగిపోయిన విషయం కూడా గమనించకుండా కెమెరామెన్ నోరుతెరుచుకొని చూస్తున్నాడు.

మిగిలిన అధికారులు, విలేఖరులు ఆశ్చర్యంగా చూశారు. కొత్త అధ్యక్షుని చూసినవారెవరికీ నోటమాట రాలేదు. ఇంతకీ ఆ కొత్త అధ్యక్షుడు మరెవరో కాదు. అధ్యక్షులవారి రెండుసంవత్సరాల మునిమనుమడు కారు వెనకసీట్లో కూర్చొని బొమ్మతో ఆడుకుంటూ జనాన్ని చూచి చేతులు చాచాడు ఎత్తుకోమని.

—పొత్తూరి నాగేంద్రమ్

చతుర

సంపుటి : 13 డిసెంబర్ 1990 సంచిక : 11

కోర్టుకి బయల్దేరిన లాయర్ కొడుకుని 'రాహుకాలం' ఉందిరా కాస్సేపాగి వెళ్ళు' అంటాడాయన. ఇరవైరెండు సామాన్ల మూటలతో బస్సెక్కి లగేజీ ఛార్జీకి రూపాయి పావలాకంటే ఎక్కువ ఇవ్వనని కండక్టరుని బెదిరిస్తాడు. విధవ అయిన మనవరాలు స్నేహితురాలి పెళ్ళికెళ్తే ఇదెక్కడి చోద్యమని ఆశ్చర్యపోతాడు. ఎం.ఎల్.ఏ.లని సైతం అరేబరే అని పిలిచి, వారి లోపాల్ని ఎత్తిచూపి చెడామడా చెరిగేస్తాడు.

అరవైలో ఇరవై వయసైనట్లు కుర్రాళ్ళకంటే చురుగ్గా ఉండే ఆ పెద్దాయన రాకరాక పట్నానికి సతీసమేతుడై వచ్చాడు. నవనాగరీకులైన కొడుకు, కూతురు కుటుంబాల్లో తన చాదస్తంతో చిన్నచిన్న సమస్యల్ని సృష్టిస్తుంటాడు. ఆయన వాదనల్ని కొట్టిపారేయనూలేక, ఆచరించనూలేక అయినవాళ్ళంతా సతమతమయ్యారు.

అయితే మూర్తీభవించిన ఆ ఛాందసుడే ఆధునికులు ఆచరించడానికి వెనుకాడిన ఓ మహత్కార్యాన్ని అవలీలగా నిర్వహించాడు. అందుకు తన మూఢవిశ్వాసాల్ని సైతం త్యజించాడు. అది ఎలా సాధ్యపడింది?

నిన్నటివరకూ సజీవమైన బండరాయిలా తోచినా నేడు మహాశిల్పి చెక్కిన దేవుడి విగ్రహంలా కనిపించి తనవాళ్ళందరికీ ఎలా ఆశ్చర్యానందాలు కలిగించాడు? ఆయనలోని మార్పుకు బలీయమైన కారణాలు ఏవి? ఆ మార్పులవల్ల మనశ్శాంతిని, లబ్ధిని ఎవరెవరు పొందగలిగారు?

చిరుచిరుహాస్యంతో, లలిత
లలిత పదజాలంతో

కాశీవిశ్వనాథ్ రాసిన

# పంతులుగారి పట్నవాసం

ఈనెల చతుర సమర్పిస్తున్న సమగ్ర నవల

ఎట్టకేలకు నరసింహం పంతులుగారు చింత లఅగ్రహారం విడిచిపెట్టి విశాఖపట్నం బయలుదేరారు.

పల్లెటూర్నించి పట్నంవెళ్లడం ఈ రోజుల్లో పెద్దవిశేషమేమీకాదుగానీ, డెబ్బైఎనిమిది సంవత్సరాలుగా చింతలఅగ్రహారానికి అంటుకుపోయి, తనకున్న ఆరుఎకరాలు సేద్యంచేసుకోడంలోనే జీవితానికి అర్థాన్నీ పరమార్థాన్నీ చూసుకుని సంతృప్తిచెందిన మనిషి పంతులుగారు. ఇప్పుడు, యిన్నేళ్లకి భార్య కామేశ్వరమ్మతోసహా పట్నంలోవున్న కొడుకు వెంకటాచలపతి దగ్గరకి వెళ్లడం ఆయన మనస్తత్వం తెల్సినవాళ్లందరికీ చోద్యంగానే తోచింది.

చింతలఅగ్రహారం బహుశా ఆంధ్రదేశపు మేప్‌లో ఎక్కడా కనబడకపోవచ్చు. విశాఖజిల్లా, శ్రీకాకుళంజిల్లా మేపులుచూసినా ఆ గ్రామం కనబడుతుందనే నమ్మకంలేదు.

నాగరికత ఛాయలు ఏమాత్రమూ కమ్ముకోని కుగ్రామం అది. గ్రామాభివృద్ధికోసం ప్రభుత్వం వేసిన పథకాల్లోనించి, ఏ కారణంచేతనో ఆ ఊర్ని మినహాయించినట్టుంది. అందుకే ఓ యిరవైఏళ్లక్రితం కరెంటు దీపాలు వెలగడం, ఆ వూళ్లోని వెంకటరాజుగారి ఇంటికిఫోను, రేడియో రావడం మినహా మరో కొత్తదనం ఏదీ చోటుచేసుకోలేదు. దాన్ని వూరు, అనడమేగాని అట్నుంచి యిటుచూసినా, యిట్నుంచి అటుచూసినా వందానూటపాతిక గడపదాటి వుండదు.

పంతులుగారికి ఏంచెప్పినా వెంకటరాజుగారే చెప్పాలి. ఏం తెలుసుకోవాలన్నా ఈయన ఆయన్ని అడిగే తెలుసుకుంటాడు, ఆయనపట్ల పంతులుగారికుండే నమ్మకం, గౌరవం అలాంటివి. రెండు మూడు రోజులు ఆలస్యంగానైనా రాజుగారికి న్యూస్‌పేపరు వస్తుంది. అందులోని వార్తలేమైనా అప్పుడప్పుడు ఆయనద్వారా వినడమే ఆయనకున్న నాలెడ్జి. ఊర్లో ఎవరికైనా జబ్బులూ, జ్వరాలూ వచ్చినప్పుడు గచ్చాకు, పుచ్చాకు యిచ్చి పంతులుగారు వైద్యమైతే చేస్తారుగాని ఎవరూ ఆయన్ని వైద్యుడిగా గుర్తించలేదు. శుభకార్యాలకి, అప్పుడప్పుడు కొంతమందికి ముహూర్తాలు పెట్టిన సందర్భాలూ వున్నాయి.

ఆయనభార్య కామేశ్వరమ్మ అతనికంటే మూడేళ్లే చిన్నది. నెరిసినజుత్తుని బట్టి, పట్నాల్లో వుంటున్నకొడుకు, కూతుర్నిబట్టి, వాళ్ల సంతానాన్ని బట్టీ ఆ ముసలాళ్లకంత వయసుందని అనుకోవాలితప్ప వారి ఆరోగ్యాలూ చలాకీతనమూ చూస్తే వాళ్లకంత వయసు వుంటుందని ఎవరూ అనుకోరు.

పొట్టిగా, బొద్దుగావుంటూ, అరంగుళం పొడవుదాటని కేశాలతో, చిన్న పిలకతో, ఎప్పుడూ తాంబూలం నముల్తూ, చలాకీగా తిరుగాడే పంతులుగార్ని ఒకసారి చూస్తే మర్చిపోవడం కష్టం. ఆయన భార్య అన్నివిధాలా ఆయనకి సరైన జోడీ. హైదరాబాద్‌లో వున్న అల్లుడు నారాయణరావు మాటల్లో చెప్పాలంటే "మా మామగారు, అత్తగారూ యీ శతాబ్దంనాటివాళ్లు కారండి, పద్నాలుగో శతాబ్దం తొలిదశకంలో పుట్టి, భగవంతుణ్ణి ఏదో మాయంచేసి, యింత వరకూ చింతలఅగ్రహారంలో బతికేస్తున్నారు" అంటాడు.

"విశాఖపట్నంలో మీ అబ్బాయి లాయరుగా ఝామ్మంటూ బతికేస్తున్నాడు. హైదరాబాదులో మీ అమ్మాయి అల్లుడు దర్జాగా జీవిస్తున్నారు. మీరింకా యీ అగ్రహారం పట్టుకుని వూగిసలాడ్డం, ఏంఖర్మ... వాళ్లదగ్గరకి వెళ్లిపోరాదా" అంటూ కొంతమంది సలహా యిచ్చారు. కానీ, వాళ్లమీద పంతులుగారు కస్సుమంటూ ఒంటికాలిమీద లేచారు.

"వాళ్లు అక్కడ సుఖంగా వున్నారుకదాని, మేంవెళ్లి వాళ్లమీద వాలిపోయిబతకాలా? అంతఖర్మ మాకేంపట్టింది? మేం బతకడానికి ఇక్కడ పొలంలేదా? మాకు పొలం దున్నుకునే శక్తిలేదా?" అంటూ తన వ్యక్తిత్వాన్ని ఆత్మాభిమానాన్ని ప్రకటించేడు. ఆయన భార్య సరేసరి. "మీ అభిప్రాయం ఏవిటమ్మా?" అని అడిగితే "ఆయనేంచెప్పేరో విన్నారుగా, మళ్లీ నన్ను అడగడందేనికి? ఆయన్దోమాట, నాదో మాట వుంటుందని ఎందుకనుకుంటున్నారు" అనేది.

అంచేత ఈ మధ్యకాలంలో ఎవరూ ఆ విషయం ప్రస్తావించడానికి సాహసించలేదు.

వాళ్ల అభిప్రాయాలు ఎంతబలమైనవో





వాళ్లబ్బాయి చలపతికి తెలుసు. కాబట్టే, "మీరు పట్నంవచ్చెయ్యండి" అని చెప్పి చీవాట్లు తినేబదులు, "మేమే అప్పుడప్పుడు మీదగ్గర కొచ్చి చూస్తుంటాం" అనేశాడు. అలాగే, అప్పుడప్పుడు కుటుంబసమేతంగా వస్తున్నారు, వెళ్తున్నారు. అంచేత నర్సింవంతులుగారికేనాడూ విశాఖపట్నంగాని, హైదరాబాదుగాని వెళ్లాల్సిన అవసరంకలగలేదు.

పంతులుగారు జీవితంలో ఏనాడూ వూరి నుంచి కదల్లేదా అంటే, కదలకేం కదిలారు. నాలుగంటే నాలుగుసార్లు బయట వూళ్ళు వెళ్ళారు.

కొడుకు పెళ్ళికి, కూతురి పెళ్లికి, భద్రాచలం ఓసారి, అన్నవరం ఓసారి వెళ్లారు. తర్వాత ఎన్నో ఏళ్లకి మనవడు శంకరానంద్ పెళ్ళికి తిరపతి, మనవరాలు సుజాత పెళ్ళికి మళ్ళీ అన్నవరం వెళ్లారు.

అప్పుడు కూడా ఏదో దూరపు బంధువులా ఇలా వెళ్ళి అలా నాలుగు అక్షింతలు జల్లేసి, చేతులు దులిపేసుకుని మర్నాడు వచ్చెయ్యడం మినహా ఏనాడూ పట్నమని నాలుగు రోజులుండలేదు. అంచేత ఆయనకి తెల్సిన పట్టణాలంటూ ఏమైనా వుంటే అవి: తిరపతి, అన్నవరం, భద్రాచలం మాత్రమే.

అలా ఆ గ్రామానికే అంకితమైపోయిన పంతులుగారికి, వైజాగ్‌లో లాయరుగా కొడుకు స్థిరపడ్డం, హైదరాబాద్‌లో కూతురు ఓ ఆఫీసరు భార్యగా కాపురం చేయడం ఎలా సంభవించిందాని కొంతమంది ఆశ్చర్యపోతుంటారు. కానీ, అసలు సంగతి నర్సింవంతులుగారికో తమ్ముడుండేవాడు. అతను ఉద్యోగరీత్యా విశాఖపట్నం వెళ్ళిపోయాడు. ఎన్నాళ్లకీ ఆయనకి సంతానం కలక్కపోయేసరికి అన్నయ్య కొడుకుని, కూతుర్నీ కూడా తన యింటికే తీసుకుపోయి చదివిస్తూ బిడ్డలులేని లోటుని తీర్చుకున్నాడు. చలపతిని లాయరుగా తయారుచేశాడు. అతని చెల్లెలు రాజేశ్వరిని గ్రాడ్యుయేట్ అనిపించేడు. వాళ్ళిద్దరి పెళ్ళిళ్ళూ అతనే జరిపించేడు. చలపతికి పుట్టిన శంకరానంద్‌కి, సుజాతకీ గూడా ఆయన సంబంధాలు చూసి పెళ్ళిళ్ళు చేశాడు. సుజాత పెళ్లైన నెలకే ఆయన కాలం చేయడం జరిగింది. ఈ అన్ని పెళ్ళిళ్ల సంబంధాల విషయంలోనూ అన్ని నిర్ణయాలూ ఆయనే తీసుకున్నాడు. నర్సింవంతులుతో ఓ మాట చెప్పటం తప్ప ఎప్పుడూ సంప్రదించలేదు.

ఇలా యిన్నేళ్ళూ గ్రామానికి అతుక్కుపోయిన పంతులుగారికి యిప్పుడు పట్నం ఎందుకు వెళ్లాలని బుద్ధిపుట్టిందీ అంటే, అందుకో కారణం వుంది. ఓసారి కాశీయాత్ర వెళ్దామని ఆ దంపతులిద్దరూ ఎన్నోసార్లు అనుకున్నారుగాని కుదరలేదు. ఈసారి కాశీ వెళ్లటంతోపాటు పనిలో పనిగా ఆగ్రా వెళ్ళి తాజ్‌మహల్ చూసొచ్చెయ్యాలని నిర్ణయించుకునే బయలుదేరారు. ముందు విశాఖపట్నం వెళ్ళి కొడుకు దగ్గర నెలరోజులు గడిపి, తర్వాత హైదరాబాద్ వెళ్ళి అక్కడో నెల గడిపి, అట్నుంచి అటే తీర్థయాత్రల్కెళ్లాలని ప్లాన్ చేసుకున్నారు.

పట్టణానికి బయలుదేరడానికి వారం రోజులు ముందునుంచీ అగ్రహారంలో వున్న యింటింటికీ వెళ్ళి, తన తీర్థయాత్ర గురించి చెప్పేడు. వెంకటరాజుగారికైతే నెలరోజుల్నించీ నిత్యం చెప్పిందే చెప్తూ వచ్చేడు.

అగ్రహారంనించి రెండుమైళ్ళు నడిస్తేగానీ పెద్ద రోడ్డు తగలదు. బస్సు ఆ రోడ్డు మీదే ఆగుతుంది. గొడుగుతోసహా మొత్తం యిరవై రెండు సామాన్లతో బయలుదేరుతున్న పంతులుగారిని చూసి వెంకటరాజుగారు, బస్సు దగ్గరకెళ్లడానికి తన ట్రాక్టరు యిచ్చేడు. తన పొలాన్ని యింటినీ జాగ్రత్తగా చూడమని రాజుగారికి పదేపదే చెప్పి ట్రాక్టరుమీద రోడ్డు దగ్గరకొచ్చేడు.

అక్కడో గుడిసెలో నలుగురు కుర్రాళ్లు పేకాడుతుంటే వాళ్లని పిలిచేడు.

"ఒరే వెధవల్లారా... చూస్తే వేలెడంత లేరు, మీ ముఖాలకి పేకాట కావాల్సొచ్చిందట్రా? ఇలా వచ్చి సామాన్లు దించండి" అంటూ వాళ్లమీద తనకేదో అధికారం వున్నట్టు గద్దించేడు. ఆయన నోరు సంగతి తెల్సిన కుర్రాళ్ళు పేకముక్కలు అలా పడేసి, గబగబా వచ్చి సామాన్లు దించేరు. ఒకవేళ దేవుడు ప్రత్యక్షమైతే అతన్ని 'ఏమండీ' అని పిలుస్తాడేమో



గాని, ఎటువంటివారినైనా ఒరేయ్ అనే పిలుస్తాడాయన. అది మొదట్నుంచీ వచ్చిన అలవాటు. ఆ పిలుపునించి తప్పించుకున్న ఏకైక మానవుడు- వెంకటరాజుగారే.

సామాన్లు దించేక ట్రాక్టరు వెళ్ళిపోయింది. ఓ అరగంట తర్వాత బస్సు వచ్చింది. రెండు సీట్లు అయితే ఖాళీగానే వున్నాయిగానీ యిరవైరెండు సామాన్లు మాత్రం లగేజి వెయ్యనన్నాడు కండక్టరు. అంతే! ఆ మాటనగానే పంతులు బస్సు ఎక్కి చెడామడా వాయించేశారు.

"మనిషన్నాక సామాన్లుండవట్రా? ఊరగాయో, అప్పడాలో లేందే ఎవడికైనా యింత ముద్ద దిగుతుందా? అందుకే రెండూ రెండు జాడీల్లో సర్దేం. కొడుకు దగ్గరకెళ్తున్నప్పుడు పండో, కాయో పట్టుకెళ్లకుండా చేతులు వూపుకుంటూ నింగూనింగూమంటూ వెళ్ళిపోతామా? అందుకే ఓ బుట్టెడు బత్తాయిపళ్ళు, ఓ యాభై మినప సున్నుండలు పట్టుకెళ్తున్నాం. ఇలాంటివన్నీ వున్నప్పుడు యిరవైరెండు శాల్తీలుకాదు, ముప్పయ్యారన్నా అవుతాయి. అయితే మాత్రం వద్దంటానికి నువ్వెవడివిరా? కావాలంటే ఓ అణా ఓ బేడో అదనంగా తీస్కో" అంటూ గంయ్‌మనేసరికి కండక్టరు నోరుపడిపోయింది.

అణాలూ, బేడలూ చెలామణీలో వున్నప్పటికి కండక్టరు పుట్టలేదు. అయినా వాటి విలువెంతో తెల్సు.

ఇరవైరెండు సామాన్లకీ కలిపి లగేజికి పదిహేను రూపాయలవుతుందన్నాడతను లెక్కలువేసి.

"వెధవా... పదిహేను రూపాయలంటే మాటలనుకున్నావా! మా పెరట్లో డబ్బులచెట్టుందనుకున్నావా లేక మా పొలంలో పాతరేదైనా దొరికిందనుకున్నావా? అయినా ఆ సామాన్లని నువ్వేమైనా నెత్తిమీద పెట్టుకు మొయ్యాలా... బస్సేగా మోస్తుంది. నేను అన్నింటికీ కలిపి రూపాయిపావలా కంటే ఎక్కువివ్వను" అంటూ మొండికేశాడు పంతులు.

ఘర్షణ పెరిగింది. పంతుల్తోపాటు కామేశ్వరమ్మ కూడా కండక్టర్‌తో పెద్దగా అరుస్తూ మాట్లాడింది. 'నాకీ పాసింజరొద్దు' అంటూ కండక్టరు బస్సు ఎక్కి పోబోయాడు. కానీ పంతులు అతని చొక్కా పట్టుకుని మరీ ఒక్క గుంజు గుంజేడు.

ఈ గొడవవల్ల బస్సు అక్కడే అరగంటసేపు ఆగిపోయింది. మేం ఎక్కకుండా బస్సు కదలడానికి వీల్లేదని బస్సుకి అడ్డంగా నిలబడిపోయేడు పంతులు. దాంతో బస్సులోని మిగతా పాసింజర్లు కలగజేసుకోక తప్పలేదు.

ఒక్క పైసాగూడా లగేజి చార్జి తీసుకోకుండా కండక్టరూ, డ్రైవర్ ఆ సామాన్లని టాప్‌మీద వేశారు. ఆ దంపతుల్ని తీసుకుని బస్సు కదిలింది.

"ఇవాళ నిద్ర లేవగానే ఎవరిముఖం చేసేనో" అనుకుంటూనే భయంభయంగా వాళ్ళిద్దరికీ టిక్కెట్లు కట్‌చేశాడు కండక్టరు.

బస్సులో కొంతమంది మాగన్నుగా నిద్రపోతున్నారు. మరికొంతమంది ఆవులింతలు తీస్తున్నారు. పంతులు సంచిలోనించి నిప్పుల మీద కాల్చిన జొన్నకండెలు తీసి ఒకటి కండక్టరుకి, మరొకటి డ్రైవరుకీ యిచ్చేడు.

"అక్కర్లేదు" అన్నాడు కండక్టరు కాస్త అలిగినట్టుగా.

"నీ ఏబ్రాసి ముఖానికి అలగటం ఒక్కటే తక్కువ - తిను" అంటూ పంతులు గదమాయించేడు.

తినకపోతే బస్సులోనించి కిందకి తోసేస్తాడేమోనని భయపడి, తింటం ఆరంభించేడు కండక్టరు.

మిగతా జొన్నకండెలు తన పక్కసీట్లో కూర్చున్నవాళ్లకిచ్చేడు. తర్వాత ఒక్కొక్కరి పేరూ, వూరూ, ఎందుకు ప్రయాణం చేస్తున్నదీ అడిగి తెల్సుకున్నాడు. నిద్రపోతున్న వాళ్లని వీపుమీద చరిచి మరీ వాళ్ల వివరాలు అడిగేడు. వాళ్లు విసుక్కుంటే వాళ్లని తిట్టేడు "పగటిపూట నిద్రేవిట్రా పనికిమాలిన వెధవల్లారా" అన్నాడు.

బస్సు వెళ్తోంది. కొన్నిచోట్ల ఆగుతోంది. పేసింజర్లు ఎక్కుతున్నారు, దిగుతున్నారు. వాళ్లతో ప్రమేయం పెట్టుకోకుండా నర్సింపంతులు పక్కవారికి పాతకాలంనాటి కబుర్లు చెప్తూనే వున్నాడు.





"ఇప్పుడంటే ఇటువంటి బస్సులు వచ్చే యిగాని, మొన్నమొన్నటిదాకా బొగ్గుతో నడిచే బస్సులుండేవి..." అన్నాడాయన.

"మొన్నమొన్నటిదాకా అంటే మీరు ఎప్పటి విషయం చెప్తున్నారు?" అంటూ ఓ ముప్ఫ య్యేళ్ల యువకుడు ఆశ్చర్యంగా అడిగేడు.

"పందొమ్మిది వందల నలభై అయిదూ, నలభై ఆరూ ప్రాంతాల్లో విశాఖపట్నం నించి, మా చింతల · అగ్రహారందాకా చోడవరం నాయుడుగారి ఎర్రమూతి బస్సు నడు స్తుండేది..."

ఆ మాటలు వింటున్న ఓ యిరవై ఏళ్ల అబ్బాయి కిసుక్కున నవ్వి పక్కనున్న మరో అబ్బాయితో- "ముసలాడు భలే కోస్తున్నా డ్రోయ్" అన్నాడు.

ఆ మాటలు పంతులికి వినిపించేయి. గభీ మని లేచివెళ్లి, ఆ కుర్రాణ్ణి చొక్కా పట్టుకుని నిలబెట్టాడు. "ఏవిట్రా కూస్తున్నావు - నేను కోత లు కోస్తున్నానా?"

ఆ కుర్రాడు బెదిరిపోయాడు.

"అదికాదు తాతగారూ! బొగ్గుతో రైళ్లు నడు స్తాయిగాని, బస్సులు నడుస్తాయాని..." నీళ్ళు నమిలేడు.

"ఏం... ఎందుకు నడవ్వూ. రైళ్ళు నడవగా లేంది బస్సులు నడవ్వా? అప్పుడు అలాగే నడిచేవి! వాటికి బొగ్గువేసి, ఇంత ఇనపరాడ్డు పెట్టి గిర్రుమంటూ తిప్పేవాళ్లు! ఎంత తిప్పినా అది గంటకి అయిదుమైళ్ళు కంటే ఎక్కువ వెళ్ళేదుకాదు. తర్వాత పెట్రోలు బస్సులొచ్చి ఆ బస్సులు మూలపడ్డాయి. నీవాటం చూ స్తుంటే, రేపొద్దుట ఎవడైనా బొగ్గుతో రైళ్ళు నడిచేవని చెప్పినా కిసుక్కుమని నవ్వేట్టు న్నావ్"

కుర్రాడికి కళ్లంట నీళ్ళు తిరిగాయి. "మగా డు ఏడిస్తే మహా దరిద్రంగా వుంటుంది" అని మరోసారి హూంకరించి, అబ్బాయి చేతికో జొన్నకండె యిచ్చాడు.

★ ★ ★

విశాఖపట్నం ఆర్టీసీ బస్ కాంప్లెక్స్‌లో లాయరు వెంకటాచలపతి, ఆయన కొడుకు శంకరానంద్ నర్సింపంతులొచ్చే బస్సుకోసం దాదాపు గంటనించీ నిరీక్షిస్తున్నా ఆ బస్సు రాలేదు.

రాత్రి ఏడయింది. ఎనిమిదైంది. అయినా బస్సు రాలేదు.

"బహుశా తాతయ్య రాసిన ఉత్తరంలోని డేటు నువ్వు సరిగా చూడలేదేమో నాన్నా" అన్నాడు ఆనంద్ అసహనంగా.

చలపతి జేబులోనించి ఉత్తరం తీసి చూ పించేడు. నర్సింపంతులు తను ఎప్పుడు వస్తున్నాడో ఉత్తరంలో రాసి, దానిక్రింద ఎర్ర సిరాతో అండర్‌లైన్ కూడా చేశాడు. బ్రాకెట్లో ఆ తేదీని అక్షరాల్లో కూడా రాసేడు.

"మా నాన్న బయలుదేరుతానూ అన్నా డంటే బయలుదేరతాడ్రా! ఆయన పట్టుదల నీకు తెలీదు" చలపతి ఎంతో నమ్మకంగా చెప్పేడు.

తొమ్మిదిన్నరయింది. "ఇంక బస్సు రానట్టే" అనుకున్నారు తండ్రీకొడుకులు. "బహుశా ఏ కారణాంతరాలవల్లో మా నాన్న ఈరోజు రాలేదు. రేపు మధ్యాహ్నం వరకూ చూసి, నువ్వు కార్లో మావూరెళ్లి దగ్గరుండి మా నాన్నని, అమ్మనీ తీసుకురా" అని చలపతి కొడుక్కి గట్టిగా చెప్పి, కార్లో యింటికి బయలుదేరారు.

రాత్రి పదకొండు గంటలవేళప్పుడు నర్సింపంతులు ఓ బియ్యం లారీలో భార్యాస మేతంగా ఆసీలుమెట్ట జంక్షన్‌లో దిగేడు.

"దిక్కుమాలిన బస్సు. దారిమధ్యలో దు కాణం పెట్టేసరికి యీ ముదనష్టపు లారీ ఎక్కాల్సొచ్చింది. ఒళ్లంతా పుండైపోయిందా" అంటూ డ్రైవర్ని తిట్టి, రెండు ఆటోల్ని పిలిచే డు.

తన కొడుకువుండే ఎడ్రస్ కాగితాన్ని ఆటో డ్రైవర్లకిచ్చి, అక్కడికి పోనియ్ అన్నాడు. ఓ ఆటోనిండా సామాన్లు సర్దినా ఇంకా మిగిలాయి.

"మీ ఆటోలు యింకాస్త విశాలంగా వుంటే మీ సొమ్మేంపోయింద్రా" అంటూ డ్రైవర్లని తిట్టి, రెండో ఆటోలో కూడా కొన్ని సామాన్లు పెట్టేడు.

సంచిలోనించి ఓ కొబ్బరితాడు తీసి రెండు ఆటోలకి ముడివేసాడు.

"తాడెందుకుకడతన్నారు తాతగారు?"



అన్నాడో డ్రైవరు ఆశ్చర్యంగా.

"ఎందుకేవిట్రా! మేం యిద్దరం ముందు రిక్షాలో వెళ్తుంటే, వెనక రిక్షాలో వాడు సామాన్లతో అట్నుంచి అటే వుడాయించేస్తే ఏంచెయ్యగలం చెప్పు" అంటూనే ఈ తాడు కట్టేడు.

"మామీద అంత అనుమానం వుంటే మీరో బండిలోనూ, అమ్మగారో బండిలోనూ కూర్చోండి" అన్నాడు రెండో డ్రైవరు.

"నీ తెలివి ఏడ్చినట్టే వుంది! ఆడదాన్ని ఒక్కదాన్నీ ఓ బండిలో కూర్చొబెడితే యింక ఏమైనా వుందా? వూరుకానివూరు, పైగా అర్ధరాత్రివేళ" అంటూ ఓ ఆటోలో కూర్చుని, రెండో డ్రైవర్ని కూడా పిల్చి, అతని ఆటో రిక్షా నెంబరు, అతని పేరూ, ఓ కాగితంమీద రాసేడు.

"ఇప్పుడు పోనివ్వండి" అన్నాడు.

బళ్ళు వెళ్తున్నాయి, మధ్యలో ఓసారి తల బైటికిపెట్టి వెనకనున్న ఆటో వస్తోందో లేదోనని గమనించేడు.

సీతమ్మపేటలో వున్న చలపతి యింటి ముందు రెండు ఆటోలూ ఆగేయి. ఆటో చప్పుడికి యింట్లోవాళ్లంతా గబగబా బైటికొచ్చేరు. సాదరంగా పలకరించేరు. తాము ఎందుకు లేటుగా వచ్చిందీ కామేశ్వరమ్మ వివరించింది.

చలపతి ఆటోవాళ్లకి డబ్బులిస్తుంటే "నైట్ టైమ్ సార్! రెండ్రూపాయలు ఎక్కువివ్వండి" అంటూ వినయంగానే ఓ డ్రైవరు అడిగేడు.

చలపతి యివ్వడానికి సిద్ధమయ్యేడుగానీ, పంతులు అడ్డుకున్నాడు.

"వీడికి అదనంగా ఎందుకు డబ్బులివ్వాలా? రాత్రిపూటైతే మాత్రం రోడ్లు సాగిపోయి, అక్కణ్ణించి ఇక్కడికి దూరం ఎక్కువైపోతుందా? లేక రాత్రిపూట ఈ బళ్ళేవైనా పెట్రోలు ఎక్కువ తాగేస్తాయా?"

తండ్రి ఆర్గ్యుమెంటుకి చలపతి చిన్నగా నవ్వుకున్నాడు. "అలాగే ఇవ్వనులే" అంటూ తండ్రిని లోపలికి పంపించి, తిరిగొచ్చి ఆటో డ్రైవర్లకి రెండేసి రూపాయలు అదనంగా యిచ్చి పంపించేడు.

★ ★ ★

చలపతిరావుకు ఆ వూర్లోని లీడింగ్ లాయర్లలో ఒకడిగా పేరు ప్రఖ్యాతులున్నాయి. యాభైనాలుగు దాటి నన్నగా, తెల్లగా ఆరోగ్యంగా వుండే ఆ లాయరుకి సుభద్ర ధర్మపత్ని. శంకరానంద్, సుజాత వాళ్ల సంతానం.

శంకరానంద్‌కి పెళ్లయింది. ఇద్దరు పిల్లలు. సుజాతక్కూడా పెళ్లయింది. కానీ, పెళ్ళైన ఆరునెల్లకే ఆమె భర్త ఏక్సిడెంట్లో మరణించేడు. విధవా వివాహానికి, ద్వితీయ వివాహానికి చలపతిగాని, అతని భార్య సుభద్రగాని వ్యతిరేకులు కాకపోయినా, యింకా ఆ ప్రస్తావన రాలేదు. కూతురి బొట్టు చెరిగి ఎనిమిది నెలలే అయింది. ఆమెకంటే చిన్న అమ్మాయి భారతి కాలేజీలో డిగ్రీ ఫైనల్ ఇయర్ చదువుతోంది.

సుజాత భరతనాట్యం నేర్చుకుంది. నర్తకిగా మంచి పేరూ, గుర్తింపూ సంపాదించుకుంది. ఆ వూళ్ళోనూ, ఇతర నగరాల్లోనూ నృత్య ప్రదర్శనలు ఇచ్చి పండిత పామరుల మెప్పు పొందింది. విధి సంకుచిత మనస్తత్వంతో ఆమె అయిదోతనాన్ని అంతర్ధానం చేసినా ఆమెలోని కళాభినివేశానికి తెరవేయలేకపోయింది. భర్తపోయిన దుఃఖంతో, అచేతనంగా, నిరాశలో మిగిలిపోయిన కూతురికి తల్లిదండ్రులే ధైర్యం చెప్పారు.

"కళని అభ్యసించడం, నేర్చు సాధించడం అందరికీ అబ్బే విద్య కాదు. అలాంటిది నువ్వు నాట్యంలో ప్రావీణ్యం సాధించేవు.

ఇప్పుడు నీకు ఏర్పడిన కష్టం, నష్టం కేవలం నీ సొంతం.

అందువల్ల నువ్వు నీ కళారాధనకి దూరంకానక్కర్లేదు...

నీ ఒంటరితనం నిన్ను ఎంతో బాధపెడుతుంది.

జరిగిందంతా మర్చిపో అని చెప్పడం చెప్పినంత సులభం కాదని నాకూ తెలుసమ్మా!

కానీ- భవిష్యత్తు విషయం మాకు వదిలేసి నీ కళారాధనలో నువ్వు కొనసాగడం మంచిది. అందువల్ల నీ మనసుకి శాంతీ కలుగుతుంది. నువ్వు నవ్వుతూ తిరుగుతుంటే మాకూ ఆనందంగా వుంటుంది"

అంటూ చలపతి కూతుర్ని ప్రోత్సహించేడు.




సుజాత కన్నీళ్ళు తుడుచుకుంది. మళ్ళీ కాళ్లకి గజ్జెకట్టింది. "రసమయి నాట్య బృందం" ద్వారా ప్రదర్శనలిస్తోంది.

సుజాతకి వైధవ్యం ప్రాప్తించిందన్న విషయం తప్ప, ఆమె నర్తకి అనిగాని, నృత్యప్ర దర్శనలిస్తోందనిగాని నర్సింపంతులికీ తెలీ దు, కామేశ్వరమ్మకీ తెలీదు.

ఇంట్లో తెల్లచీర కట్టుకుని, జుట్టు ముడివే సుకుని నిరాశా నిస్పృహలో ఆవేదనతో ఎదురు పడి తమని చూడగానే బావురుమని ఏడు స్తుందనుకున్న సుజాత ఆ ముసలాళ్లకసలు కనపడనేలేదు.

మనమరాలు ఏడ్చినప్పుడు ఏంమాట్లాడి, ఎలా ఓదార్చాలో ఒకటికి నాలుగుసార్లు మన సులో రిహార్సల్సు చేస్కునే వచ్చేరుగాని, అక్కడా అవసరం లేకపోయింది.

అసలు సుజాత వూర్లోనే లేదు.

విజయవాడలో డాన్స్ప్రోగ్రాంకెళ్లింది.

ఈ విషయం చెప్తే ముసలాళ్ళు గఁయ్ మంటూ లేచి చిందులు తొక్కుతారని చల పతి, సుభద్రా ముందుగా వూహించే వాళ్లకి చెప్పాల్సిన అబద్ధాన్ని సిద్ధంచేసి ఉంచేరు.

"స్నేహితురాలి పెళ్ళికి సుజాత విజయ వాడ వెళ్లింది" ఇదీ వాళ్ళు చెప్పిన అబద్ధం.

ఆమాత్రానికే కామేశ్వరమ్మ నోరు నొక్కు కుంది. కోడలిమీద కస్సుమంటూ లేచింది. "తలచెడిన ఆడపిల్ల కృష్ణారామా అను కుంటూ ఇంటిపట్టునుండాలిగానీ, పెళ్లిళ్లకీ పే రంటాలకే వెళ్ళొచ్చా? పోనీ, అదంటే చిన్న పిల్ల! శాస్త్రాలు, సాంప్రదాయాలూ, పద్ధతులూ తెలీక శుభకార్యానికి వెళ్తానంటే మాత్రం, పంపడానికి మీ బుద్ధులేమయ్యాయర్రా" అంటూ కొడుకుని కూడా నాలుగు దులిపే సింది.

వైధవ్యం వచ్చినంతమాత్రాన ఆడవాళ్లు యింటికి అంటుకు పోనక్కర్లేదని, అవన్నీ పాతకాలపు మూఢాచారాలని చలపతి, శంకరా నందు, సుభద్రా అరగంటసేపువాదించి నచ్చ జెప్పినా ముసలాళ్ల మాట ముసలాళ్లదే అయింది. ఆ సంభాషణ ఓ అరగంటకంటే ఎక్కువ సాగకపోవడానికి కారణం, వాళ్ల వాద నని అంగీకరించడంకాదు నిద్ర ముంచుకు రావడం.

సాయంకాలం ఆరుదాటి ఏడు గంటలయ్యే లోపే నిద్రలోకి జారడం ఎన్నో ఏళ్లుగా అలవా టు చేసుకున్నవాళ్లు ఆ రాత్రి పన్నెండు దాటు తున్నా పక్కలమీదకి చేరకపోయేసరికి ఆవు లింతలు రావడం మొదలుపెట్టేయి. ఆ వాద నని తాత్కాలికంగా ఆపడానికి ఆవులింతలు ఓ ఆయుధంగా వుపయోగపడ్డాయి.

ముసలాళ్లు ఓ గదిలో పడుకున్నాక, చల పతి తన గదిలోకొచ్చి సుభద్రతో అన్నాడు- "అమ్మాయి పెళ్లికెళ్లిందంటేనే సంప్రదా యంకాస్త చట్టుబండలై పోయిందని గొడవపె ట్టినవాళ్లు అమ్మాయి పదిమంది ముందూ డాన్సు ప్రోగ్రాములిస్తోందని తెలిస్తే యింకే మైనా వుందా?" అన్చెప్పి కాస్సేపు ఆలోచించా రు.

ఇంటర్‌కమ్ నొక్కి శంకరానంద్‌తో యీ విషయమే చర్చించేడు.

"నిజవే నాన్నా... తాతయ్యకీ విషయం తెలి స్తే సాంప్రదాయాల గురించి మాట్లాడతాడేత ప్ప ప్రెజెంట్ సొసైటీ గురించి తెల్సుకోడు. తాతయ్య యిక్కడున్న నెలరోజులూ సుజాతని ఎక్కడా ఏ ప్రోగ్రామూ ఒప్పుకోవద్దని చెపుదాం" అన్నాడు ఆనంద్.

ఆ రాత్రికి రాత్రి యింట్లో వున్న సుజాత డేన్స్ ఫొటోలు తీసేసి బీరువాలో దాచేశారు.

★ ★ ★

తెల్లవారు జామున...

నర్సింపంతులు జంధ్యాన్ని చెవికి చుట్టు కుని, చెంబు పట్టుకుని హడావిడిగా బహిర్భూ మికి బయలుదేరాడు.

అప్పటికే లేచి ఆసనాలు వేస్తున్న శంకరా నంద్ తాతయ్య వైఖరి గమనించి గబగబా చొక్కా తొడుక్కుని బయటకొచ్చాడు.

"ఎక్కడికి తాతయ్యా?"

"చేతిలో చెంబు చూస్తూ కూడా ఎక్కడికని అడుగుతావేంరా?" అంటూ చిరాకుపడ్డాడు పంతులు.

"మీ గదిలోనే బాత్రూమ్ వుందిగా?"

ఆనంద్ చెప్పినదానికి పంతులు రెప్పపా

యేడు.

చలపతిని పిలిచేడు- "ఏవిట్రా యిది... పడగ్గదేమో అక్కడా? అందులోనే యీ మలవి సర్జనకో గదా? ఈ పక్కన వంట గదా?" అంటూ చిరాకుపడ్డాడు చెంబు విసిరేస్తూ.

"పట్నంలో యింతేనాన్నా నీకు ఈ ఊళ్లో నిర్మానుష్యంగా వుండే ఖాళీ స్థలం దొరకాలంటే కనీసం పది మైళ్లు వెళ్లాలి" అంటూ ఎంతో వినయంగా, చమత్కారంగా చెప్పి ఒప్పిస్తే తప్ప నర్సింపంతులు శాంతించలేదు.

చిర్రుబుర్రులాడుతూనే స్నానం ముగించేడు.

ఎంతో అధునాతనంగా కట్టిన బాత్రూమ్ కూడా ఆయనకి సంతృప్తి నివ్వలేదు. నూతిలో నీళ్లు బక్కెట్‌తో స్వయంగా తోడి పోసుకోవడానికి అలవాటుపడిన మనిషికి యిలా నాబ్ తిప్పగానే టాప్‌లోంచి నీళ్లు రావడం సంతృప్తి నివ్వలేదు.

స్నానం ముగించి, తడిబట్టతో మేడ మీదకెళ్లి డాబామీద నిలబడి సూర్యనమస్కారం చేసి క్రిందకొచ్చేడు.

"పూజగది ఎక్కడమ్మా?"

మామగారు అడిగిన ప్రశ్నకి సుభద్ర కంగారుపడి భర్తవైపు చూసింది.

ఆ యింట్లో ప్రత్యేకంగా పూజగదంటూ ఏదీ లేదు. దైవభక్తికీ, పూజానమస్కారాలకీ చలపతీ, ఆ యింట్లోని మిగతావాళ్లూ వ్యతిరేకులు కాకపోయినా ప్రత్యేకంగా ఓ గదిని దేవుడి పూజకోసం కేటాయించలేదు. ప్రతి గదిలోనూ ఓ దేవుడి పటం వుంది. ప్రతి పటం ముందు ఓ జీరోవాల్టు కరెంటు బల్బు కూడా నిత్యం వెలుగుతూనే ఉంటుంది. సుభద్ర ప్రతి శనివారం వెంకటేశ్వరుడి దీపారాధన చేస్తుంది. అంతకుమించి ఆ యింట్లో ప్రత్యేకంగా పూజా కార్యక్రమాలు జరగవు.

ప్రత్యేకమైన పూజగది లేదనేసరికి చలపతి మీద ఎగిరిపడ్డాడు నర్సింపంతులు. కోడలి మీద విరుచుకుపడింది కామేశ్వరమ్మ.

"పూజలూ పునస్కారాలు లేకపోతే యీ మానవజన్మ ఎందుకురా వెధవా? ఇదేనేమిట్రా నువ్వు వెలగబెట్టిన చదువు? మానవుడికి ఇహంకంటే పరం ముఖ్యం. ఇహలోకంలో మనకి తెలిసో తెలియకో చేసిన పాపాలన్నీ పరిహారం అయి, పరమపదం చేరాలంటే యిక్కడ మనం చేసే పూజాపునస్కారాలు, దానధర్మాలే సోపానాలుగా మారతాయిరా. దేవుడి దగ్గర కరెంటు బల్బు వెలిగిస్తావా? ఏం... యింత నూనెపోసి, ఓ వత్తి వెలిగించి, నాలుగు పువ్వులు జల్లి ఓ దండంపెడితే నీ సొమ్మేంపోయిందట. ఎంత పట్నం అయితే మాత్రం, ఎంత నాగరికత తగలడితే మాత్రం మరీ యింత అనాచారమా?" అంటూ ఆ ముసలి దంపతులు కొడుకుని, కోడల్నీ దులిపేశారు.

కోర్టులో ఎలాంటి ప్రత్యర్థులనైనా తన వాగ్ధాటితో అవాక్కులని చేసే లాయరు చలపతి ఈ దాడితో హెడ్మాస్టరు ముందు ఎలిమెంట్రీ స్కూలు విద్యార్థిలా బిక్కచచ్చిపోయేడు.

"రేపట్నించి నువ్వు చెప్పినట్టే అన్నీ ఏర్పాటుచేస్తాను నాన్నా" అన్నాడు తప్పుఒప్పుకుంటున్న నేరస్థుడిలా తలదించుకుని.

పంతులు ఆ మాటతో సంతృప్తిపడలేదు. "నేనొక్కణ్ణీ పూజచెయ్యడం కాదు, రోజూ మీరంతా పూజా కార్యక్రమం నెరవేర్చిగాని, పచ్చి మంచినీళ్లు ముట్టడానికి వీల్లేదు" అంటూ శాసించేడు.

ఇక్కడ చలపతిలోని అభ్యుదయవాది ఎదురుతిరిగేడు. దేవుడికి చేసే పూజయినా, సాటి మనిషికి చేసే దానమైనా, మరో వ్యక్తి కోసం చేసే త్యాగమైనా, చూపించే ప్రేమయినా ఎవరికి వారు యిష్టపడి స్వచ్ఛందంగా చెయ్యాల్సిందే తప్ప యితరుల ఒత్తిళ్లకిలొంగో, మరొకర్నీ ప్రసన్నుని చేసుకోడానికో చేయకూడదు. భక్తి అనేది మనిషికి ఆత్మసంతృప్తి కలగడానికి తప్ప అది మూర్ఖత్వంగా మారకూడదు; మూఢత్వాన్ని కలిగించకూడదు. తను దైవ ప్రార్థనకి వ్యతిరేకికాకపోయినా, పూజ కంపల్సరీగా చేయాలని తండ్రి శాసించేసరికి అతన్తో తీవ్రంగా వాదించాలనుకున్నాడు.

కానీ అంతలోనే నిగ్రహించుకున్నాడు.

తను చేసే వాదనగాని, చెప్పే సిద్ధాంతాలుగాని దెబ్బై ఎనిమిదేళ్లుగా పెంచుకున్న తన తండ్రి చాదస్తాన్ని మార్చలేవు, సరిగదా అతని





మనసు బాధపడుతుంది. తన దగ్గరకి రాకరాక వచ్చేడు. ఓ నెలరోజులు వుండి వెళ్లిపోతాడు. ఈ మాత్రానికే ఎదిరించి మాట్లాడ్డం న్యాయంకాదని తనకితానే సర్ది చెప్పుకున్నాడు.

"సరే నాన్నా" అనేసి తన గదిలోకి వెళ్లిపోయేడు.

శంకరానంద్‌కి బట్టలు అందిస్తూ అతని భార్య వాణి, ఏదో తల్చుకుని తల్చుకుని నవ్వుకుంటున్నట్టుగా నవ్వుతూ అంది- "ఇప్పుడు మీనాన్నగారిమీద తాతగారు ధాంధూంమని కేకలు వేస్తుంటే నాకు భలే చిత్రమనిపించింది సుమండీ"

"ఏం... ఎందుకంత చిత్రమనిపించింది?"

"ఎందుకేవిటండీ... మీ నాన్నగారికి యాభై అయిదుదాటేసింది, ఆయనంటే మనందరికీ భయం. ఊర్లోవాళ్లు కూడా ఆయన్నెంతో గౌరవంగా చూస్తారు. అలాంటాయన్ని పట్టుకుని చంటికుర్రాడిని పెద్దవాళ్లు కోప్పడినట్టు కోప్పడ్డం, యింతపెద్దాయనై వుండీ మీ నాన్నగారు జవాబు చెప్పలేక నీళ్లు నమలడం చూస్తుంటే... నాకు నవ్వొచ్చేయబోయింది. కానీ మీ అమ్మగారు కోప్పడతారని తమాయించుకున్నాను"

శంకరానంద్‌కూడా యిందాక జరిగిందాన్ని ఓసారి గుర్తు చేస్కుని నవ్వుకున్నాడు.

★ ★ ★

టిఫిన్ తింటానికి డైనింగ్ టేబిల్ దగ్గర కుర్చీమీద కూర్చోమంటే నర్సింపంతులు ససేమిరా కూర్చోనన్నాడు. నేలమీదే కూర్చున్నాడు. పెద్దాయన నేలమీద కూర్చున్నప్పుడు తాము కుర్చీలో కూర్చోవడం చలపతికీ, శంకరానంద్‌కీ మర్యాద కాదనిపించింది. తామూ నేలమీదే ముసలాయన పక్కనే కూర్చున్నారు. నేలమీద కూర్చుని తినడం అలవాటు తప్పిపోయి చాన్నాళ్లైపోయింది. పైగా యిద్దరూ ఫేంటూ, షర్టూ వేసుకుని రావడంవల్ల నేలమీద కూర్చోడానికి పేంట్లు చాలా యిబ్బందిపెట్టేయి.

"కొన్నాళ్ల క్రితం వరకూ నేను గడ్డ పెరుగు వేసుకుని చద్దన్నంతినేవాణ్ణి, ఈ మధ్యే ఫలహారం అలవాటు చేసుకున్నాను" అంటూ నెయ్యి అడిగేడు.

సుభద్ర ఖంగుతింది. రక్తంలో కొవ్వు పెరుగుతుందని యింట్లో నెయ్యివాడ్డం ఓ సంవత్సరంగా మానేశారు. భర్తవైపు చూసింది. చలపతి అర్థం చేసుకుని తండ్రికి నచ్చజెప్పడానికి ప్రయత్నించేడు.

"రక్తంలో కొలస్ట్రాల్ ఎక్కువైతే గుండె జబ్బులొస్తాయని డాక్టరు చెప్పిందగ్గర్నించి నెయ్యివాడ్డం మానేశారు. నువ్వూ మానేస్తే మంచిది" అన్నాడు.

"కొలస్ట్రాల్ అంటే ఏవిటి?"

"అదో కొవ్వు పదార్థం. నెయ్యిగాని, నూనె సామాన్లుగాని తింటే ఆ కొవ్వు పెరుగుతుంది"

నర్సింపంతులికా వివరణ రుచించలేదు. "నెయ్యివాడ్డంవల్ల కొవ్వు పెరగదురా- పనీపాటా చెయ్యకుండా, కాలుమీద కాలువేసుకుని బతికితే కొవ్వుపడుతుంది. నా ఊహ తెల్సినప్పట్నించీ నేను ప్రతిపూటా యింత నెయ్యి కలుపుకునే భోంచేస్తున్నాను. మరి నాకు గుండె జబ్బు రాలేదేం? మీకా భయం వుంటే మీరు నెయ్యి వాడకండి. అంతేగాని నన్ను కూడా మానేయమని చెప్పకండి. మధ్యాహ్నం భోజనంలోకి నెయ్యి తెప్పించు" అంటూ కోడలికి ఆర్డరు వేశాడు.

అతను నెయ్యి తింటానంటే సరేగానీ, తమని కూడా ఎక్కడ వాడమని శాసిస్తాడోనని భయపడ్డ సుభద్ర, చలపతి లోలోపలే హమ్మయ్య అనుకున్నారు.



చలపతి ఆఫీసు కూడా ఆ యింట్లోనే వుంది. చాలా విశాలమైన గది. అద్దాల బీరువాల్లో పేర్చిన పెద్దపెద్ద లా పుస్తకాలు, టేబిల్ మీద రెండు ఫోన్లు, ఓ ఇంటర్‌కమ్, ముగ్గురు



జూనియర్ లాయర్లు, యిద్దరు గుమస్తాలు, వుదయం ఎనిమిది గంటల నుంచి వచ్చే పోయే క్లయింట్లు... యిదంతా నర్సింపంతులు చూసీ చూడనట్టుగానే గమనించేసేడు.

భార్యని మెల్లగా పిల్చి, చాటుగా ఆ దృశ్యాన్ని చూపించేడు. కొంతమంది క్లయింట్లతో చలపతి ధారాళంగా ఇంగ్లీషులోనూ, మరికొంత మందితో హిందీలోనూ తడుముకోకుండా మాట్లాడ్డం చూసి, పెళ్లాం తలమీద చిన్న దెబ్బవేశాడు.

"వాడు ఎవడనుకున్నావ్- కుమార రత్నం. గుర్తు పెట్టుకో" అన్నాడు కాస్త గర్వంతో ముసిముసిగా నవ్వుతూ.

ఆమె మూతి తిప్పింది. "మీ తమ్ముడు దత్తత అడిగినప్పుడు నేను మనసు రాయి




చేసుకుని దత్తతిచ్చేనుగాబట్టే, వాడుయింత వాడయ్యేడు. లేకపోతే, ఈపాటికి వాడూ మీతో పాటు పొలాల్లో బతికేవాడే!''

ఆమె కాస్త పరిహాసంగా చెప్పినా, అదీ నిజమేలే అన్నట్టుగా తలపంకించేడు నర్సింపంతులు.

చలపతి ఎవర్తోనో కాస్త ప్రైవేటుగా మాట్లాడ్డానికి, అక్కడున్న గుమస్తాని కాస్సేపు బైటకి వెళ్లమన్నాడు. ఇంటర్‌కమ్‌లో ఓ నెంబరు నొక్కి ''ఓ పావుగంట వరకూ ఎవర్నీ లోపలికి పంపించకండి'' అంటూ తన జూనియర్లకి చెప్పేడు.

నర్సింపంతులు తన వూర్లో రాజుగారింట్లో టెలిఫోన్ అయితే చూసేడుగాని, ఈ ఇంటర్‌కమ్ నెప్పుడూ చూడలేదు. దానిమీద జిజ్ఞాస పెరిగింది. భార్యని లోపలికి పంపించేసి, కాంపౌండ్‌లో, ఓ పక్కన నిలబడి సిగరెట్ కాలుస్తున్న ఓ గుమస్తా దగ్గరకి వెళ్లేడు.

అతన్ని చూస్తూనే గుమస్తా కంగారుపడి సిగరెట్ పారేసి "నమస్కారం సార్" అన్నాడు.

"వూ... నీ పేరేవిట్రా అబ్బాయ్?" అన్నాడు హుందాగా.

"రాజమూర్తండీ"

"మా అబ్బాయి దగ్గర ఎన్నాళ్లుగా పని చేస్తున్నావ్?"

"అయిదేళ్లవుతుందండి"

"ఆ బీరువాలో యింతింతలావు పుస్తకాలు అన్ని వున్నాయి గదా! అవన్నీ మావాడు చదివేసినవేనా?"

"అవన్నీ చదవకుండా యింత పెద్ద లాయరెలా అవుతారండీ"

తన కొడుకు గురించీ, అతనికి వూళ్లో వున్న పేరుప్రఖ్యాతులు గురించి వివరంగా అడిగి తెల్సుకున్నాక, ఆఖరుగా ఇంటర్‌కమ్ గురించి అడిగేడు పంతులు.

"అది కూడా టెలీఫోన్‌లాంటిదే తాతగారూ! కాకపోతే అగి యిక్కడకిక్కడే ఇంట్లోవాళ్ళతో మాట్లాడుకోడానికి పనికొస్తుందండి. ఒక్కో బటన్ నొక్కితే ఒక్కో గదిలోని ఇంటర్‌కమ్ పలుకుతుందండి" అంటూ దాని విశిష్టతని వివరించేడు.

"వంటగదిలో వున్న వాళ్ళమ్మతో నేను ఆఫీసులోనించి మాట్లాడాలనుకో, ఎన్నో అంకె నొక్కాలంటావ్?" ఆసక్తిగా అడిగేడు.

"ఆరో నెంబరు నొక్కాలండి"

మరో అరగంట తర్వాత చలపతి లాయరు దుస్తుల్లో కోర్టు కెళ్లడానికి కారు ఎక్కబోతుంటే, నర్సింపంతులు హడావిడిగా కారు దగ్గరికి వెళ్లాడు.

"ఎక్కడికిరా? కోర్టుకా? ఇవాళ పదకొండున్నర వరకూ రాహుకాలం వుందిరా, కాస్సేపు ఆగి బయల్దేర్రా" అన్నాడు.

చలపతి చిన్నగా నవ్వేడు "మాకు కోర్టు పదకొండు గంటలకి ఆరంభం అవుతుంది నాన్నా! మేం ఆ టైముకి అక్కడుండాలి. ఇలా మేం రాహుకాలాలు, యమగండాలు చూస్కుని కోర్టుకెళ్తే యింక మేం వాదించినట్టే" అంటూ కారు ఎక్కేడు.

"పోనీ, ఆ నమ్మకాలు లేకపోయినా, మంచి శకునం చూస్కునైనా బయలుదేరాలిగా" అంటూ తన భార్యని కేకవేయబోయేడు. కానీ చలపతి వారించేడు.

"అది కాదురా! మీ అమ్మ శకునం చాలా మంచిది. మనవూళ్లో నేను ఎప్పుడు గడపదాటినా మీ అమ్మే ఎదురొస్తుంది"

చలపతి తండ్రిని చాలా అమాయికంగా చూసేడు. రెండుక్షణాల తర్వాత అన్నాడు- "ఇలా కోరి ఎదురు తెచ్చుకున్నంత మాత్రాన ఏంశుభం జరుగుతుంది నాన్నా! అవన్నీ మూఢాచారాలు. ఇప్పుడు కాలం మారింది. మనిషి మేధ ఎదుగుతోంది. విజ్ఞానం ఆకాశం ఎత్తుకి ఎదుగుతున్నప్పుడు కూడా, యింకా మన ఆలోచన అగాధంలో వుండటం మంచిది కాదు". అతనికైతే యింకా వివరంగా చెప్పాలని వుందిగాని, అప్పటికే కోర్టుకి టైము అవుతుండడంవల్ల కారులో వెళ్లిపోయేడు.

కొడుకు చెప్పింది ఏవిటీ? అనే ఆలోచనలో పడ్డాడు నర్సింపంతులు.

అక్కడేమో వంట గదిలో వున్న గేస్ పొయ్యిని, సిలిండర్‌ని, మిక్సీని, గ్రైండర్‌ని చూసి కామేశ్వరమ్మ నివ్వెరపోయి నోరు నొక్కుకుంది.

తను వున్నన్నాళ్లు కోడలికి వంటపనిలో సాయం చేద్దాం అనుకుంది. కానీ, మనిషికి కష్టం లేకుండా అన్ని పనులూ మెషిన్లే చేస్తుంటే యింక తనకేం పని వుంటుందీ అనుకుంటూనే. భర్తని పిలిచి ఒక్కో వస్తువునీ చూపించింది.

అంతా చూశాక పంతులు పెదవులు బిగించి, ఓసారి కోడల్ని చూసి అన్నాడు.

"ఇందాక మావాడు అన్నాడే, నెయ్యి తింటంవల్ల కొవ్వు పెరిగి గుండెజబ్బులొస్తాయని... ఇప్పుడేమంటావమ్మా- ఇలా మీట తిప్పితే పొయ్యి వెలుగుతుందా? సన్నికల్లు మీద నూరక్కర్లేకుండా యీ గొట్టాం మిషన్లో సామాన్లు వేస్తే యిదే నూరేస్తుందా? ఇలా అయితే మీకు ఒంటికి శ్రమ ఎక్కడుంటుంది? ఒంటికి కాస్తయినా చెమటపట్టకపోతే రక్తంలోని చెడు అంతా ఎలా బయటికి పోతుంది? ఈ పట్నంవాళ్లు అన్నింటికీ అన్ని మిషన్లు కనిపె





ట్టి మిమ్మల్ని చెడగొట్టేస్తున్నారమ్మా! అందుకే మీకీ గుండెజబ్బులు అవీ వస్తున్నాయి"

అతని మాటలకి సుభద్ర, వాణీ ఒకర్నొకరు చూసుకుని చిన్నగా నవ్వుకున్నారు.

"ఈ పెట్టేవిటి?" అంటూ ఓ తెల్లని పెట్టెని చూపిస్తూ అడిగేడు.

అది ఫ్రిజ్.

దాన్ని తెరచి చూపించింది వాణి. అది ఏవిటో వివరించింది. ఓసారి కాయగూరలు తెచ్చి అందులో పెడితే సుమారు వారంరోజుల వరకూ తాజాగా వుంటాయని చెప్పింది.

"తాజాగా వుంటాయంటే నేనొప్పుకోను. అసలు తాజా అంటే ఏవిటమ్మా? చెట్టునించి కాయతెంపగానే దాన్ని కూర వండితే దాన్ని తాజా అంటారు లేదా కనీసం యిరవైనాలుగ్గంటల్లోనైనా తినగలిగితే దాన్ని తాజా అంటారు. అంతేగాని యీ అయినుపెట్లో వారం రోజులు నిల్వవుంచితే యింకెక్కడి తాజా- నా పిండాకూడు తాజా. మీరంతా చెడిపోతున్నారు. డబ్బంతా దుబారా చేసేస్తున్నారు, మరోపక్క ఆరోగ్యాలు పాడు చేసేస్కుంటున్నారు" అంటూ ఆ వంటగదిని అంగుళం అంగుళం పరీక్షగా చూడనారంభించేడు.

ఓ రెండు నిమిషాల తర్వాత ఆయన అక్కడినుంచి వెళ్ళిపోయేడు.

కామేశ్వరమ్మకి అంతవరకూ మర్చిపోయిన విషయమేదో చటుక్కున గుర్తుకొచ్చి చిన్నగా అరిచింది. ఏవిటని అందరూ ఆమె వైపు చూశారు.

"ఏంవర్రా! మీ అత్తాకోడళ్ళిద్దరూ... మడికట్టుకోకుండానే వంటచేసేస్తున్నారే" అంది సాగదీస్తూ.

ఎంతో దారుణం జరిగిపోయిందన్న బాధ ఆమె మాటల్లో ధ్వనించింది. ఈ ప్రశ్న అడుగుతుందని వాళ్ళు ఎవరికివారే కొన్ని నిమిషాల క్రితమే వూహించేరు.

మడి అనేది ఎందుకు ఏర్పడిందో, శుభ్రతకే మరోపేరు మడితప్ప, దానికో ప్రత్యేకమైన విలువలేదంటూ సుభద్ర సహేతుకంగా చెప్పగలిగినా, తన వాదనని సనాతనురాలయిన అత్తగారు అంగీకరించరని తెలుసు. అందుకే వాళ్ళ సంతృప్తి కోసం కావాలనే అబద్ధం చెప్పింది.

"గత వారందాకా మడితోనే వండేదాన్ని అత్తగారూ... కానీ తడిబట్ట ఎక్కువసేపు ఒంటిమీద వుండడంవల్ల నాకు పదిరోజుల క్రితం న్యుమోనియా జ్వరం వచ్చింది; మా కోడలికీ ఆ జ్వరమే వచ్చింది. దాంతో డాక్టరుగారు మమ్మల్ని తడిబట్టతో వంట చెయ్యొద్దన్నారు. అందుకే పొడిగా, శుభ్రంగా వుతికిన బట్టలు కట్టుకునే వంట చేస్తున్నాం..."

కామేశ్వరమ్మకి ఆ సమాధానం సంతృప్తిగా లేకపోయినా, ఆడవాళ్ళిద్దరికీ జ్వరాలు రావడం మాత్రం ఆమెకు కాస్త బాధ కలిగించింది.

"అరవై మూడేళ్లనుంచి నేను మడిబట్టతోనే వంట చేస్తున్నా నాకెప్పుడు జ్వరాలూ, రోగాలూ ఏవీ రాలేదు. సర్లే... యీ సామాన్లన్నీ చూశాక మీ ఆరోగ్యాలు ఎలా వుంటాయో అర్థం అవుతోంది. నేనిక్కడ వున్నన్నాళ్ళూ మడితో నేనే వంటచేస్తాను. ఆ తర్వాత మీరెలా పోయినా ఫర్వాలేదు" అంటూ ఆమె తన గదిలోకి వెళ్ళింది.

ఆమె చేత వంట చేయించడం సుభద్రకి గాని, వాణికిగాని యిష్టంలేదు. పైగా తమ వంటలూ, ఆ మషాలాలూ వేరు. ఆవిణ్ణికాదంటే తమని మడీ తడీ ఆచరించమంటుంది. అవి తమకేనాడూ అలవాటు లేదు.

"ఆవిణ్ణి శ్రమపెట్టే బదులు రేపట్నించీ నేనే ఆ మడి బట్టేదో కట్టుకుని యీ నెలరోజులూ వంట చేసేస్తాను" అంది వాణీ.

సుభద్ర అంగీకార సూచనగా మౌనం వహించింది.

★ ★ ★

నర్సింపంతులు యింటిముందు అరుగుమీద నిలబడి, వీధిలోనుంచి వెళ్తున్న మనుమల్ని వాహనాల్ని శ్రద్ధగా పరిశీలిస్తున్నాడు.

తర్వాత తన కొడుకు ఆఫీసురూంలోకి వచ్చాడు. అక్కడ ఆఫీసుబోయ్ మాత్రమే స్టూలు మీద కూర్చుని కునుకిపాట్లు పడుతున్నాడు.

వాడి వీపుమీద ఒక్క చరుపు చరిచేసరికి వాడు కంగారుపడి లేచేడు.

"పనిచేసుకోవలసిన సమయంలో యిలా కునికిపాట్లు పడితే దరిద్రదేవత నీ నెత్తిమీద కూర్చుంటుందిరా వెధవా" అంటూ అక్కడున్న కుర్చీలో కూర్చున్నాడు.

"నేనెవర్నో తెల్సునా?"

"తెలీదండి"

"తెల్సుకోకుండా ఏంచేస్తున్నావురా... నేను మీ అయ్యగారికి అయ్యగార్ని! అంటే చలపతి రావుగారి నాన్నని" అంటుండగానే ఫోన్ మ్రోగింది.

బోయ్ ఫోను అందుకోబోయేడు. వాడిని ఆగమని చెప్పి పంతులే ఫోను అందుకున్నాడు.

తన వూళ్లో ఉండగా రాజుగారూ, యిందాక ఇక్కడ తన కొడుకూ ఫోన్‌లో మాట్లాడ్డం చూసేడుగానీ, తను ఎప్పుడూ మాట్లాడలేదు. అందుకే చాలా ఉత్సాహంగాగ ఫోన్ అందుకుని మాట్లాడేడు.

"హల్లో! ఆఁ... ఎవర్రా అది... నేనా? వెంకటాచలపతిగారి నాన్నని, నాపేరు నర్సింహంపంతులంటారు. ఆఁ ఆఁ... నమస్కారం... సరే, చెప్తాను చెప్తాను- నమస్కారం" అంటూ ఫోన్ పెట్టేశాడు చాలా సునాయాసంగా, మొదటిసారి టెలిఫోన్‌లో మాట్లాడేయగలిగినందుకు లోలోపల చాలా గర్వపడిపోయేడు.

"ఫోన్‌లో ఎవరు మాట్లాడేరండి?" బోయ్ అడిగేడు.

"ఎవరు మాట్లాడితే నీకెందుకురా?" చిరాగ్గా అన్నాడు పంతులు.

"అది కాదు తాతగారూ! అయ్యగారు లేనప్పుడు ఎవరు ఫోన్ చేసినా వాళ్ల పేర్లు రాస్కుని సాయంకాలం అయ్యగారు కోర్టునించి వచ్చేక చెప్పాలండి" అన్నాడు కాస్త భయంగానే.

"అవును... అది చాలా మంచిపద్ధతి. సరే... రాసుకో! ఎవరో వెంకటరమణమూర్తట. సాయంత్రం మళ్లీ ఫోన్ చేస్తాడట"

బోయ్ ఓ నోట్‌బుక్‌లో రాస్కున్నాడు.





తర్వాత చిన్నగా నవ్వుతూ అడిగేడు- "తాతగారూ- మీరేం అనుకోనంటె ఓ మాటండి"

"ఏమిట్రా?"

"మీ అబ్బాయిగారు మీకంటే చిన్నవారు గదా! ఇందాక ఫోన్లో మీరెవరని అడిగితే వెంకటాచలపతిగారి నాన్ననీ అన్నారు. మీ అబ్బాయిని మీరు గారూ అనడం..."

అతని మాటలు పూర్తికాకుండానే పంతులు బిగ్గరగా పగలబడి నవ్వుతూ వాడి వీపు మీద నాలుగు చరుపులు చరిచేడు.

"మంచి ప్రశ్నే వేసావురా వెధవా! వాడు మా అబ్బాయి కాబట్టి ఒరేయ్ అని పిలుస్తాను. కానీ, మిగతావాళ్లు అలా పిలవరే! ఏవండీ వెంకటాచలపతిగారూ అనే పిలుస్తారుగదా! అలాంటివాళ్ల దగ్గర మావాణ్ణి ఒరేయ్ అని ఎందుకంటాను. నేనూ అలాగే అన్నాలి- గుర్తు పెట్టుకో" అన్నాడు.

తర్వాత టేబుల్ మీదున్న పేపరు చూసేడు, అది ఇంగ్లీషు పేపరు. "దీని ఖరీదెంతరా?" అన్నాడు.

"రెండు రూపాయలు"

ఏదో జ్ఞాపకం వచ్చినట్టుగా, గభీమని పేపరు పడేసి బోయ్‌ని బైటకి వెళ్లమన్నాడు.

వాడి వెళ్ళేక ఇంటర్‌కమ్ ఎత్తి ఆరోనెంబరు బటన్ నొక్కేడు. వంటగదిలో రింగైంది.

"ఇప్పుడు ఎవరు రింగ్ చేస్తున్నారు?" అంటూ సుభద్ర ఫోన్ ఎత్తింది.

"ఎవరూ?" అంది.

"నేనమ్మా... మీ మావయ్యని! మా మునలమ్మ అక్కడుంటే దాన్ని మాట్లాడమను" పంతులు ముసిముసిగా నవ్వుతూ, కాస్త సిగ్గుపడుతూ మాట్లాడేడు.

సుభద్ర చిన్నగా నవ్వుతూ అత్తయ్యకి ఫోన్ యిచ్చి మాట్లాడమన్నది.

ఆమె భయపడిపోతే "ఫర్వాలేదు... మావయ్యగారే మాట్లాడుతున్నారు" అంది సుభద్ర.

ఇప్పుడు కాస్త ధైర్యంగా ఫోన్ అందుకుందామె.

"హల్లో అనండి" అంటూ వాణి చిన్నగా నవ్వుతూ అంది.

"హలో" అంటూ అరిచింది బిగ్గరగా.

సుభద్ర, వాణి ఫక్కుమంటూ నవ్వి అంత లోనే బిడియపడి నోరు నొక్కేసుకున్నారు.

"ఎందుకే అరుస్తావు? నేను... సూర్యనారాయణ పంతులిగారి అబ్బాయిని నరసింహం పంతుల్ని మాట్లాడుతున్నానే- కులాసాగా వున్నావా?" పంతులు తనలోతానే నవ్వేసుకుంటూ మాట్లాడేడు.

"కులాసాగా వుండకపోడానికి యిప్పుడేగా మీరు నన్ను చూసేరు. ఇంతలోనే నాకేం మాయదారి రోగం వచ్చిందని అడుగుతున్నారు. ఇంతకీ మీరు ఎక్కణ్ణించి మాట్లాడుతున్నారు?" కామేశ్వరమ్మ ప్రతిమాటనీ సాగదీస్తూనే మాట్లాడింది.

"ఎక్కణ్ణించో కాదే- మనింట్లో, మన అబ్బాయి ఆఫీసుగదిలో నించే మాట్లాడుతున్నాను"

"ఏం కావాలట?"

"ఓ చెంబుడు నీళ్లు పట్రావే"

"మీకు నీళ్లు పట్టుకురావడానికి నేనిప్పుడు మడిలో వున్నాను. మీరే ఎంచక్కా లోపలకొచ్చి తాగి వెళ్ళండి"

ఆమె ఫోన్ పెట్టేసింది. మునలాళ్ళ సంభాషణా ధోరణికి చిన్నగా నవ్వుకుంటూనే వాణి ఓ గ్లాసుతో నీళ్లు తీసుకుని ఆఫీసుగదిలోకి వెళ్లింది.

"ఉత్తినేనమ్మా- యీ ఎర్రఫోన్లో మాట్లాడాలనిపించి ఆరోనెంబరు నొక్కేను. మా ముసలమ్మతో ఏం మాట్లాడాలో తెలియక చెంబుతో మంచినీళ్లు తెమ్మన్నాను" అంటూ పంతులు పకపకా నవ్వేడు.

★ ★ ★

సాయంకాలం-

శంకరానంద్ పిల్లలిద్దరూ స్కూలునుంచొచ్చి ముఖాలు కడుక్కుని, కాఫీలు తాగి హెూమ్‌వర్కు చెయ్యడానికి పుస్తకాలు ముందరేసుక్కూర్చున్నారు.

వాణి వారిద్దరి చేతా చదివిస్తోంది.

ఆనంద్ ఆఫీసు నుంచొచ్చి బట్టలు మార్చుకుంటున్నాడు.

నర్సింపంతులు పిల్లల దగ్గరకొచ్చి కూర్చున్నాడు. "ఏరా తాతా... బడి వదిలిపెట్టేసారా?" అన్నాడు నవ్వుతూ.

కాన్వెంట్లో చదువుతున్న పిల్లలకి బడి అనే మాటకి అర్థంతెలీక తల్లివైపు చూసేరు.

బడి అంటే స్కూలు అని వాళ్ళకి చెప్పి పంతులుతో "వీళ్ళు కాన్వెంట్లో చదువుతున్నారు తాతగారూ! వీళ్లకి చెప్పే చదువంతా ఇంగ్లీషులోనే వుంటుంది" అంది.

"ఎంత ఇంగ్లీషు చదువులైతే మాత్రం ఆపాటి తెలుగు తెలీకపోవడం ఏవిటి?" అంటూ పిల్లల్ని "ఏం చదువుతున్నార్రా?" అని అడిగేడు.

"యల్‌కేజి" అంది అమ్మాయి.

"యూకేజి" అన్నాడు అబ్బాయి.

"ఏ తరగతి చదువుతున్నార్రా అని అడిగితే, కేజీల గురించి చెప్తారేవిట్రా? కేజీల్లో చెప్పడానికిదేవైనా చింతపండా వుల్లిపాయలా?" పంతులు కాస్త చిరాగ్గానే అన్నాడు.

ఆనంద్ అప్పటికే వచ్చి కూర్చున్నాడు. "అదికాదు తాతయ్యా... యల్‌కేజి అంటే లోయర్ కిండర్‌గార్డెన్, యూ కేజీ అంటే అప్పర్ కిండర్‌గార్డెన్ అని అర్థం. కాన్వెంట్లోని క్లాసులకి అలాంటి పేర్లేపెడతారు" అన్నాడు.

ఆ పేర్లు నచ్చనట్టుగా తల అడ్డంగా ఆడించి "ఏదిరా... మీ తెలుగు వాచకం తియ్యండి" అన్నాడు.

ఆనంద్, వాణి ఒకర్నొకరు చూసుకుని చిన్నగా నవ్వుకున్నాక వాణి అంది-

"అలాంటి పుస్తకాలు వీళ్ళకుండవు తాతయ్యగారూ"

"ఉండకపోతే ఎలాగమ్మా! ఏదీ- సరస్వతీ స్తోత్రం చెప్పరా" అన్నాడు అబ్బాయితో.

"సరస్వతి ఎవరు?" అన్నాడా అబ్బాయి అమాయకంగా.

"మన వీధి చివర లేడీ టైలరా?" అంది అమ్మాయి.

ఆనంద్, వాణీ పిల్లల మాటలకి నవ్వుకున్నా పంతులుగారు మాత్రం ముఖం ముటముటలాడించేరు.

"చదువుల తల్లి సరస్వతి అంటే, మావీధి

చివర్నున్న బైలరమ్మ కాదురా సరస్వతీ నమస్తుభ్యం అంటూ సరస్వతీదేవిని స్తుతించి చదువు ఆరంభిస్తే చక్కగా వంటబడుతుంది. సరే... అది రేపట్నించి మీచేత కంఠస్థం చేయిస్తాను. మీకు సుమతీ శతకంలోని పద్యాలు, భర్తృహరి సుభాషితాలు, వేమన పద్యాలు వచ్చా? ఏదీ చెప్పండి చూద్దాం''

పిల్లలు ఆ పేర్లే వినలేదు ఎప్పుడూ.

''అవన్నీ వాళ్ల స్కూల్లో చెప్పరు తాతయ్యా'' అన్నాడు ఆనంద్.

''ఎందుకు చెప్పరు?''

''చెప్పరండి... అది ఇంగ్లీమస్కూలు కదండీ'' అంది వాణి పిల్లల పక్కన కూర్చుంటూ.

అప్పుడే కోర్టునుంచి వచ్చిన చలపతిరావు తన గదిలోకి వెళ్తూ వెళ్తూ ఆగి యీ సంభాషణంతా విన్నాడు.

''ఎంత ఇంగ్లీమ స్కూలు అయితే మాత్రం మంచి విషయాలు, సుభాషితాలు బోధించకపోతే ఎలా? భర్తృహరి పద్యాలు ఎంత మంచివో మచ్చుకి వినిపిస్తాను, వినండి'' అంటూ గడగడమంటూ పద్యం చదవనారంభించేడు.

''క్షమకవచంబు, క్రోధమదిశత్రువు, జ్ఞాతి హుతాశనుండు, మిత్రము దగుమందు, దుర్జనులు దారుణ పన్నగముల్, సువిద్య, విత్తము చిత లజ్జభూషణ, ముదాత్త కవిత్వము రాజ్యమీ, క్షమాప్రముఖ పదార్థముల్ గలుగు పట్టున దత్కవచాదులేటికిన్''

''ఈ పద్యానికి అర్థం ఏవిటో తెల్సునా? సహనానికి మించిన కవచం లేదు. కోపానికి మించిన శత్రువులేదు. దాయాదిని మించిన అగ్నిలేదు. స్నేహితుడు వుండగా క్షేమానికై ఔషధాలు అవసరంలేదు. దుర్జనుడు వుండగా సర్పంతో పనిలేదు. మంచి విద్య వుంటే ధనం అవసరం లేదు. సిగ్గుకి మించిన అలంకారం లేదు. మంచికవిత్వమే వుంటే రాజ్యసంపద కూడా అనవసరం... చూసేరా ఒక్కపద్యంలో ఎన్ని మంచి విషయాలు చెప్పేడో'' అంటూ మరో రెండు పద్యాలు చదివి వాటి తాత్పర్యాలు వివరించేడు.

''నీరు కాలిన ఇనుముపై వుంటే పేరు లేకనే నశిస్తుంది. ఆ నీరే తామరాకుపై వుంటే ముత్యంలా వుంటుంది. అదే నీరు ముత్యపుచిప్పలో పడి ముత్యమైపోతుంది. అదేవిధంగా అధముణ్ణి సేవిస్తే గుర్తింపు లేకనే జీవితం నశిస్తుంది. మధ్యముణ్ణి సేవిస్తే ఆ మాత్రపు జీవితమే లభిస్తుంది. ఉత్తముణ్ణి సేవిస్తే ఉత్తమ జీవితం లభిస్తుంది''

''బాగా కాచిన పండ్లవల్ల చెట్లు బరువై వినమ్రంగా వంగుతాయి. ఉన్నతాకాశంలో వేలాడుతున్నప్పటికీ మేఘం జలాలను అందిస్తుంది. అదేవిధంగా సత్పురుషులు ఎంత సంపద వున్నప్పటికీ గర్వించకుండా వినమ్రంగా వుంటారు. లోకంలో పరోపకారులకిది సహజగుణం''

''చూసేరా... ఎంత గొప్పగా శెలవిచ్చాడో ఆ మహానుభావుడు. సరే- వీటిని చదవడానికింకా చిన్నవాళ్ళనుకుంటే, సుమతీ శతకంలోని పద్యాలైనా కంఠతా పెట్టిస్తున్నారా లేదా?'' అంటూ సూటిగా ప్రశ్నించాడు.

పిల్లలు భిక్కముఖం పెట్టి ఏడవడానికి సిద్ధంగా వున్నారు. వారి ముఖాలు చూసి ఆనంద్ పిల్లల్ని కాపాడుకోవాలన్నట్టుగా ''యిలాంటి పద్యాలు ఏవీ వాళ్లకి ఉండవని చెప్పేనుకదా'' అన్నాడు.

''నువ్వు తెలుగుబడిలో చదివేవా ఇంగ్లీమ బడిలో చదివేవా?'' అంటూ ఆనంద్‌ని అడిగేడు.

''తెలుగు స్కూల్లోనే''

''అయితే- సుమతీ శతకంలోని పద్యం ఒకటి చెప్పరా''

ఆనంద్ కంగారుపడ్డాడు. వాళ్లకీ సుమతీ శతకం చెప్పలేదు, ''మాకు ఆ పద్యాలు చెప్పలేదు'' అన్నాడు. నేరస్థుడిలా తలదించుకుని.

''ఏది నువ్వైనా చెప్పమ్మా'' అన్నాడు వాణితో.

వాణి గుండెల్లో రాయి పడింది. ఎప్పుడో చిన్నప్పుడు వాళ్ల నాన్నగారు, ఆ పద్యాలు చదివించేరుగాని, యిప్పుడు ఒక పద్యమూ గుర్తులేదు. ఆ మాటే చెప్పింది.

''అంటే, నువ్వాపద్యాల్లోని సారాన్ని గ్ర





# ఏరిన ముత్యాలు

★ స్త్రీ ప్రేమ విత్తనంవలె మొలకెత్తి క్రమంగా వృద్ధి చెందదు. బాణంవలె దూసుకొనిపోయి గుండెల్లో గుచ్చుకుంటుంది. కనుక హృదయం వున్నవాడే స్త్రీ ప్రేమను అర్థంచేసుకోగలడు.

— కోల్టన్

★ పగతీర్చుకోవడంలో, ప్రేమించడంలో స్త్రీ పురుషుడి కంటే నిర్దయురాలిగా మారుతుంది.

— నీత్మే

★ మగవారిని నాగరికులుగా మార్చాలంటే ఆడవారి ప్రభావం అవసరం.

— ఎమర్సన్

★ ప్రపంచంలో వున్న ఒకేఒక సుఖం 'స్త్రీ'.

— తైమూర్‌ఖాన్

★ సత్కార్యాలనే బీజాలు నాటితే అవి మధురస్మృతులనే మహత్తర ఫలాలనందిస్తాయి.

— డి.స్టాయిల్

★ మానవుల అలవాట్లు, ఆచారాలు మార్చడం సులభం. స్వభావాలను యుగాలయినా మార్చలేం.

— చలం

★ ఏవి నవ్వేయగల అల్పవిషయాలుగా తలపోస్తారో వాటినిబట్టి ఆ మనుషుల స్వభావం చెప్పవచ్చు.

— గెథె

★ బాధ్యత తెలిసిన భర్త ఎన్నడూ ముందుగా నిద్రపోడు. అందరికన్నా ఆలస్యంగా లేవడు. ఇంట్లో అందరికన్నా ముందు నిద్రలేచేవాడే బాధ్యతగల గృహస్థుడు.

— బాల్జాక్

★ ఒక బాధ్యతారహితుడైనవాని భార్య విధవతో సమానం.

— హంగేరియన్ లోకోక్తి

★ భర్తల్ని లొంగదీసుకోవడం కష్టం. వారిని ఎంత సరళంగా మార్చాలని ప్రయత్నిస్తే అంతమొండిగా, దురుసుగా తయారవుతారు.

— మేరీబర్లే

★ భార్య రూపసి అయినంత మాత్రాన ఆమె పరమశత్రువు కాగలదనడం కేవలం మూర్ఖత్వమే.

— నార్ల

★ భార్యను ఆటబొమ్మగా వాడుకోవడం అనర్థకం.

— ఇబ్సన్

★ విధేయతగల భార్య భర్తను శాసిస్తుంది.

— ఆంగ్ల సామెత

సేకరణ: **నల్లబెల్లి శ్రీమన్నారాయణ**

హించలేదన్నమాట. గ్రహించివుంటే, ఓసారి చదివిన పద్యం అంత వేగంగా మరుపుకిరాదే, చూడండి, ఎప్పుడో డెబ్బయ్యేళ్లక్రితం చదివిన పద్యం, దాని తాత్పర్యం కూడా చెప్తాను.

"తలనుండు విషము ఫణికిని
వెలయంగా దోకనుండు వృశ్చికమునకున్
దలతోకయనక యుండును
ఖలునకు నిలువెల్ల విషముగదరా సుమతీ!"

"దీని అర్థం ఏమిటో తెల్సున్రా? పాముకి శిరస్సులోనే విషం ఉంటుంది. తేలుకి తోకలో మాత్రమే విషం ఉంటుంది. దుష్టునికి తలా తోక అనే భేదం లేకుండా నిలువెల్లా విషం ఉంటుంది. చూశారా ఒక్క పద్యంలో ఎంత మహత్తర సత్యాన్ని యిమిడ్చేరో"

పంతులుగారు చెప్తుంటే అందరూ పాఠం వింటున్న విద్యార్థుల్లా మౌనంగా శ్రద్ధగా వింటున్నారు. కానీ, వారి మౌనం అతనికి తృప్తి కలిగించలేదు. వాళ్లు ఏదో క్షమించరాని అపరాధం చేసినట్టుగా వారిమీద తన ఆగ్రహాన్ని ప్రదర్శించాడు.

"మీకే ఈ పద్యాలూ, సుభాషితాలూ రాకపోతే యింకా ఈ పసివాళ్లకి మీరేం చెప్తార్రా? వీళ్లని మీ ఇష్టానువర్తంగా చదివించుకోండి, వద్దనను. కానీ జీవితాన్ని తీర్చిదిద్దడానికి ఉపయోగపడే ఒక్క సుభాషితమూ చెప్పకపోతే ఈ దిక్కుమాలిన చదువులకి అర్థం ఏమిటి? ప్రయోజనం ఏమిటి? కనీసం సరస్వతీదేవి స్తోత్రంకూడా వీళ్లకి రాదంటే, ఎందుకురా ఈ చదువులు? దేవుడంటే భక్తి పెద్దలపట్ల వినయవిధేయతలు నేర్పడానికి మన చదువులు పనికొచ్చినంతగా ఈ ఇంగ్లీషు చదువులు పనికొస్తాయా? మా చిన్నప్పుడు పెద్దబాలశిక్ష చదివించేవారు. అందులో ఎన్ని మంచి విషయాలున్నాయో నాకు తెలుసు. మీ తరం వచ్చేసరికి ఆ పుస్తకాన్ని రద్దుచేసేశారు. ఇప్పుడు మీ పిల్లల టైము వచ్చేసరికి ఏకంగా తెలుగే రద్దుచేసేశారు. ఇలాఅయితే కొన్నాళ్లకి మన దేశం గొప్పతనం, మన మహాకవుల ప్రతిభ, మన సంస్కృతి వీళ్లకి బొత్తిగా తెలియకుండా పోతుంది. చదవేస్తే ఉన్న మతి పోయిందన్న సామెత యీ ఇంగ్లీషు చదువులవల్లే సంక్రమించినట్టుంది. ఇలాంటి చదువులకి నేనెంత మాత్రం ఒప్పుకోను... ఒప్పుకోనుకాక ఒప్పుకోను" అంటూ అరిచేరు. అతన్ని ఆపడం ఎవరితరమూ కాలేదు.

చలపతిరావు ఓ ఉపాయం ఆలోచించి తండ్రిదగ్గరకి వచ్చేడు. "చూడు నాన్నా! వీళ్ల చదువుల్లో సరస్వతీ స్తోత్రం, సూక్తిముక్తావళులూ లేవనేగా నీకింత కోపం వచ్చింది. వాళ్ల చదువుల్లో అవన్నీ ఉన్నాయి. కాకపోతే అవన్నీ ఇంగ్లీషులో ఉన్నాయి"

చెప్తున్నది అబద్ధమే అయినా నిఖార్సయిన నిజాన్ని చెప్తున్నట్టుగానే చెప్పేడు.

పంతులుగారి కోపం కాస్త తగ్గింది. "మరా సంగతి చెప్పరేం" అన్నాడు నేలమీద కూర్చుంటూ.

"వాళ్ల చదువుల్లో ఎన్ని భక్తి స్తోత్రాలు, సుభాషితాలున్నాయో వాళ్లకి తెలిస్తేగదా నీకు చెప్పడానికి. ఆ పద్యాలకి అర్థాలు వాళ్లకీవయసులో ఏం తెలుస్తాయి? ఆ మాటకొస్తే వేమనపద్యాలు, భర్తృహరి సుభాషితాల అర్థాలు, తాత్పర్యాలు అప్పుడు కంఠతాపెట్టి పరీక్షలు రాసి పాసయిపోయాంతప్ప, వాటిల్లో యిమిడివున్న అర్థాల్నీ అంతరార్థాల్ని పెద్దయ్యేకకదా గ్రహించగలిగేం" అంటూ తండ్రి చూడకుండా ఆనంద్‌కి ఏవో సంజ్ఞలు చేశాడు.

ఆనంద్‌కి, వాణీకి ఆ సంజ్ఞలు అర్థంకాలేదు. వాళ్లతో పెట్టుకుంటే ప్రయోజనం ఉండదని పిల్లలదగ్గర కూర్చుని- "ఏదిరా, ట్వింకిల్ ట్వింకిల్ లిటిల్‌స్టార్, హౌ ఐ వండర్ వాట్ యూఆర్" చెప్పండి అన్నాడు.

పిల్లలు గడగడమంటూ ఆ పోయమ్‌ని అప్పగించేరు. తర్వాత వాళ్లకి తెల్సిన మరో రెండు పోయమ్స్ చెప్పించేడు. "వీటికి అర్థం ఏమిట్రా?" చెప్పండి అన్నాడు నర్సింపంతులు.

"ఈ మూడు పద్యాల్లోనూ యిందాక మనం అనుకున్న సరస్వతీ స్తోత్రం, సుమతీ శతకం, వేమన పద్యాల తాలూకు సారాంశాన్ని యిమిడ్చేశారు. భర్తృహరి పద్యాల్నిమాత్రం యింకొన్నాళ్లు పోయాక చెప్తారు. ఎందుకంటే ఈ వయసులో వీళ్లకి ఆ పద్యాలు కొరుకుడుబడవు గదా!" చలపతి చెప్తూ తండ్రి ఆ మాటల్ని



నమ్మాడో లేదోనని ఓరకంట చూశాడు.

"మూడు పద్యాల్లో అన్ని తెలుగు పద్యాల్ని ఎలా యిమడ్చగలిగేడురా" అమాయకంగా అడిగేడు పంతులు.

"వాడు ఇంగ్లీషువాడుకదా, వాడికి మన కంటే తెలివితేటలెక్కువ! గాలిద్వారా బొమ్మ ల్ని పంపించి టీవీలో యిమిడ్చెయ్యగాలేంది, వంద పద్యాల్ని మూడు పద్యాల్లో కుదించి యిమడ్చలేడా? పైగా వాడికి టైము విలువ బాగా తెలుసు! నూరు పద్యాలు కంఠతా పెట్టడానికి చాలా టైము పడుతుంది. అంచేత వాటినే మూడు పద్యాల్లో కుదించేశాడు"

చలపతి ఆడిన అబద్ధానికి ప్రయోజనం దక్కింది. "అలాగైతే ఫర్వాలేదు. ఎన్ని పద్యా లు చదివేరనికాదు, వాటి సారాన్ని తెలుసుకు న్నారా లేదా అన్నది మనం ఆలోచించాలి" అంటూ సంతృప్తిపడ్డాడు నర్సిం పంతులు.

గాలివానగా మారతుందనుకున్న విషయం, ఉత్తగాలితోనే ఆగిపోయినందుకు అందరూ సంతోషించారు.

చలపతి తన ఆఫీసురూములోకెళ్లి ఏవో కేసు పీట్సు తిరగేస్తున్నాడన్న మాటేగాని యిందాక తన తండ్రిని శాంతపరచడానికి చెప్పిన అబద్ధం ఎంతవరకు సమంజసం అని ఆలోచించాడు.

తన తండ్రికి ఇంగ్లీషు రాదు కాబట్టి, పిల్లల చేత ఏదో ఇంగ్లీషు పద్యం చెప్పించి, అందులో తన తండ్రి అడుగుతున్న విషయాలు వున్నా యని అబద్ధమాడేశాడు.

లాయరుగా అబద్ధాలాడ్డం తప్పనిసరి- కానీ ఇప్పుడు ఆడిన అబద్ధం వల్ల ఏం సాధించిన ట్లు?

ఇలా ఓ పావుగంటసేపు ఆలోచించాక ఇంటర్‌కమ్‌లో కొడుకునీ, కోడల్ని తన ఆఫీసు రూమ్‌లోకి రమ్మని పిలిచేడు.

వాళ్లిద్దరూ వచ్చి కూర్చున్నారు.

"ఇందాక మీ తాతయ్య ఎందుకు ఆవేశప డ్డాడో మీకూ తెల్సుగా! ఏదో చెప్పి ఆయన్ని మభ్యపెట్టగలిగేను గాని, వివరంగా ఆలోచిస్తే మనల్ని మనమే మభ్యపెట్టుకుంటున్నామేమో ననిపిస్తోందమ్మా. మా నాన్న చెప్పిందంతా చాదస్తంగా కొట్టిపారెయ్యలేం పారెయ్యకూడదు కూడా. ప్రస్తుత ప్రపంచంలో ఇంగ్లీషు చదువు లు చదవకపోతే, పెద్ద ఉద్యోగాలు రావు. అడుగడుగునా ప్రతి విషయానికీ పోటీలు ఏర్పడుతున్న కాలంలో ఈ చదువులు తప్పవు. అలాగని అందుకోసం మన తెలుగుదనానికీ, భారతీయ సంస్కృతికీ మనమెందుకు దూ రంకావాలి?"

ఆవేశంగా చెప్తున్న చలపతి కొన్నిక్షణాలపా టు ఆగేడు. అతనలా ఆవేశపడ్డం ఎప్పుడూ జరగలేదు. ఇప్పుడు ప్రత్యేకించి తమని పిలిచి మరీ ఆవేశంగా చెప్తున్నారంటే, ఆ మాటలు ఆయన గుండెలోతుల్లోనుంచి వస్తు న్నాయని ఆ భార్యాభర్తలు గ్రహించి, మరింత ఆసక్తిగా వినసాగేరు.

చలపతి కళ్లద్దాలు తుడిచి, మళ్లీ పెట్టుకుని చెప్పనారంభించేడు. "వేమన చెప్పిన పద్యా లు ఒక్కొక్కటి ఒక్కో మణిపూస. అందులోని జీవితసత్యాన్ని మనం జీర్ణంచేసుకోగలిగితే ఒక్కో పద్యం ఒక్కో కరదీపిక అవుతుంది. చీకటి అలుముకున్న దారిలో నడవడానికి అవి మనకెంతో విజ్ఞానకాంతుల్ని ప్రసాదిస్తాయి. అలాగే భర్తృహరి సుభాషితాలు జీవితాన్ని కాచి వడబోసి రాసిన బంగారు వాక్యాలు. పంచతంత్ర కథలు, సుమతీ శతకం... ఇలాంటివెన్నో మనం తెల్సుకోవల్సిన విషయా లున్నాయి. వాటిని ఈ ఇంగ్లీషు చదువులు చెప్పడం లేదు. మా నాన్న చెప్తే అది మీకు చాదస్తం అనిపించొచ్చు కానీ, ఆ తర్వాత తరం మనిషిగా- ఏది మూర్ఖత్వమో, ఏది విజ్ఞానమో, ఏ మార్పు ఆచరించదగ్గదో, ఏ ఆచారం ఎదిరించదగ్గదో తెల్సుకున్నవ్యక్తిగా నేనూ చెప్తున్నాను- పిల్లలచేత ఈ పుస్తకాలు చదివించండి. వాళ్లకి హోమ్‌వర్క్ ఎక్కువగా వుంటుంది కాబట్టి, వీటిని కూడా బోధిస్తే అది వాళ్లకి భరించలేని బరువు అవుతుందని నాకు తెల్సు. అయినా వారానికో గంట లేదా నెలకో రెండు గంటలు మన తెలుగుదనాన్ని తెల్సుకో డానికి ఏర్పాటుచెయ్యండి"

కాస్సేపు బరువైన నిశ్శబ్దం, తర్వాత మళ్లీ మాటలు... ఇలా ఓ గంట గడిచేక చలపతి చెప్పిందాన్ని సంతోషంగా ఆమోదించి ఆ





దంపతులు వెళ్లిపోయేరు.

మనసులోనించి ఏదో బరువుదిగిపోయినట్టుగా చలపతి తృప్తిగా వూపిరిపీల్చి, సిగరెట్టు వెలిగించి మళ్లీ తన కేసు కాగితాల్లో తలదూర్చేడు.



మర్నాడు ఉదయానికల్లా విజయవాడ డాన్స్ ప్రోగ్రామ్‌కి వెళ్లిన సుజాత, ఆమెకు తోడుగా వెళ్లిన భారతి మార్నింగు తిరిగివస్తారనుకున్నారుగానీ వాళ్లు రాలేదు. విజయవాడ నించి ఫోన్ మాత్రం వచ్చింది. ఆ వూర్లో తన నృత్య ప్రదర్శన చూసిన మరో సాంస్కృతిక సంస్థవాళ్లు గుంటూర్లో కూడా ప్రోగ్రాం ఇమ్మని కోరారనీ, వెళ్లక తప్పడం లేదని చెప్పింది వాణి.

చలపతి అందుకు సంతోషంగానే అంగీకరించేడు. పనిలోపనిగా ఆమెను ప్రోత్సహిస్తూ మాట్లాడుతూ, తన తండ్రి వచ్చిన విషయం, ఆమె తిరిగొచ్చిన తర్వాత ఆమె స్నేహితురాలి పెళ్లికి వెళ్లినట్టుగా అబద్ధం చెప్పాలన్న విషయం చాలా సున్నితంగా వివరించేడు.

సుజాత చిన్నగా నిట్టూర్చినా తర్వాత అబద్ధమాడ్డానికి ఒప్పుకుంది. తను ఇంటికొచ్చేప్పటికి మరో రెండ్రోజులు పడుతుందని, ఇంటికి వచ్చేటప్పుడు ఇక్కడ సాంస్కృతిక సంస్థవాళ్లిచ్చిన మెమెంటోని తన డేన్స్ స్కూల్లోనే వదిలేసి వస్తానని లేకపోతే తాతగారు అవి ఎక్కణ్ణించి వచ్చేయని అడగొచ్చని చెప్పింది.

ఆమె సమయస్ఫూర్తికి చలపతి సంతోషించేడు. అలాంటి ఉత్తమ కళాకారిణిని ఎందుకింత దారుణంగా శపించేడూ అని బాధపడి, దేవుణ్ణి కాసేపు తిట్టుకున్నాడు.

ముందురోజు తండ్రి చేసిన హెచ్చరిక ప్రకారం ఆ రోజు దేవుడి పూజకోసం ఓ చిన్న గదిని ఏర్పాటుచేశాడు. సుభద్ర పూజాసామాగ్రి అంతా ఏర్పాటుచేసింది. తండ్రిని బాధపెట్టడం ఇష్టంలేక చలపతి యాంత్రికంగా పూజ అయితే జరిపించేడుగాని, పూజలో వున్న కాస్సేపు భగవంతుడు తన కూతురికి చేసిన అన్యాయమే గుర్తుకొచ్చి అతని మనసు భగ్గుమంది. ఏకాగ్రత లేకుండా యాంత్రికంగానే పూజ ముగించేడు.

ఏకాగ్రతలేని పని ఏదిచేసినా అది వ్యర్థమే! యాంత్రికంగా పూజ చేయడంవల్ల ప్రయోజనం ఏమిటి? పాపం పోతుందా? పుణ్యం వస్తుందా? ఎలక్ట్రానిక్ సైన్స్ విపరీతంగా ఎడ్వాన్స్ అయిపోయి ఆ మధ్య టి.విలో ఓ మరబొమ్మని చూపించేరు. అది దేవుడికి పువ్వులు వేస్తుంది, దండం పెడుతుంది, గంట కొడుతుంది. ఇలా ప్రతీ పూజా కార్యక్రమాన్నీ చేసింది- మనిషిలాగే! కానీ, అది మనిషికాదు. దానికి జీవంలేదు. దానిలో ఆత్మలేదు. దానికో వ్యక్తిత్వం లేదు. మీటనొక్కితే అదేంచెయ్యాలని దాన్ని కనిపెట్టినవాడు ఏర్పాటుచేశాడో ఆ పనులే అవి చేసింది.

తనూ అంతేనా?

తను- మరమనిషికాదే! మనసున్న మనిషి. తోటి మనిషి బాధల్లో వుంటే, అయ్యో అని జాలిపడే మనిషి చేతనైతే ఎంతో కొంత సాయం చేద్దామనుకున్న మనిషి. తను ఎందరి యిబ్బందుల్నో తీర్చి వుపకారం చేసేడు.

కానీ- తన కూతురికే యిబ్బంది వచ్చింది. అకాల వైధవ్యం దాపురించింది. ఈ సమస్యని పూజలందుకునే దేవుడు పరిష్కరించడు! పూజలు చెయ్యక తప్పదని శాసించే తన తండ్రి పరిష్కరించడు! అలాంటప్పుడు పూజలెందుకు చెయ్యాలి? ఆ బదులు నా కూతురి భవిష్యత్తు గురించి ఆలోచించడం మంచిది...

ఇలాంటి ఆలోచనల్తో పూజగదిలో కూర్చున్న చలపతికి దేవుడి విగ్రహం బదులు అది కేవలం రాతిబండగానే కన్పించి పూజగదిలో



నించి లేచివెళ్ళిపోయేడు.

కొడుకుచేత దేవుడికి పూజచేయించాననే పంతులు తృప్తిపడ్డాడుగాని, అతని మనసులోని ఆలోచనల్ని అర్థం చేసుకోలేదు.

ఉదయం పది గంటలవుడు వాణి తన గదిలో కూర్చుని టీవీలో వస్తున్న క్రికెట్ చూస్తోంది. నర్సిం పంతులు, కామేశ్వరమ్మ, టి.విని, అందులో వస్తున్న బొమ్మల్ని విడ్డూరంగా చూస్తూ ఆ గదిలోకి ప్రవేశించేరు.

అంత చిన్న పెట్లో అలా మనుషులు సజీవంగా కదలాడ్డం వాళ్ళకో మహత్తరమైన చోద్యంగా కనిపించింది. అదేవిటో చెప్పమని అడిగేరు. వాణీ చిన్నగా నవ్వుకుంటూనే వారికి వివరించింది. ఒకప్పుడు రేడియో రావడమే అప్పటి మనుషులకి విచిత్రంగా తోచింది. స్విచ్ వేయగానే మాటలూ, పాటలూ గభీమని వచ్చెయ్యడంతో, రేడియో పెట్టెలోపలి ఎవరైనా మనిషి కూర్చుని ఆ పనులన్నీ చేస్తున్నాడా అని అమాయకంగా ఆలోచించిన రోజులవి. ఆ అనుభవాలు, అనుభూతులు, ఆశ్చర్యాలు అన్నీ నర్సింపంతులికి తెలుసు. ఎందుకంటే ఆ గ్రామంలోని వెంకట్రాజు గారింట్లోని రేడియో చూసేడు. వార్తలు విన్నాడు. దాని

పద్ధతి ఏవిటో, రేడియో ఎలా పలుకుతుందో రాజుగారు చెప్తే శ్రద్ధగా విన్నాడు. "ఓహో... మానవుడు ఎంత గొప్పవాడయ్యా" అంటూ మేధావివర్గం మానవులకి అనాడే, ఆ చింతలా గ్రహారం నించే మౌనప్రణామాలు అందజేశా డు. కానీ యిప్పుడు యింట్లో వున్న ఓ పెట్టెలో ఏకంగా బొమ్మలు కదలాడేస్తున్నాయ్- అదీ సజీవంగా.

టీ.వీలోకి ఆ బొమ్మలు ఎలా వస్తున్నాయని అడిగేడు పంతులు. గాలిద్వారా అని చెప్పింది వాణి. కొన్ని క్షణాలపాటు ఆలోచించేక కూడా అతనికి నమ్మకం కుదరలేదు. కిటికీ తలుపు లు మూసేడు. అయినా టీ.వీలో బొమ్మ వస్తూనే వుంది.

గది తలుపులు మూశాడు. అయినా బొమ్మ వస్తోంది "నిజంగా యీ బొమ్మలు గాల్లోనించే వస్తుంటే, ఈ గదిలోకి బయట్నించి గాలి రాకుండా కిటికీలు, తలుపులూ బంధించేశాను గదా! అయినా బొమ్మలెలా వస్తున్నాయి?" అని అడిగేడు.

వాణీ జవాబు చెప్పేలోగా అతనికే మరో సందేహం వచ్చింది. "గదిలో ఫేన్ తిరుగు తోంది గదా. గాలి అంటే బైట నించే రానక్కర్లేదు. ఫేన్ తిరిగినా వస్తుంది కదా" అని ఆలోచించి వెంటనే ఫేన్ ఆఫ్ చేశాడు. అయినా బొమ్మ వస్తూనే వుంది.

ముసలాళ్లిద్దరూ ఓసారి భావరహితంగా ముఖాలు చూసుకున్నారు. కామేశ్వరమ్మ వాణీని కాస్త నిష్ఠూరంగా మాట్లాడింది... "చూ డు పిల్లా మేం ఎంత ముసలాళ్లమైనా, ఎంత తెలివి తక్కువ్వాళ్లమైనా మమ్మల్ని యింత ఎద్దేవా చెయ్యక్కర్లేదు"

వాణీ ఖంగుతిన్నది- "అదేంటి బామ్మగా రూ... నేను మిమ్మల్ని ఎద్దేవా చెయ్యడం ఏమిటీ?" అంది కాస్త కంగారుగా.

"ఎద్దేవా కాకపోతే మరేవిటీ? ఈ బొమ్మలన్నీ గాల్లోనుంచి వస్తున్నాయన్నావు. కిటికీలు, తలు పులూ మూసి చివరికి పంకా ఆపేసినా బొమ్మ లొచ్చేస్తుంటే యింక నీ మాటలు ఎలా నమ్ముతాం?"

కామేశ్వరమ్మ చేసిన నిష్ఠూరం వాణీని బాధ పెట్టలేదుగాని తీవ్రంగా ఆలోచింపజేసింది. తనూ బి.ఏ. పాసైందిగాని టీవీ ఎలా పనిచే స్తుందనే విషయానికొస్తే గాల్లోంచి వస్తుందనే అనుకుంటోందిగాని యిలా తలుపులూ, కిటికీ లూ మూసినా బొమ్మ వస్తుందని తెలియదు. ఆ ముసలాళ్లకొచ్చిన సంశయమే వాణికీ వచ్చింది. అయితే తను బయటపడకూడదు. ఎందుకంటే తను చదువుకున్నది. ఈ ఇరవ య్యో శతాబ్దపు చివరి దశకంలో అత్యాధునిక మైన విజ్ఞానానికి, నాగరికతకి తను ప్రతినిధి. ఈ పాతకాలపు ముసలివాళ్ల దగ్గర తనెందుకు మూర్ఖురాలిననిపించుకోవాలి అనలా ఆలోచనే ఆమెకు నచ్చలేదు. పది పదిహేను సెకెండ్లపా టు తీవ్రంగా మెదడుకి పని కలిగించింది.

మేడ మీద టీవీకి సంబంధించిన ఏంటీనా వుంది. బహుశా దాని ప్రభావంవల్ల యీ బొమ్మలు వస్తుండొచ్చు. యస్... కరెక్ట్ లేకపోతే తలుపులు మూసి గాలి లోపలకి రాకుండా ఆపుచేసినా బొమ్మలు యింకా వస్తున్నాయంటే ఏం అనుకోవాలి?

"రండి మామ్మగారూ, రండి తాతయ్యగా రూ" అంటూ యిద్దర్నీ పై డాబామీదకి తీసుకె ళ్లింది.

డాబా మీదున్న ఏంటినాని చూపించింది. వాళ్లు దాన్ని చూడ్డంతోపాటు మిగతా డాబాల వైపు కూడా చూసేరు.

దాదాపు అందరి ఇళ్లమీదా ఏంటినాలు కనిపిస్తున్నాయి. "గాల్లోంచి వచ్చే బొమ్మల్ని శబ్దాలతోసహా యీ ఏంటినా లాక్కుని టీవీలోకి పంపిస్తుంది. అందులో వుండే మిషను మనకి వాటిని బొమ్మలుగా చూపిస్తుంది" వాణీ వాళ్లకి అర్థమయేలా చెప్పడానికి ప్రయత్నించి, హమ్మయ్య చెప్పగలిగేనని లోలోపల సంతో షించింది.

పంతులుగారు తలపైకెత్తి ఏంటీనాని అటూయిటూ పరిశీలించాడు. అది కరెంటు తీగెల్లా షాక్ కొడుతుందేమోనని, అక్కడ తాడు మీద ఆరబెట్టిన ఓ తువ్వాలు పట్టుకొచ్చి దాంతో ఏంటీనాని రెండు మూడు దెబ్బలు కొట్టేడు. ఏమీ అవలేదు.

"ఇది షాక్ కొట్టదా?" యింకా సంశయం తీరక అడిగాడు. వాణికీ సందేహం వచ్చింది.




ఏనాడూ దాన్ని ముట్టుకుని చూడలేదు. అది షాక్ కొడుతుందో కొట్టదో తనకి తెలియదు. తనకి తెల్సిందల్లా టీవీ చూడాలనుకున్నప్పు డు స్విచ్ వేయడం, ప్రోగ్రాములు చూడ్డమే. అంతకుమించి టీవీ గురించి తనకి తెలియ దు. పంతులుగారు తెగించి ఏంటినాని ముట్టు కున్నాడు. షాక్ కొట్టలేదు.

''కొట్టదు కొట్టదు... యిది షాక్ కొట్టదు'' అంటూ ఏదో సరికొత్త విషయాన్ని కనుక్కున్న సైంటిస్టులా సంబరపడిపోయేడు.

''ఇంద్రజాల, మహేంద్రజాల, గజకర్ణ, గోక ర్ణ, టక్కుటమార విద్యలు నేర్చుకున్న మాంత్రి కుడి ప్రాణాన్ని అల్పజీవి అయిన చిలకలో పెట్టేసినట్టు, యిన్ని బొమ్మల్ని చూపించే టీవీ తాలూకు ప్రాణాన్ని యీ ముదనష్టపు ఇనపక మ్మీలో పెట్టేశాడు'' అంటూ పంతులుగారు కిందికి బయలుదేరారు. వాళ్లకి ఏదో సమా ధానం చెప్పి మేనేజ్ చేసిందేగాని వాణీ మనసులో ఓ సందేహం కొట్టుమిట్టాడుతూనే వుంది. పోర్టబుల్ టీవీలు ఏంటినా అవసరం లేకుండానే పనిచేస్తాయి. పెద్ద టీవీలు కూడా ఏంటినాలు లేకుండా పనిచేస్తాయి. కాకపోతే బొమ్మ సరిగా కనబడదని ఓసారి వాళ్లాయన చెప్పినట్టు గుర్తొచ్చింది. ఏమైతేనేం యిప్పటికి గండం గడిచిందనుకుంది కానీ గడవలేదు.

''టీవీని ఎవరు కనిపెట్టేరు?''

మెట్లు దిగుతూ నర్సింపంతులు అడిగిన ప్రశ్నకి వాణి ఉలిక్కిపడింది.

టీవీని రోజూ శ్రద్ధగా చూడ్డమేతప్ప దాన్నెవ రు కనిపెట్టారో తనకి తెలియదు. తనని ఎవరూ యీ ప్రశ్న యింతవరకూ అడగలేదు. తనూ ఎవర్నీ అడిగి తెలుసుకోలే దు. తన విషయం సరే, రోజూ టీవీ చూస్తున్న కోట్లాది జనంలో దీన్ని కనిపెట్టిందెవరో ఎంత మందికి తెలుసు- అని తనలో తనే ప్రశ్నించు కుంది.

ఆ ప్రశ్నకి జవాబు ఆలోచించేలోగా మెట్లు దిగడం అయిపోయింది. జవాబు చెప్పకపోతే ''నువ్వేమి చదివేవమ్మా, బోడిచదువు'' అంటా రేమోనని భయం. ఎవరైనా ఇంగ్లీషువాడి పే రు చెప్పేస్తే గొడవ వదిలిపోతుందనుకుంది. కొంతమంది పరిశోధకుల పేర్లు గుర్తుతెచ్చు కుంది.

''దీన్ని కనిపెట్టినవాడి పేరు గ్రెహంబెల్ తాతగారూ'' అంది ఎంతో సిన్సియర్‌గా.

పంతులుగారు గదిలోకి వెళ్ళబోతూ ఆగిపో యేరు ''గ్రెహెంబెల్లా... వాడి పేరు ఎక్కడో విన్నట్టుందే'' అంటూ చేత్తో తలనిమురు కుంటూ బిగ్గరగా అరిచేడు.

''ఆ... గుర్తువచ్చింది'' అంటూ వాణీని ఓసారి నఖశిఖపర్యంతం చూసి ''ఏమమ్మా వాణీ... గ్రెహంబెల్ అంటే ఎవడో నాకు తెలీద నుకున్నావా? వాడు టెలిఫోన్ కనిపెట్టేడు''

''మీకెవరు చెప్పేరు?''

''మా వూళ్ళోని వెంకట్రాజుగారు చెప్పేరు. నీ మాట కరక్టయితే ఆయన చెప్పింది అబద్ధ మంటావా? ఆయనలా అబద్ధాలు చెప్పే మనిషి కాదే. ప్రతి ఏటా భద్రాచలంలో దేవుడి కల్యాణం చేయించే పుణ్యాత్ముడు. అత నెందుకు వుత్తపుణ్యానికి అబద్ధాలు చెప్తాడు?'' అతని మాటల్లో వెంకట్రాజుగారిమీద నున్న గౌరవం వ్యక్తమయింది.

ఈ వెంకట్రాజుగారు ఎక్కడ దాపురించే డురా దేవుడా, అనుకుంటూనే నోటికొచ్చిన మరో పేరు చెప్పేసింది. ''సారీ తాతగారూ... ఆల్వా ఎడిసన్ అనబోయి, గ్రెహెంబెల్ అనేశాను''

కానీ ఈ సమాధానం కూడా అతనికి తృప్తి కలిగించలేదు.

''ఈ ఎడిసన్ అనేవాడూ నాకు తెలుసు. వీడు రేడియో కనిపెట్టేడు''

''ఎవరు చెప్పేరు?''

''మావూరి వెంకట్రాజుగారు చెప్పేరు. ఆయనింట్లో రేడియో, టెలిఫోనూ వున్నాయి. వాటిని చూపించినప్పుడు వాటిని కనిపెట్టిన మహానుభావుడెవరూ అని అడిగేను. పాపం ఆయనకీ తెలీదు. వాళ్ళ అల్లుడికి వుత్తరం రాసి కనుక్కుని, వారంరోజుల తర్వాత ఫలానా ఫలానా అని చెప్పేరు. అంచేత, యీ టీవీని కనిపెట్టింది వాళ్ళిద్దర్లో ఏ ఒక్కరూ అయి వుండరు. ఈ టీవీ అంటే యిప్పుడొచ్చింది గాని, టెలిఫోను ఎప్పటిది? రేడియో ఎప్పటిది? పోనీ, వాళ్ళే దీన్ని కూడా కనిపెట్టారనుకున్నా అప్పటివాళ్ళు యిప్పటిదాకా ఎలా బతికుంటా

రు? వాళ్ళు ఎంత మేధావులైనా వాళ్ళ ఆయుర్థాయమూ నూరు సంవత్సరాలేగా? నీకు తెలియకపోతే ఎవర్నైనా అడిగి తెల్సుకుని చెప్పు, తొందరలేదు. అదీ కుదరకపోతే మీ మావగారు కోర్టునించి వచ్చేక నేనే అడిగి తెల్సుకుంటాను. వాడు లాయరుగదా, యీపాటి విషయం వాడికి తెలియకుండావుండదు''

వాణి చాలా ఇరకాటంలో పడింది. టీవి కనిపెట్టినవాడిపేరు మావయ్యాగారికి తెలిసే వుంటుంది. ఒకవేళ తెలియకపోయినా ఆయన లాయరు కాబట్టి, మాటల్తో ఏదో విధంగా గారడీ చేసి ముసలాయన్ని సంతృప్తి పరిచేస్తారు. కానీ తప్పో రైటో ఏదో ఓ ఇంగ్లీషు పేరు చెప్పి నమ్మించకపోతే వాళ్ళ దృష్టిలో తనో వాజమ్మలా మిగిలిపోతుంది. ఏదో ఓ పేరు తట్టేవరకూ వీళ్ళ ధ్యాసని మరోవైపు మళ్ళించాలి. ఈ ఆలోచన రాగానే బీరువాలోంచి ఓ హిందీ పిక్చర్ కేస్సెట్ తీసి వి.సి.ఆర్‌లో పెట్టి ఆన్ చేసింది.

''ఏమిటది?'' కామేశ్వరమ్మ అడిగింది.

''ఇదో సినిమా మామ్మగారూ సినిమా హాలుకి వెళ్ళకుండా యింట్లోనే కూర్చుని సినిమా చూడొచ్చు.

''ఏదేదీ... ఆ సినిమా డబ్బాని ఓసారి బయటకి తీసి చూపించు'' పంతులుగారు చాలా ఆసక్తిగా అడిగేరు.

వీ.సి.ఆర్.లో నించి కేస్సెట్‌ని ఎజెక్ట్ చేసి బయటకి తీసి చూపించింది.

దాన్ని అటు తిప్పి, యిటు తిప్పి చూసేడు. మూడుగంటలపాటు నడిచే సినిమాని అంత చిన్నడబ్బాలో ఇమిడ్చేశారా? దీన్ని మరో పెట్టె (వీ.సి.ఆర్.)లో పెట్టి, స్విచ్ నొక్కితే టీ.వీ.లో సినిమా వచ్చేస్తుందా? వింతగా వుందే! పూర్వం రోజుల్లో ఎనిమిది గజాల చీరని నేతగాళ్లు ఓ అగ్గిపెట్టెలో పెట్టి యిచ్చేవారని చదివి, అదంతా అబద్ధం అని కొట్టిపారేశాడు. కానీ యిప్పుడీ కేస్సెట్‌ని చూసేక ఆ చీర సంగతీ నమ్మక తప్పడంలేదు.

కేస్సెట్‌ని వాణీకిచ్చేస్తూ అన్నాడు- ''నేను పంతొమ్మిది వందల నలభై ఎనిమిదిలోనో, తొమ్మిదిలోనో గుణసుందరి కథ సినిమా చూసేను. అంతకుముందు నాగయ్యగారు నటించిన యోగి వేమన చూసేను. అప్పుడు నేనూ, మీ మామ్మ బేడా పరక పెట్టి టిక్కెట్టు కొని సినిమాకెళ్తే, బొమ్మ పడుతుండే తెర అల్లంతదూరంలో అక్కడ, బొమ్మని ఆడించే మిషను వెనక చాలాదూరంలో వుండేది. ఆ మిషను ఓ గదిలో వుండేది. ఆ గదిలో పెద్దరంధ్రం వుండేది. ఆ రంధ్రంలోనించి భ.ఁయ్ మంటూ యింతలావున తెల్లటిపొగ ముందుకొచ్చేది. సినిమా అయిపోతుందనేటప్పటికి చాలామంది కుర్రాళ్లు ఆ పొగకి అడ్డంగా చేతులు పెట్టి వూపేవారు. ఆ చేతుల తాలూకు నీడలు, తెరమీద పడుతుంటే అదో పిచ్చి ఆనందంగా గెంతులేసేవారు. నిజం చెప్పొద్దూ, అప్పటికీ నేనూ మాంచి వయసులో వున్నానేమో, నేనూ ఆ పొగకి చెయ్యి అడ్డంపెట్టేను. ఇంతకీ చెప్పరావడం ఏవిటంటే తెరమీద బొమ్మపడ్డానికి అంతతంతంగం వుండేది. మరీ మధ్యకాలంలో ఎలాంటి మార్పులొచ్చేశాయో ఈ డబ్బాని చూస్తేనే తెలుస్తోంది'' అంటూ నర్సింపంతులు నలభై రెండేళ్లనాటి స్మృతుల్ని నెమరువేసుకున్నాడు.

ఆ మాటలు విన్నాక వాళ్లమీద వాణికి కొద్దిగా గ్రిప్ దొరికినట్టయింది. వాళ్లకి టెలీఫోను, రేడియో కనిపెట్టిన ఇద్దరి పేర్లూ తెలుసు. గుణసుందరి కథ, యోగి వేమన ఈ రెండు సినిమాలే చూసేరు. ఆ తర్వాత విషయాలు ఏవీ తెలియవు కాబట్టి యిప్పుడు జవాబు చెప్పడం సులభం.

''తాతగారూ... యీ కేస్సెట్‌ని కనిపెట్టిందెవరో మీరు అడక్కపోయినా చెప్పేస్తాను, చార్లెస్ శోభరాజ్ అనే మహాశయుడు కనిపెట్టేడు''

ఆ మాట చెప్పేసి వాళ్ల రియాక్షన్‌కోసం చూసింది. పంతులుగారు మునుపట్లా పెదవి విరచలేదు. ఆమె చెప్పిన పేరుని రెండుసార్లు మెల్లగా వుచ్చరించేక అంగీకరిస్తున్నట్టుగా తల ఆడించేడు.

''కనిపెట్టే వుంటాడు- వాడి పేరుని బట్టే తెలుస్తోంది, వాడు చాలా గట్టిపిండమని. ఆ డబ్బాని కూడా వాడే కనిపెట్టేడంటావా?'' అంటూ వీ.సి.ఆర్.ని చూపించేడు.

''ఇది గూడా వాడి పనే అయివుంటుంది''





అంటూ వాణి వీ.సి.ఆర్. ఆన్ చేసింది. టీ.వీ.లో బొమ్మలు వస్తుండేసరికి మరే ప్రశ్నలూ వెయ్యకుండా సినిమా చూడ్డంలో నిమగ్నమైపో యేడు. నాలుగు దశాబ్దాల తర్వాత మళ్లీ సినిమా చూస్తుండడంవల్ల కామేశ్వరమ్మ కూడా ముసిముసిగా నవ్వుకుంటూ సినిమా చూడసాగింది.

కానీ నర్సింపంతులు అలాక్కాదు. టీ.వీ.లో కనిపిస్తున్న బొమ్మల్ని, వాటి కదలికల్నీ చూస్తు న్నాడన్న మాటేగాని, తను చూసిన తెరమీది సినిమాకి, దీనికి యింత తేడా వుందేవిటా అనే ఆలోచిస్తున్నాడు.

వాణీకి వాళ్ల ధోరణి కాస్త సరదాగానే వుంది. రిమోట్ కంట్రోలర్ తీసి, పిక్చర్ని ఫ్రీజ్ చే సింది.

"అదేవిటే బొమ్మ అలా ఆగిపోయింది" అంది కామేశ్వరమ్మ ఏదో వుపద్రవం జరిగిపో యినట్టుగా కంగారుపడుతూ.

"అది ఆగిపోలేదు మామ్మగారూ, నేను ఫ్రీజ్ చేసాను. ఈ రిమోట్ కంట్రోలర్‌తో బొమ్మ ల్ని ఎక్కడ కావాలంటే అక్కడ ఆపుకోవచ్చు. మళ్లీ ఎప్పుడు కావాలంటే అప్పుడు నడుపుకో వచ్చు. మాటవరసకి మనం పప్పుతాళింపు పెట్టొచ్చి సినిమా చూస్తున్నాం అనుకోండి. మధ్యలో పప్పు మాడిపోతున్న వాసనొచ్చింది. అప్పుడు మనం దీన్ని ఇలా ఫ్రీజ్ చేసి వెళ్లి, ఆ పప్పు సంగతేమిటో చూసి, తిరిగొచ్చేక మళ్లీ సినిమాని నడిపించుకోవచ్చు. అలాగే మనకీ పాట నచ్చలేదనుకోండి, యీ బటన్ నొక్కితే ఫ్రంట్ ఫార్వర్డ్ అయిపోతుంది" అంటూ ఫ్రంట్ ఫార్వర్డ్ బటన్ నొక్కింది.

బొమ్మలు గబగబా పరుగులు తీస్తూ ముందుకు పరుగెత్తేయి. అది చాలా వింతగా కనిపించింది.

"ఏదమ్మా... మళ్లీ మామూలుగా నడి పించు" అన్నారు పంతులుగారు.

వాణీ ప్లేబటన్ నొక్కింది. మామూలుగా బొమ్మలు ఆడుతున్నాయి.

"ఏదీ- బొమ్మల్ని ఓసారి పరుగెత్తించు"

వాణి ఫ్రంట్‌ఫార్వర్డ్ చేసింది.

ముసలాళ్లు పగలబడి పగలబడి నవ్వేరు.

"అంతేకాదండి, బొమ్మలు వెనక్కి కూడా పరుగెడతాయి చూడండి" అంటూ రివైండ్ బటన్ నొక్కింది. ఇప్పుడు బొమ్మలు వెనక్కి పరుగెత్తసాగేయి. అది మరీ వింతగా కని పించింది.

"ఏదీ, ఆ మిషన్నిలాగివ్వు" అంటూ రిమోట్ కంట్రోలర్‌ని తీస్కుని, ఏ బటన్ దేనికో అడిగి, ఫ్రంట్ ఫార్వర్డ్, రివైండ్, ఫ్రీజ్‌లు చేస్తూ కాస్సేపు ఎంజాయ్ చేశాక పంతులుగారి కో సందేహం వచ్చింది.

టీవీ పనిచేయడానికి వైర్లు వగైరా కనిపిస్తు న్నాయి. కానీ, రిమోట్ కంట్రోలర్‌కి ఎటువంటి వైరూ లేదు. టీవీకెదురుగా యింతదూరంలో దాన్ని పట్టుకుని బటన్ నొక్కితే, అక్కడ మార్పులు జరిగిపోతున్నాయి. ఇదెలా సాధ్య మైంది- అని అడిగేడు.

"ఎలక్ట్రానిక్స్ అంటే అదే తాతగారూ! ఇప్పుడు ఎలక్ట్రానిక్ పరికరాలొచ్చేక యీ రిమోట్‌కంట్రోలర్ ఏమిటి? ఇంకా చాలా చాలా వింతలూ, విశేషాలు జరిగిపోతున్నాయి. తీరా యీ రిమోట్ కంట్రోలర్‌లో వుండేది సుమా రుగా ఓ అగ్గిపుల్లంత పొడవుండే చిన్న బేటరీ మాత్రమే" అంది వాణీ చిన్నగా నవ్వుతూ.

"చందమామ పుస్తకంలో కొన్ని కథలు చది వేనమ్మా. అందులో నేపాళమాంత్రికులు, వాళ్ల చేతుల్లో మంత్రదండాలూ, వాటితో చేసే వింత వింత పనులూ చదువుతుంటే, ఆఁ... నాబొంద యివన్నీ కట్టుకథలూ, అభూతకల్పనలూ తప్ప నిజంగా అలాంటి మంత్రదండాలు వుంటా యా అనుకునేవాణ్ణి కానీ, యిప్పుడు...యీ మిషన్ పేరేఁవిటన్నావ్?"

"రిమోట్ కంట్రోలర్"

"అదే... యీ కంట్రోలర్‌ని చూసేక ఆ మాంత్రికుల చేతుల్లో మంత్రదండాలు వుండడం నిజమేనన్న నమ్మకం కలుగు తోంది" అంటూ నవ్వుతూ మళ్ళీ ఫ్రంట్ ఫార్వర్డ్, రివైండ్ చేశాడు.

"ఎంతసేపూ మీరేనేఁవిటి... నేను నొక్కుతా" అంటూ కామేశ్వరమ్మ పంతులుగారి చేతిలోని రిమోట్‌ని లాక్కుని ఒక్కో బటన్‌ని బలంగా నొక్కసాగింది.



''నువ్వు అరిసెలు నొక్కినట్టు అలా గట్టిగ ట్టిగా నొక్కుతుంటే, ఆ మిషన్‌కివాళే శ్రాద్ధం పెట్టెయ్యాల్సుంటుందే'' అంటూ పంతులుగారు రిమోట్‌ని మళ్లీ లాక్కుని తనే బటన్స్ నొక్కసాగేడు.

వాళ్లిద్దరూ ఆ విధంగా ఎంజాయ్‌చేస్తే, వాళ్ల అమాయకత్వాన్ని వాణి ఎంజాయ్ చేసింది.

సాయంత్రం చలపతి కోర్టునుంచి వచ్చేక ''నాకీ పట్నమంతా చూపించే ఏర్పాట్లు ఏమైనా చేస్తున్నావా లేక మమ్మల్ని యింటికే అంకితం చేసేస్తావా?'' అని అడిగేడు సీరియస్‌గా.

''రేపు నాకు కోర్టుకెళ్లాల్సిన పనిలేదు. నేనే మీ యిద్దర్నీ కార్లో తీసుకెళ్లి వూరంతా చూపిస్తాను'' అన్నాడు చలపతి కోటు విప్పుతూ.

★ ★ ★

మర్నాడు చలపతి తల్లిదండ్రుల్ని తీసుకుని మొదట వెంకటేశ్వరస్వామి గుడికి తీసుకువెళ్లేడు. దైవదర్శనం జరిపించిన తర్వాత ఆ గుడి గురించి వివరించేడు.

''ఈ దేవాలయాన్ని పోర్టుట్రస్టువాళ్లే నడిపిస్తున్నారు. ఈ వూళ్లో ఎన్ని వెంకటేశ్వర దేవాలయాలున్నాయో తెలీదుగాని ఈ స్వామిని దర్శించాలనుకునే భక్తులు సాధారణంగా యిక్కడికే వస్తుంటారు. దీనికుండే మరో ప్రాధాన్యత ఏమిటంటే, అదిగో ఆ కొండ మీదికి చూడండి'' అంటూ మరోవైపు చూపించేడు.

ఓ కొండమీద చర్చి, మరోచోట మహ్మదీయుల దర్గా కనిపించేయి.

''ఈ కొండమీద హిందువుల దేవుడు వెంకటేశ్వరస్వామి, దానికెదురుగా క్రిష్టియన్ల చర్చి, దానికెదురుగా మహ్మదీయుల దర్గా వున్నాయి, ఇలా మూడుమతాల దేవాలయాలు ఒకేచోట ఎదురెదురుగా వుండటం నాకుతెల్సి ఆంధ్రదేశంలో మరెక్కడా లేవు. మిగతా రాష్ట్రాల్లో కూడా వున్నట్టు నేనెప్పుడూ వినలేదు''

పంతులుగారికి ఆ దృశ్యం వింతగా కనిపించింది. ''బాగుంది బాగుంది... ఇలాంటి ఏర్పాటు ప్రతి నగరంలోనూ చేస్తే బావుంటుందిరా'' అన్నాడు దేవాలయం మెట్లు దిగుతూ.

దేవాలయం సముద్రాన్ని ఆనుకుని వుంది. సముద్రం మీద రెండు షిప్పులు, చాలా లాంచ్‌లు, స్టీమ్‌బోట్స్ కనిపిస్తున్నాయి.

''భారతదేశంలో వుండే పెద్ద హార్బర్స్‌లో యీవూరి హార్బరు కూడా ఒకటి నాన్నా! ఇందులో దాదాపు పాతికవేలమంది వుద్యోగస్తులు పనిచేస్తున్నారు. ఔటర్ హార్బర్ అంటూ మరో హార్బర్ కట్టేక దీని విలువ, రాబడి మరింత పెరిగిపోయాయి'' అంటూ సముద్రం వైపు చూపించేడు.

సముద్రం మీద ప్రయాణం చేస్తున్న లాంచ్‌లను చూస్తూ కాస్సేపు ఎంజాయ్‌చేశారు. తల్లిదండ్రుల ముఖాల్లో కనబడుతున్న ఆనందాన్ని చూస్తూ- ''ఆ లాంచి మీద కాస్తదూరం వెళ్ళొద్దామా'' అన్నాడు.

''అదే నేనూ అందామనుకుంటున్నాన్రా'' అన్నాడు నర్సింపంతులు భార్య అభిప్రాయం కోసం ఆమెవైపు చూస్తూ.

''నేనురాను బాబూ... నాకు భయం'' అంది కామేశ్వరమ్మ సముద్రపు గాలితట్టుకోలేక, చీర చెంగుని భుజాలనిండా కప్పుకుంటూ.

''ఫర్వాలేదమ్మా... మరేం భయం లేదు. ఇలాంటి అవకాశం మళ్లీ ఎప్పుడొస్తుంది''

''అదే వస్తుంది లేరా! నువ్వా లాంచీని బేరమాడు'' అన్నాడు పంతులు ఎంతో ఉత్సాహం కనబరుస్తూ.

''బేరమాడ్డానికివి ప్రైవేటు వ్యాపారస్తులవి కావు నాన్నా. ఇవన్నీ పోర్టు వాళ్లవే. డిప్యూటీ కన్జర్వేటర్ అనే ఆఫీసరు హయాంలో యివన్నీ పనిచేస్తాయి. అతను నాకు తెల్సినవాడే, ఇలాంటి అవసరం పడుతుందనే మనం బయలుదేరే ముందు ఆయనకి ఫోన్ చేసేను. మీరిక్కడే వుండండి, నేనిప్పుడే వస్తాను'' అంటూ చలపతి అక్కడే వున్న డిప్యూటీ కన్జర్వేటర్ దగ్గరకి వెళ్లేడు.

పదినిమిషాల్లో మరో వ్యక్తిని వెంటబెట్టుకుని వచ్చేడు. ముగ్గురూ లాంచీ ఎక్కి సముద్రంలో చాలాదూరం వెళ్లేరు. మొదట ప్రాణాలు గుప్పిట్లో పెట్టుకుని, భయంభయంగా లాంచీ




ఎక్కిన కామేశ్వరమ్మకి మరో అయిదునిమిషాల్లోనే భయం తీరిపోయి సముద్ర ప్రయాణాన్ని ఎంజాయ్ చేయసాగింది. సముద్రం మధ్యలో ఓ షిప్పు నిలబడ్డం కనిపించింది.

"ఈ ఓడ ఇక్కడుండిపోయిందేంరా?" అన్నాడు ఆ షిప్పువైపు ఆశ్చర్యంగా చూస్తూ.

"పోర్టులో షిప్పులు వచ్చి నిలబడ్డానికి బెర్తులుంటాయి నాన్నా. బెర్తులంటే, మన రైల్వే స్టేషన్లలో ట్రైన్లు నిలబడ్డానికి ప్లాట్‌ఫారాలుంటాయి గదా, అలాంటివే అనుకోవచ్చు. ఒక్కొక్కప్పుడు ఆ బెర్తులు ఖాళీ లేకపోతే, అవి ఖాళీ అయేవరకూ, యీ షిప్పుల్ని యిక్కడ ఆపుచేస్తారు. అదిగో ఆ కొండవైపు చూడండి" అంటూ డాల్ఫిన్స్ నోస్ కొండవైపు చూపించేడు.

అక్కడ లైట్‌హౌస్ కనిపించింది.

"దాన్ని లైట్‌హౌస్ అంటారు. రాత్రిపూట అక్కడినించి ఓ లైటు వెలిగి దాని కాంతి ఈ సముద్రం మీద పడుతుంది. ఆ లైటు కొన్ని మైళ్ళదూరం వరకూ పడుతుంది. పోర్టులోకి రాబోతున్న షిప్పులకి లైటు చాలా వుపయోగపడుతుంది"

పంతులుగారు ఒక్కసారి చుట్టూ తిరిగి అన్నివైపులా చూసేడు. ఎటుచూసినా నీళ్లే! నీళ్లు తప్ప మరేం కనిపించడంలేదు. అప్పుడు కాస్త భయం వేసింది.

"ఇంక వెనక్కి వెళ్లిపోదాం" అంటూ భార్యవైపు చూసేడు.

"నేనూ అదే అందామనుకుంటున్నాను" అంది కామేశ్వరమ్మ.

లాంచీ వెనక్కి మళ్లింది.

"గతంలో సముద్రంమీద ప్రయాణం చేయడం మహాపాపంగా పరిగణించేవారట. ఎవరైనా షిప్పులమీద విదేశాలు వెళ్లొస్తే, వాళ్లని పాపపరిహారం చేసుకోమని ఆంక్షలు విధించేవారు. కానీ, యిప్పుడు కాలంతోపాటు ఆచారాలు, విశ్వాసాలు అన్నింట్లోనూ మార్పులొచ్చేశాయికదా! ఇప్పుడు షిప్పుల మీదే ఎక్కువగా విదేశాల్లో వ్యాపారాలు సాగుతున్నాయి. కొన్నివేలకోట్ల ఆదాయం అటు ప్రభుత్వానికిగాని, యిటు ప్రైవేట్ షిప్పింగ్ కంపెనీలకిగాని లభిస్తోంది" చలపతి చెప్తున్నాడు. ఓ చోట పెద్దపెద్ద వలల్తో వెళ్తున్న లాంచీలు కనిపించేయి.

"ఈ మధ్య చేపల్ని, రొయ్యల్ని పట్టి, విదేశాలకి ఎగుమతి చేసి, కోట్లల్లో వ్యాపారం చేయడం ఎక్కువైంది నాన్నా! ఎంతోమంది వ్యాపారస్తులు యీ ఫిషింగ్ చేయడంలోనే ఎంతో లాభాలు గడించేరు. వీటిని విదేశాలకి ఎగుమతి చేయడానికి చాలా కంపెనీలు కూడా ఏర్పడ్డాయి. అదిగో అటుచూడండి, సముద్రం మధ్యలో కట్టిన ఆ బెర్తు పెరుగుతున్న మానవుడి విజ్ఞానానికి నిదర్శనం. సముద్రాన్ని కాస్త ఇవతలికి లాగడం, సముద్రం మధ్య దాన్ని కట్టడం తమాషాగా వుందికదూ"

చలపతి చెప్పడం పూర్తికాకుండానే లాంచీ ఒడ్డుకుచేరింది. దాన్ని ఏర్పాటు చేసిన టగ్ మాస్టర్‌కి థాంక్స్‌చెప్పి బయటకొచ్చేరు.

సముద్రం మధ్య కనిపించిన షిప్పుని చూసిందగ్గర్నించి, అందులోకి వెళ్లి లోపల ఏంవుంటుందో చూడాలనే సరదా ఎక్కువైంది పంతులుగారికి. కొడుకుతో తన కోరిక గురించి చెప్పేడు.

"అదేం పెద్ద భాగ్యం. నాకు తెల్సిన షిప్పింగ్ ఏజెంట్లు, కస్టమ్స్ ఆఫీసర్లు చాలామంది వున్నారు" అంటూ కార్లో పోర్టు మైన్‌గేటు దగ్గరకొచ్చేడు.

అక్కడ తనకితెల్సిన కస్టమ్స్ ఆఫీసర్ ఎవరైనా వుంటే సరేసరి. లేకపోతే ఎవరైనా షిప్పింగ్ ఏజెంటు దగ్గరికి వెళ్లాలనుకున్నాడు. కానీ అదృష్టవశాత్తు అతనికి బాగాతెల్సిన ఆఫీసరే మైన్‌గేటు దగ్గర కనిపించి విష్ చేశాడు. చలపతి తను వచ్చిన విషయం చెప్పగానే "ష్యూర్ ష్యూర్" అంటూ అతనూ ఆ కారు ఎక్కి ఓ బెర్తు దగ్గరకి తీసుకొచ్చేడు.

అది రష్యన్ షిప్పు. చూడ్డానికి చాలా భయంకరంగా, దాదాపు ఓ కిలోమీటరు పొడవున్నంత భ్రమకలిగించే చాలా పెద్దషిప్పు. ఆ షిప్పు గురించి ఆఫీసరు ఇంగ్లీషులో వివరిస్తుంటే, చలపతి దాన్ని తెలుగులోకి తర్జుమా చేసి, తల్లిదండ్రులకి వినిపిస్తున్నాడు.

షిప్పుదగ్గరకొచ్చేరు. మీదకి వెళ్లాలంటే తాళ్లతో వ్రేళ్లాడదీసిన కేడర్ మీదనించే వెళ్లాలి.

కామేశ్వరమ్మ భయపడుతూ "నేనురానురా, నాకు కళ్లుతిరుగుతాయి. నేనిక్కడే వుంటాను మీరు వెళ్లిరండి" అంది.

ఆమెను కార్లోనే కూర్చోమనిచెప్పి, పంతులు గారు పంచె మీదకి ఎగ్గట్టి, ధైర్యంగానే ముంద డుగువేశారు. జాగ్రత్తగా నిచ్చెనమీదనించి నడుస్తూ షిప్పులోకి వెళ్లారు. ఆఫీసరు ఓపిగ్గా షిప్పంతా తిప్పితిప్పి చూపించాడు. షిప్పులోనే టేబిల్‌టెన్నిస్ ఆడుకునే స్థలం, కేంటీను, పడుకోడానికి బెర్తులు, వంటగది, కెప్టన్ రూమ్, యివన్నీ చూసేక, ఆ షిప్పు ఒక్కటే ఓ చిన్నసైజు వూరులా కనిపించింది పంతులు గారికి.

ఆఫీసరు కూల్‌డ్రింక్స్ ఆఫర్ చేశారు. పంతులుగారు డ్రింకు తాగుతూ "ఈ షిప్పు ఒక్కటీ ఎంతఖరీదుంటుందో" అన్నాడు చల పతితో.

"చాలా కోట్ల ఖరీదుంటుంది నాన్నా"

"చాలా కోట్లు అంటే, ఎన్ని కోట్లూ అని?"

"నాకు తెలీదు"

"ఆయన్నికనుక్కో"

"ఆయన్ని అడిగితే బాగోదు. ఎవర్నైనా కనుక్కుని రేపు చెప్తాను"

ముగ్గురూ షిప్పు దిగేరు. కారు దగ్గరకి వెళ్లబోతూ చలపతి తండ్రికోసం చూస్తే అతను కనిపించలేదు. అతనింకా షిప్పు దగ్గరే నిలబ డి దేనికోసమో వెదుకుతూ అటూ యిటూ తిరుగుతున్నాడు. చలపతి గబగబా తండ్రి దగ్గరకి వెళ్లేడు.

"ఏమిటినాన్న, ఏంవెదుకుతున్నావ్. ఏదైనా పోయిందా?"

"ఏంపీ పోలేదురా... ఏదైనా రాయి దొరుకు తుందేమోనని వెదుకుతున్నాను"

"రాయి దేనికి?"

"చెప్తా చెప్తా" అంటూ ఓవైపు చూశాడు. దూరంగా ఓ రాయి కనిపించింది. గబగబా అక్కడికివెళ్లి ఆ రాయిని పట్టుకొచ్చేడు. అది పిడికిట్లో ఇమిడేటంతరాయి. తండ్రి ధోరణి ఏవిటో చలపతికి అర్థంకాలేదు.

"ఆ రాయితో ఏంచేస్తావు?"

పంతులుగారు జవాబు చెప్పకుండా, ఆ రాయిని సముద్రపు నీటిలో విసిరేడు. అది వెంటనే మునిగిపోయింది.

"ఏంవిటినాన్నా యిది? అవతల ఆ కస్టమ్స్ ఆఫీసరు మనకోసం వెయిట్ చేస్తుంటే, నువ్వు యిక్కడ చిన్నపిల్లాడిలా ఆడుకోవడం ఏవిటి?" చలపతి కాస్త చిరాగ్గానే అన్నాడు.

'ఆడుకోవడం కాదురా! నేను పిడికెడు రాయి నీట్లో వేస్తే అది బుడుంగుమని మునిగి పోయిందికదా! మరి యింత పెద్దషిప్పు నీటిలో మునిగిపోకుండా ఎలా నిలబడగలి గిందా అని పరీక్షిస్తున్నాను"

చలపతి చిన్నగా నవ్వేడు. "అది తెల్సుకో వాలంటే చాలా తెల్సుకోవాలిగాని, తీరిగ్గా చెప్తా నుపదా" అంటూ తండ్రిని తీస్కుని కారుఎక్కే డు.

మెయిన్‌గేటు దగ్గర కస్టమ్స్ ఆఫీసర్ని దించి, అతనికి థేంక్సుచెప్పి కారుని ముందుకి పోనిచ్చాడు. కార్లో వెళ్తూనే పోర్టు ఎడ్మినిస్ట్రేటివ్ ఆఫీసు బిల్డింగ్, ఫుడ్‌కార్పొరేషన్ ఆఫ్ ఇండి యా వాళ్ల గోడౌన్సుని చూపి జగదాంబ జంక్షన్ దగ్గరకొచ్చేడు చలపతి.

"దీన్ని జగదాంబా సెంటర్ అంటారు నాన్నా. అదిగో ఆ జగదాంబ సినిమాథియేట రు యిక్కడ కట్టడంవల్లా ఈ ఏరియాకి ఆ పేరు వచ్చింది. ఇది ఈవూరంతటికీ చాలా ముఖ్యమైన సెంటరు. అంతకుముందు దీన్ని ఎల్లమ్మతోట అనేవారు. ఈ ఊర్ని ప్రపంచప్ర ఖ్యాతిగాంచే నగరంగా తీర్చిదిద్దాలని ప్రయ త్నిస్తున్నారు. ఈవూరు గత పాతికముప్పైఏళ్ల నుంచే అభివృద్ధి చెందడం ఆరంభించింది.

"చిన్నాన్న నన్ను చిన్నతనంలో ఈ ఊరు తీసుకొచ్చేసరికి ఈ ఊరు రెక్కలు ముడుచు కుని నిద్రపోతున్న పక్షిలా ఇంత చిన్నగా వుండేది. కానీ గత ముప్పైఏళ్ళనుంచీ ఇది రోజురోజుకీ ఎదిగిపోతోంది. ఈ ఏరియాలో ఒక ప్పుడు భయంకరమైన తోటలుండేవి. పాము లు మహా విపరీతంగా తిరిగేవంటారు. సాయంత్రం ఆరుగంటలు దాటేక ఈ ప్రాంతా నికెవరూ రావడానికి భయపడిపోయేవారు. అప్పట్లో ఇక్కడి స్థలాన్ని గజం అణాకి, అర్థణాకి అమ్మినా ఎవరూ కొంటానికి సాహసించే వారు




కాదు, కానీ యిప్పుడు గజానికి నాలుగువేలు యిచ్చినా కొంటానికి గజం స్థలం లేదు''

పంతులుగారు నోరుచప్పరిస్తూ ''మీ చిన్నాన అప్పట్లో ఓ వెయ్యిగజాలు కొని పడేస్తే యీ పాటికి ఎన్ని లక్షలు చేసివుండేదో! ఆ వెధవకి ముందుచూపు ఏమాత్రం లేదు'' అన్నాడు.

''బాగుంది నాన్నా! ఈవూరు యింతలా డెవలప్ అవుతుందని చిన్నాన్న మాత్రం వూహించేడా''

ఆకాశంలో విమానం వెళ్లడం కనిపించింది. చాలాదగ్గర్లో ఎగురుతూ కనిపించడంతో పంతులుగారి దృష్టంతా దానిమీదకేపోయింది. విమానాలు ఎలా ఎగురుతాయో, ఎలాదిగుతాయో చూడాలన్నాడు. చలపతి టైము చూస్కున్నాడు. ఎయిర్‌పోర్టుకెళ్తే హైదరాబాద్ నుంచి వచ్చే ఫ్లైటు లేండ్ అవడం చూపించొచ్చు- కానీ, టేక్ ఆఫ్ చూపించడానికి ఏ విమానాలు యిప్పుడున్నాయా అని ఆలోచించేడు. మద్రాసు వెళ్లేది, హైదరాబాద్ వెళ్లేది యీ టైముకి వెళ్లిపోతాయి. అలా అని కూడా గ్యేరంటీలేదు. ఈ మధ్య ఫ్లైట్సు కూడా గంటలకు గంటలు లేటుగా వెళ్తున్నాయి. ఓ ట్రైల్ వేసిచూద్దాం అనుకుంటూ ఎయిర్‌పోర్టువైపు కారుని టర్న్ చేశాడు.

కారు ఎయిర్‌పోర్ట్‌కొచ్చింది. కారుదిగి లోపలకి నడిచేరు. ఆ రోజు వుదయం ఎనిమిదిగంటలకి బయలుదేరాల్సిన ఫ్లైటు నాలుగ్గంటలు లేటుగా, మరో పావుగంటలో బయలుదేరుతుంది. ముసలాళ్లు అదృష్టవంతులనుకుంటూనే వాళ్లని తీసుకుని విజిటర్స్‌లాంజ్‌లోకి వెళ్లాడు. మైకులోనించి ఎనౌన్స్‌మెంటు వినిపిస్తోంది. ప్రతీ పేసింజర్‌ని కస్టమ్స్‌వాళ్లు ఎలాచెక్‌చేస్తారో, ఎందుకు చెక్‌చేస్తారో క్లుప్తంగా వివరించేడు.

రన్‌వేమీద నిలబడివున్న విమానాన్నే పంతులుగారు, కామేశ్వరమ్మ వింతగా చూస్తున్నారు. పేసింజర్లు ఎక్కుతున్నారు. వాళ్ల లగేజిని మోటర్‌వెహికల్‌మీద తీసుకొచ్చి లోడ్‌చేస్తున్నారు. టేకాఫ్ టైమ్ అవగానే ఫ్లైటు స్టార్టయింది. రన్‌వేమీద స్పీడుగా వెళ్తూనే, సడన్‌గా గాల్లోకెగిరి, ఆకాశంలోకి దూసుకుపోయింది. అది కంటికి కనిపించేంతవరకూ అలాగే రెప్పార్పకుండా చూశారు.

''ఇంకవెళ్దామా?'' చలపతి భుజంమీద చెయ్యివేసి అడిగేవరకూ పంతులుగారు ఈ లోకంలోకి రాలేదు, మెట్లుదిగి కారుదగ్గరకొస్తూ అడిగేడు.

''ఇది మెడ్రాసు ఎప్పటికెళ్తుందిరా?''

''యాభై నిమిషాల్లో వెళ్లిపోతుంది నాన్నా''

''యాభై నిమిషాలా? అంటే గంట కూడా పట్టదన్నమాట. అంత వేగంగా వెళ్లిపోవడానికి మద్రాసు మరీ అంత దగ్గరా?''

''దగ్గరేం కాదు, సుమారు ఐదువందల మైళ్లుంటుంది''

''అంటే యీ వూరికీ- మన చింతల అగ్రహారానికి వున్న దూరంకంటే ఎక్కువట్రా''— యీ ప్రశ్న కామేశ్వరమ్మ కారు ఎక్కుతూ అడిగింది.

''అంతకంటే చాలాదూరంవమ్మా! విమానం అన్ని వాహనాల్లోకి ఎక్కువ స్పీడుగా వెళ్తుంది కాబట్టే అయిదువందల మైళ్లనీ యాభై నిమిషాల్లో చేరుకోగలుగుతోంది''

''ఇక్కణ్ణించి మెడ్రాసుకి టిక్కెట్టు ఎంతో?''

''సుమారు ఎనిమిది వందల యాభై వుంటుంది'' ముసలాళ్లిద్దరూ ''అమ్మో'' అంటూ ఆశ్చర్యపోయేరు. ''అంత డబ్బుపోసి ప్రయాణం చెయ్యకపోతేనేం, శుభ్రంగా ఏ బస్సులోనో అయితే చవగ్గా వెళ్లొచ్చుగా'' అంటూ కామేశ్వరమ్మ నోరునొక్కుకుంది.

చలపతి నవ్వుకున్నాడు. ''నిజమేనమ్మా! కానీ యివాళ డబ్బుకంటే కాలం చాలా విలువైంది. ఇక్కడ నుంచి కోరమండల్ ఎక్స్‌ప్రెస్ లాంటి ట్రైన్లో వెళ్తే పదమూడు పధ్నాలు గంటల్లో మద్రాసు చేరుకోవచ్చు. అదే మిగతా ఎక్స్‌ప్రెస్ ట్రైన్స్‌లో వెళ్తే పదిహేను పదహారు గంటల్లో చేరుకోవచ్చు. కానీ విమానంలో వెళ్తే ఓ గంటలో చేరుకోవచ్చు. అంటే విమానాల్లో వెళ్లే వారికి ప్రయాణానికి ఖర్చు అయ్యే మిగతా పధ్నాలుగు గంటలు దానికిచ్చే రేటుకంటే విలువైంది. డబ్బున్నవాళ్లు, త్వరగా గమ్యం చేరుకోవాలనుకున్నవాళ్లు మాత్రమే అంత




డబ్బు ఖర్చుపెట్టి అందులో ప్రయాణం చేస్తారు''

కారు వెళ్తోంది. కాస్సేపు ఎవరూ మాట్లాడలేదు.

''నువ్వెప్పుడైనా విమానంలో మద్రాసు వెళ్లావట్రా?'' కామేశ్వరమ్మ ఆసక్తిగా అడిగింది.

''ఒక్కసారి మద్రాసు వెళ్లేను. కానీ చాలాసార్లు హైద్రాబాదు వెళ్లాన్లే''

''చాలాసార్లు అంటే''?

''సుమారు ఓ యిరవైసార్లు వెళ్లివుంటాను''

''ఇటు ఎనిమిది వందల యాభై, అటు ఎనిమిది వందల యాభై అంటే ఓసారి వెళ్లిరావడానికి పదిహేడువందలా? ఆలెక్కన యిరవైసార్లంటే ఎంతయి వుంటుందిరా?'' అంటూ నోటితోనే లెక్కకట్టనారంభించింది.

చలపతి నవ్వేడు ''నేను హైకోర్టు పనిమీద వెళ్లేవాడినమ్మా, నాకు అయే ఖర్చంతా నన్ను పంపించినవాళ్లే పెట్టుకుంటారు''

''అయితే ఫర్వాలేదు'' ముసలాళ్ల గుండెలు తేలికపడ్డాయి. ''మీకు విమానం ఎక్కాలని సరదా వుంటే రేపు హైదరాబాద్ చెల్లాయ్ దగ్గరకెళ్లడానికి విమానంలోనే పంపిస్తాను''

''హైదరాబాదుకి టిక్కెట్టెంత?''

''సుమారుగా అదీ అంతేవుంటుంది''

''అయితే వద్దు, వెధవ దుబారా నువ్వూను'' కామేశ్వరమ్మ మందలించింది.

కాస్సేపైనతర్వాత ''ఈ విమానాలు కనిపెట్టి ఎన్ని యుగాలై వుంటుందిరా?'' అన్నాడు నర్సింపంతులు.

''యుగాలా... విమానాలొచ్చి ఎనభయ్యేళ్లు కూడా దాటి వుండవు నాన్నా''

పంతులుగారు కొడుకువైపు వింతగా చూస్తూ- ''అదేవిట్రా అలా అంటావు, రామాయణంలోని రావణాసురుడు సీతాదేవిని పుష్పకవిమానంలోనే ఎత్తుకుపోయాడని రాసేరు. మరీ విమానాలు అప్పట్నించీ వున్నట్టేగా'' అన్నాడు.

''అసలు రామాయణం నిజంగా జరిగిందా లేక అది కల్పించిన కథ- అని నా సందేహం''

''ఛ... వూరుకో నీకు మరీ నాస్తికవాదం ఎక్కువైపోతోంది. నిజంగా జరిగిన కథనే వాల్మీకి రాసేడు. అందులో విమానాలు లేకుండా ఎందుకు రాస్తాడు? ఆయనేమైనా అబద్ధాల్ళు రాసే మనిషా?''

చలపతికి తండ్రితో వాదించబుద్ధి కాలేదు. ఎందుకంటే రామాయణం నిజంగా జరిగిందో లేదో ఆయనా చూడలేదు, తనూ చూడలేదు. అలాంటపుడు ఈ వాదన అనవసరం అని మౌనం వహించేడు.

ఇంటికొచ్చి భోజనాలు చేశాక, మధ్యాహ్నం మూడుగంటల వేళప్పుడు తల్లిదండ్రుల్ని తీసుకుని సింహాచలం వెళ్లి వరాహనరసింహస్వామి దర్శనం చేయించేడు.

''ఇక్కడి దేవుడు వరాహనరసింహస్వామి అయితే, కొంతమంది సిమ్మాద్రి అప్పన్నా అని ఎందుకంటార్రా?'' అన్నాడు పంతులు మంటపంలో కూర్చుని కొబ్బరిముక్క నములుతూ.

''ఆ దేవుడి విగ్రహాన్ని అప్పన్న అనే భక్తుడు చెక్కడంవల్ల అతనికాపేరు వచ్చిందని ఎవరో చెప్పగా విన్నాను''

అంటూ అక్కడున్న బుక్‌స్టాల్‌కెళ్లి, ఆ దేవాలయానికి సంబంధించిన లిటరేచర్ పుస్తకాలు కొనుక్కొచ్చి ''నువ్వు చదువుకోడానికి పనికొస్తాయి వుంచు నాన్నా'' అన్నాడు చలపతి.

ఆ పుస్తకాలు యివ్వడంలో తండ్రిమీద ప్రేమకంటే యీ యాత్రాస్థలం గురించి ప్రశ్నలు కురిపిస్తే చెప్పలేక చావాలనే భయమే ఎక్కువ కనిపించింది.



మర్నాడు వుదయం-

విజయవాడ వెళ్లిన సుజాత, భారతి తిరిగొ

చ్చి యింటిముందు టేక్సీలో దిగేరు. భర్తపో యింతర్వాత కొన్నిరోజులవరకూ సుజాత తలలో పువ్వులు పెట్టుకోలేదు. నుదుట కుంకుమ దిద్దుకోలేదు. కానీ పుట్టింటికొచ్చేక ఓ రోజు చలపతి, సుభద్ర ఆమెను దగ్గరగా కూర్చోబెట్టుకుని చెప్పేరు.

''చూడమ్మా... వైధవ్యం సంప్రాప్తించినవాళ్లు పువ్వులు పెట్టుకోకూడదని, బొట్టు పెట్టుకోకూడదని ఆంక్షలు పెడతారు. కానీ కాస్త ప్రోగ్రెసివ్ థింకింగ్ వున్న మాబోటివాళ్లం అలాంటి ఆంక్షల్ని నాన్సెన్స్‌గా భావిస్తాం. చిన్నప్పట్నించీ ఆడది బొట్టూ కాటుక పెట్టుకుంటుంది. పువ్వులు తురుముకుంటుంది. అలాంటప్పుడు భర్త పోగానే వాటిని ఎందుకు మానుకోవాలి? ఆడదాని సౌభాగ్యానికి అవి గుర్తులని పెద్దవాళ్లు చెప్పారు. కానీ అలాంటి నమ్మకాలకి కాలం చెల్లిపోయిందని నాబోటివాళ్ల నమ్మకం. అంచేత నేను చెప్పేదేవిటంటే, నువ్వు ఎప్పటిలాగే బొట్టు పెట్టుకో పువ్వులు పెట్టుకో. ఎవరైనా నిన్ను కామెంట్ చేస్తారని భయపడకు. నువ్వు బతుకుతున్నదీ, బతకాల్సిందీ ఎవరికోసమో కాదు- నీ కోసం, మా కోసం''

తల్లిదండ్రుల విశాల హృదయానికి మనసులోనే ధన్యవాదాలు అర్పించింది సుజాత. అంతేకాదు డేన్స్ ప్రోగ్రాం యిస్తున్నప్పుడు తను ఎలాగూ పువ్వులు, బొట్టూ పెట్టుకోవాలి. అలాంటప్పుడు వాటిని దైనందిన జీవితంలో ఎందుకు పెట్టుకోకూడదు- అని తనకుతానే సమాధానం చెప్పుకుంది. కాకపోతే యిప్పుడు పరమచాంధస్తుడైన తాతగారు, మామ్మగారు యింట్లో వుండటంవల్ల వాళ్లు వున్నన్ని రోజులూ ఆ అలంకరణలు మానెయ్యమని చలపతి ఫోన్లో చెప్పడంవల్ల ట్రైన్ దిగేటప్పుడు తలలోని పువ్వులు తీసేసి, నీళ్లతో ముఖం కడుక్కుని బొట్టు లేకుండా యింటికి చేరుకుంది.

ముసలాళ్లు వేసిన ప్రశ్నలకి ముందుగానే సమాధానాలు తయారుచేసుకోవడంవల్ల, వాళ్లకి సంతృప్తి కలిగేవిధంగానే జవాబులు చెప్పింది. ఆ సంభాషణ పూర్తికాగానే, తదుపరి కార్యక్రమం యిదే అన్నట్టుగా, కామేశ్వరమ్మ ఘొల్లుమంటూ ఏడుపు ఆరంభించింది.

''ఆ భగవంతుడు ఎంత చిన్నచూపు చూశాడే తల్లీ! నీకింత పిన్నవయసులోనే వైధవ్యం దాపురించిందేవిటే తల్లీ'' అంటూ ఓ పావు గంటసేపు ఏకబిగిన ఏడ్చింది. నర్సింపంతులూ ఆమెకు వంత కలిపేడు. వాళ్ల ఏడుపూ, సానుభూతీ అందరికీ అయిష్టంగానే తోచింది. అప్రయత్నంగానే సుజాత కళ్లంట నీళ్లధార ప్రవహించింది.

సుజాత యిప్పుడిప్పుడే గతాన్ని మర్చిపోయి, దేవుడు చేసిన గాయాన్ని గుండెధైర్యంతో మాన్పుకుంటూ, నాట్యసాధనలో మనసుని లగ్నంచేస్తోంది. ఇపుడు మళ్లీ పూడుకుపోతున్న గతాన్ని ముసలాళ్లు సానుభూతి పేరిట బయటకు తవ్వుతున్నారు.

ఆ పరిస్థితినుంచి సుజాతని తప్పించాలని చలపతి సుభద్రకి కళ్లతోటే సంజ్ఞ చేశాడు. ఆమె కూతుళ్లిద్దర్నీ లోపలకి తీసుకువెళ్లింది. గదిలోకి వెళ్లగానే సుజాత మంచంమీద వాలిపోయింది. గతం అంతా కళ్లముందు గిర్రుమంటూ తిరగసాగింది.

భర్త కారు ఏక్సిడెంట్లో మరణించడం ఓ తట్టుకోలేని షాక్. అయితే ''అమ్మాయి నష్టజాతకురాలు. బిడ్డవచ్చిన వేళా, గొడ్డు వచ్చిన వేళా అని ఆవిడగారీ యింట్లో అడుగుపెట్టి పట్టుమని ఎనిమిది నెల్లయినా కాకముందే ఆ అబ్బాయి పోవడం ఏవిటీ?'' అంటూ కామెంట్స్ వినిపించాయి.

ఆ రోజంతా సుజాత అన్యమనస్కంగానే వుంది. టిఫిన్ చెయ్యలేదు, భోంచెయ్యలేదు. విజయవాడ, గుంటూరుల్లో తను యిచ్చిన నాట్యప్రదర్శనలు, ప్రేక్షకుల స్పందన, పలువురు పెద్దలు చేసిన అభినందన, వీటివల్ల కలిగిన ఆనందాన్నంతటినీ కామేశ్వరమ్మ కదలేసిన గతం ఒక్కసారిగా తుడిచిపెట్టేసింది.

సుజాత పరిస్థితిని వాణి గమనించి, కాస్త మనసు తేలికపడ్డానికి మాటల్లోకి దింపింది. ప్రోగ్రాములు ఎలా జరిగేయి? ఆడియన్సు బాగా వచ్చేరా? నీకిచ్చిన మెమొంటోల్ని మీ డాన్స్ కాలేజీలో పెట్టివచ్చేవా- అంటూ ఎన్నో ప్రశ్నలు వేసింది. అన్నింటికి పొడిపొడిగా జవాబులు చెప్పింది. అవిగూడా ఆమె అన్యమ




నన్యంగానే చెప్పింది.

ఆ రోజు రాత్రి గూడా సుజాత గతస్మృతుల్లోనే గడిపింది.

★ ★ ★

రసమయినాట్య కళాశాల' ఆ వూర్లోని మిగతా డేన్స్ స్కూల్సుకంటే అన్ని విధాలా ఎక్కువ ప్రాముఖ్యతని సంపాదించుకుంది. దాన్ని నిర్వహిస్తున్న జ్ఞానేశ్వరమూర్తి వస్తుతః నాట్యశాస్త్ర కోవిదుడు. తన శిష్యబృందంతో దేశ విదేశాల్లో నృత్యప్రదర్శనలిచ్చి, భరతనాట్యానికి, కూచిపూడి నృత్యానికి ప్రపంచవ్యాప్తంగా కీర్తిప్రతిష్ఠలు తీసుకురావడంతో ఆయన దగ్గర నృత్యం నేర్చుకోవడమే ఓ మహదవకాశంగా భావిస్తారు. అక్కడ సాధనచేసిన యిద్దరమ్మాయిలకి గత సంవత్సరం సినిమాల్లో అవకాశాలురావడం, వాళ్ళ దశ తిరిగి, హీరోయిన్లుగా మారిపోవడంతో, ఆ కాలేజీ గురించి మరింత క్రేజ్ ఏర్పడింది.

రవీంద్రనాథ చటోపాధ్యాయ ఆ కాలేజీ స్టూడెంట్! అతను బెంగాలీ యువకుడు. అందరూ అతన్ని రవీంద్ర అనే పిలుస్తారు. బెంగాలీ, ఇంగ్లీషు, హిందీభాషలు తప్ప అతనికి తెలుగు తెలియదు. కాకపోతే తెలుగుభాషని బాగానే అర్థంచేసుకుంటాడు. తెలుగు మాట్లాడాలని అతను ప్రయత్నిస్తున్నాడుగాని, ఇంకా భాషమీద పట్టు దొరకలేదు. తల్లిదండ్రులు కలకత్తాలో వుంటున్నారు. ఈ ఊళ్లో ఓ ఫైనాన్సింగ్ కార్పొరేషన్‌కి మేనేజరుగా నియమించబడ్డాడు. ఆ కాలేజీలో చేరేసరికే అతనికి నృత్యకళలో ప్రవేశం వుంది. ఇక్కడకొచ్చేక ప్రావీణ్యత సంతరించుకున్నాడు.

మొన్న విజయవాడ, గుంటూరుల్లో యిచ్చిన 'రతీమన్మథ' నృత్యం ఓ ప్రత్యేకాకర్షణగా పేర్కొనబడింది. అందులో మన్మథపాత్రని అతను అభినయిస్తే సుజాత రతీదేవి పాత్రలో జీవించింది. అతనికి సుజాత మంచి నర్తకిగానేకాక, మంచివ్యక్తిత్వంవున్న మనిషిగా కూడా కనబడింది. ఆమె వైధవ్యం చెందిన తర్వాతే అతనాస్కూల్లో ప్రవేశించేడు.

ఆమె నృత్యశైలి, భావప్రకటన చూసేక నటరాజు ఆమెను శాశ్వతంగా తన శిష్యురాలుగా మిగుల్చుకోడానికే ఆమెకు వైధవ్యం సంప్రాప్తింపజేసాడా అనుకున్నాడు రవీంద్ర. పరిచయం పెరిగే కొద్దీ ఆమె తన భార్య అయితే బాగుణ్ణనుకున్నాడు. కానీ ఏనాడూ తన అభిప్రాయం ఆమె దగ్గరగాని, మరొకరి దగ్గరగాని వ్యక్తం చేయలేదు. ఆమె అతన్ని సహవిద్యార్థిగానే చూస్తోంది తప్ప, మరో భావం ఏదీ ఆమె ప్రదర్శించలేదు.

పిరికితనంతో మూలుగుతున్న మనసుని వుగ్గబట్టుకుని మొన్న గుంటూర్లో మాత్రం ఎవరూ లేని ఏకాంతసమయంలో ఆమె ముందు తన అభిప్రాయాన్ని తెలియజేశాడు. సంభాషణంతా హిందీలోనూ, ఇంగ్లీషులోనే జరిగింది.

తన అభిప్రాయాన్ని తెలియజేస్తూ అతనో విషయం చెప్పేడు. "భగవంతుడిచ్చిన శాపానికి మీ జీవితం బలైపోయిందన్న జాలితో మిమ్మల్ని పెళ్లి చేసుకుంటాననడంలేదు. జాలిలో నించి పుట్టేది జాలే అవుతుందిగాని, ప్రేమవదు. మీరు నచ్చేరు., మీ వ్యక్తిత్వం నచ్చింది. ఈ రెండూ వున్న మంచినర్తకిగా నాకు మరింత నచ్చేరు. మీరు నా దృష్టిలో విడోకారు. ఏనాడూ ఆ విషయాలు అడగను. మీక్కూడా నేను నచ్చితే మిగతా విషయాలు మా పెద్దవాళ్లొచ్చి మాట్లాడతారు. ఒకవేళ నేను బెంగాలీనవడమే మీ పెద్దవాళ్ల కభ్యంతరమైతే, నేను మీవాణ్ణికావడానికి నేనేం చెయ్యాలో చెప్పండి. ఎంతకష్టమైనా ఆ పనిచేస్తాను"

సుజాత ఆ మాటలు వినగానే ఆశ్చర్యపోలేదు, సంతోషించలేదు, బాధపడలేదు. మౌనంగా వుండిపోయింది. అంతే నిద్రపోతున్న ఆమె జీవిత సమస్య అప్పుడే మేల్కొని కళ్లు విప్పింది. తను రవీంద్రని ప్రేమిస్తోందా? లేదు. ద్వేషిస్తోందా? లేదు. తనని పెళ్లాడాలనే అతని కోరికకి తను ఎలా ప్రేరణయిందో తనకి తెలియదు. కానీ అతను పెళ్లి విషయం ప్రస్తావిస్తున్నాడు.

తను ద్వితీయ వివాహం చేసుకోవాలా? అక్కర్లేదా? ఇది మొదటి ప్రశ్న. చేసుకోనూ అంటే తర్వాత ఆలోచించవలసిన విషయాలు ఏవీ వుండవు. ఒకవేళ చేసుకోవాలని ఆశపడితే? అప్పుడే వుత్పన్నమవుతాయి చాలా సమస్యలు.

ఒకటి- విధవా వివాహం! సాంప్రదాయబద్ధంగా సాగుతున్న తన కుటుంబం అందుకు ఒప్పుకుంటుందా?

రెండు- వర్ణాంతర వివాహం! ఇది వర్ణాంతరం కూడా కాదు, భాషాంతర వివాహం, రాష్ట్రాంతర వివాహం. అతను బెంగాలీ! తను ఆంధ్ర! బెంగాలీలో అతను ఏ కులస్థుడో తెలీదుగాని తను మాత్రం బ్రాహ్మిన్.

తన వరకూ అతను చదువు, సంస్కారం వున్న మనిషి, మంచి నర్తకుడు. అంతే ఆలోచించాలి. కానీ- తన పెద్దవాళ్లు?

ఇలాంటి ఆలోచనల్తో ఆమె మౌనంగా వుండిపోయి, ఆ ప్రస్తావనని తాత్కాలికంగా దాటేసింది. తిరుగుప్రయాణంలో మెదడు నిండా ఇదే ఆలోచన. అంత తీవ్రమైన ఆలోచనకి మరోకారణం, తన తండ్రికి ఫోన్ చేసినప్పుడు ఆయన తాత గురించి చెప్పిన మాటలు అతనెంతచాదస్తుడో నాన్నగారు చెప్పేరు. తన పెళ్లి, తన అన్నయ్యా పెళ్లివరకూ అన్ని నిర్ణయాల్నీ తన తండ్రి చిన తాతగారితోనే సంప్రదించేవారు. అందువల్ల నర్సింపంతులుగారి అభిప్రాయాన్నిగాని, ఆదేశాన్నిగాని ఎవరూ పట్టించుకోలేదు. అతనూ అడగలేదు. ఎందుచేతంటే తన పెళ్లి, అన్నయ్యా పెళ్లి సాంప్రదాయబద్ధంగానే జరిగేయి. ఇప్పుడు అందుకు భిన్నంగా జరగాలి. ఇకమీదట ఏంజరిగినా నర్సింపంతులూ, ఆయన భార్య అభిప్రాయాలకి అనుకూలంగానే జరగాలి. వాళ్లనికాదని నాన్న ఏమీ చెయ్యలేడు. చేయగలిగేవాడు అయితే "నా కూతుర్ని డేన్సు ప్రోగ్రాముకి పంపించేను- అదంతా నాయిష్టం" అనేవాడు. కళారాధనకి ప్రోత్సహించినతండ్రే, ఆ విషయాన్ని తన తండ్రి దగ్గర దాచిపెట్టి, పెళ్లికెళ్లిందని అబద్ధం చెప్పి, అదేమాట తనచేతా చెప్పించినవాడు రేపు యీ భాషాంతర వివాహానికి తాతగార్ని ఎలా ఒప్పించగలడు?

తన తండ్రి అభ్యుదయవాది. కాబట్టి కూతురి భవిష్యత్తుకోసం యీ సాహసం తప్పకుండా చేస్తాడు. కానీ- ఫైనల్ డెసిషన్ తీసుకోవలసింది నర్సింపంతులుగారు. ఆయన ఒప్పుకుంటాడా?

విధవరాలు మరో పెళ్లి చూడ్డానికి వెళ్లిందంటేనే మండిపడిన వాడు, ద్వితీయవివాహానికి ఒప్పుకుంటాడా?

సుజాత ఇలాంటి ఆలోచనల్తోనే మనశ్శాంతికి దూరమైంది. ఆరోజు డాన్సుస్కూలుకొచ్చేసరికి అతను స్కూలుకి కాస్త దూరంగా తనకారు ఆపుచేసి, ఆమె రాకకోసమే ఎదురు చూస్తున్నాడు. ఆమె అప్రయత్నంగానే అక్కడో రెండు క్షణాలు ఆగింది.

అతను రెండేరెండు వాక్యాలు మాట్లాడేడు- "ఒత్తిడి చేస్తున్నాననుకోకండి. నేను అడిగిందానికిప్పుడేకాదు, ఎన్ని సంవత్సరాల తర్వాత జవాబు చెప్పినా ఫర్వాలేదు. ఎందుకంటే, నేను అప్పటికీ అవివాహితుడిగానే వుంటాను. ఎటొచ్చి నేను అడిగిందాన్ని గురించి ఆలోచించి జవాబు చెప్పమని కోరుతున్నాను" అనేసి కారు డ్రైవ్ చేసుకుంటూ వెళ్లిపోయాడు.

మెదళ్ళోని ఆలోచనలు కాళ్లని కట్టేసినట్టయింది. ఆరోజు సాధన సరిగా జరగలేదు. ఓ అరగంట తర్వాత గజ్జెలు విప్పేసి ఇంటికి వెళ్లిపోయింది.

★ ★ ★

నర్సింపంతులు టిఫిను క్కూర్చున్నాడు. అతను కుర్చీమీద కూర్చుని తినడు. మిగతా వాళ్లు నేలమీద కూర్చుని తినరు. అంచేత సుభద్ర ఎవరి గదుల్లోకి వాళ్లకే టిఫిన్లు పంపించేయడం ఆరంభించింది. పంతులు టిఫిను తింటూ తింటూ అప్పటివరకు అడక్కుండా వదిలేసిన విషయాన్ని అప్పుడే గుర్తొచ్చి అడుగుతున్నట్టుగా కోడల్ని అడిగేడు-

"అన్నట్టు అమ్మాయ్... ఈ వీధిలో ఎవరెవరుంటున్నారు? మొత్తం ఎన్ని కుటుంబాలుంటున్నాయి? అందరికీ సొంత ఇళ్ళేనా లేక ఇందులో అద్దెకొంపలు కూడా వున్నాయా?"

సుభద్ర ఆప్రశ్న వినగానే కాస్త ఖంగుతింది. ఇరవైమూడేళ్ళుగా ఆ వీధిలో వుంటున్న నాలుగైదు ఇళ్లవారు తప్పితే ఓ పది ఇళ్లవారితో తప్ప మిగిలినవారితో పరిచయం లేదు. ఇంకొంతమందితో కాస్తోకూస్తో పరిచయాలున్నా ఎప్పుడైనా ఎదురు పడినప్పుడు చిన్నగా నవ్వుకోడమో, "నమస్కారమండీ" అనుకో





వడం మినహా వాళ్ల మిగతా వివరాలు తనకి తెలియవు. మొత్తం ఎన్ని ఇళ్లున్నాయో ఏనాడూ లెక్కపెట్టలేదు. అందుకే తనకి తెల్సిన నాలుగైదు ఇళ్లవారి గురించి చెప్పి, మిగతా వారి విషయాలు అంతగా తెలియవని చెప్పేసింది.

ముసలాళ్ళిద్దరూ సుభద్రని వింతగా చూసేరు. టెన్త్‌క్లాస్ చదివేవాడికి రెండో ఎక్కం రాకపోతే ఆ క్లాస్‌టీచరు ఆ విద్యార్థిని ఎంత సన్నాసిలా చూస్తాడో సుభద్రనీ అలాగే చూసేరు.

"వీధిలో ఎవరెవరుంటున్నారో తెల్సుకోకుండా మీరంతా ఇన్నాళ్ళూ ఏం చేస్తున్నారే?" అంటూ విసుక్కుంది కామేశ్వరమ్మ.

"మరీ పనిగట్టుకుని అందరి వివరాలూ తెల్సుకోవల్సినంతటి అవసరం పడలేదు అత్తగారూ" అంది సుభద్ర సంజాయిషీ చెప్తున్నట్టుగా.

"చూడమ్మా... మీరు రోజూ మూడు రూపాయలుపెట్టి దిన పత్రిక కొనుక్కుని మరీ ప్రపంచంలో ఎక్కడెక్కడ ఏం జరుగుతోందో తెల్సుకుంటున్నారు గదా- అలాంటిది మీ వీధిలోవాళ్ల గురించి తెల్సుకోవడంలో తప్పేంవుంది? మన చింతల అగ్రహారంలో ఎన్ని కొంపలున్నాయని అడుగు, ఠక్కుమని చెప్తాను. ఒక్కో కొంపలో ఎంతమందుంటున్నారు? వాళ్ల పేర్లేమిటి? వాళ్ళు తమ ఆడపిల్లల్ని ఏయేవూరు వాళ్లకిచ్చారు? వాళ్ల కొడుకులకి ఏవూరి సంబంధాలు చేశారని అడుగు- ఠకీఠకీమని చెప్తాను. ఊరు పెద్దదయ్యే కొద్దీ మనుషుల మధ్య సంబంధాలూ, పరిచయాలూ పల్చబడిపోతాయా? ఇదేం ముదనష్టపు నాగరికతే?" అంటూ నర్సింపంతులు ఇల్లు ఎగిరిపోయేలా కేకలువేసి, అప్పటికప్పుడు కామేశ్వరమ్మని తీసుకుని, వీధిలో వాళ్లని పరిచయం చేసుకోవడానికి బయలుదేరాడు.

"అలా ఇంటింటికీవెళ్లి అడిగితే బాగోదు మావయ్యగారు" అంటూ సుభద్ర గొణిగింది.

కానీ పంతులుగారామాటలు పట్టించుకోలేదు- "అడిగి తెల్సుకుంటే బాగోదా? ఎవరి గురించీ తెల్సుకోకుండా వుంటే బాగుంటుందేవిటి?" అంటూ చెప్పులు వేసుకుని బైటకి నడిచేడు.

ముసలాళ్ళిద్దరూ ముందుగా వీధి చివరికి వెళ్ళిపోయి, అక్కడ నించి ఒక్కొక్క యింటికీ వెళ్ళాలనుకున్నారు.

వారు మొదట వెళ్ళింది విలియమ్సు అనే లెక్చరర్ యింటికి. తలుపుకొట్టేరు. విలియమ్స్ భార్య మీనాక్షి తలుపుతీసింది.

తమని తాము పరిచయం చేస్కుకున్నాక, మీనాక్షి వారిద్దర్నీ లోపలకి తీసుకెళ్ళి కూర్చోమంది. కాలేజీకి బయలుదేరుతున్న విలియమ్సు వచ్చివారికి నమస్కరించేడు.

"నీ పేరు ఏవిట్రా అబ్బాయ్?" అన్నాడు పంతులు కాలు మీద కాలువేసుకుని వూపుతూ.

అలా ఒరేయ్ అన్నందుకు విలియమ్సు, మీనాక్షి క్షణంపాటు ఆశ్చర్యపోయినా ముసలాళ్ళకుండే వయసునిబట్టి వెంటనే తమాయించుకున్నాడు.

"నా పేరు విలియమ్సు. కాలేజీలో ఎకనమిక్స్ లెక్చరరుగా పనిచేస్తున్నానండి" అన్నాడు విలయమ్సు.

"నీపేరేవిటే అమ్మాయ్?" కామేశ్వరమ్మ అడిగింది.

"మీనాక్షి"

ముసలాళ్ళిద్దరూ ఆశ్చర్యంగా ఒకర్నొకరు చూసుకున్నారు. "విలియమ్సు అంటే మీరు కిరస్తానీవాళ్ళా?" పంతులు అడిగాడు.

"ఔనండి"

"మరి... మీనాక్షి అనే పేరు కూడా మీ కిరస్తానీవాళ్ళలో వుంటుందా?"

"ఉండదండి. మా ఆవిడ మీ బ్రాహ్మణుల అమ్మాయే. మాది లవ్ మేరేజ్‌లెండి. మేం ప్రేమించి పెళ్ళిచేసుకున్నాం. నేను లెక్చరర్‌గా జాయినయ్యేసరికి మీనాక్షి సెకండ్ ఇయర్ స్టూడెంటు"

విలియమ్సు మాటలు పూర్తికాకుండానే ముసలాళ్ళ ముఖాల్లో చిరాకు, కోపం కనిపించేయి.

"మీ ప్రేమా దోమా తీసి పక్కనపెట్టండి. ఒక్క మాటడగుతాను నిజం చెప్పండి. మీయి



ద్దరిదీ లేచివచ్చేసిన బాపతా?'' పంతులు నిర్మొహమాటంగా అడిగేసాడు.

''కాదండి''

''కాకపోతే ఈ వర్ణసంకరానికి... వర్ణ సంకరం ఏవిటి నా శ్రాద్ధం, యీ మత సంకరానికి బుద్ధీ, జ్ఞానం వున్న పెద్దవాళ్ళెవ్వరూ అంగీకరించరు''

పంతులుగారి కోపానికి మీనాక్షి రియాక్టయి జవాబు చెప్పబోయింది. కానీ విలియమ్సు ఆమెను చూపుల్తోనే కంట్రోల్ చేస్తూ వారికి జవాబు చెప్పేడు-





“వర్ణాలు, మతాలు మనిషి కల్పించుకున్నవే తప్ప మానవులందరిదీ ఒకే మతం అని నా వుద్దేశం. మేం పెద్దల్ని ఎదిరించి పెళ్ళిచేసుకోలేదండీ- వాళ్ళని ఒప్పించే పెళ్ళి చేస్కున్నాం” అంటూ అతని అమ్మగార్ని, అత్తగార్ని పిలిచి, వారిని పరిచయ్ం చేసేడు.

“మా అమ్మగారూ, మా అత్తగారు కూడా మాతోనే వుంటున్నారు. అదీ గత్యంతరంలేక వుండడంలేదండి. స్వచ్ఛందంగా యిష్టపడే మాతో కలిసివుంటున్నారు. మేం మా మతవ్యవస్థకి వ్యతిరేకులంకాదు. అలాగని మతాల కోసం మా మనసుల్ని, మనసులోని ప్రేమల్ని

చంపుకునో, మార్చుకునో బతకడానికి మేం యిష్టపడం. నేను ప్రతి ఆదివారం చర్చ్‌కి వెళ్తాను. మా మీనాక్షీ అక్కడకొస్తుంది. అలాగే ఆవిడెప్పుడైనా దేవాలయానికి వెళ్తే నేనూ వెళ్తాను. మేం చర్చిలోనైనా, దేవాలయంలోనైనా చూసేది దేవుడి విగ్రహాన్నికాదు- ఈ సృష్టికి కారణభూతమైన ఓ అతీతశక్తిని మేం చూస్తాం. ఆ శక్తికే నమస్కరిస్తాం. ఆ శక్తి పేరు జీసస్ అనండి, విష్ణుమూర్తనండి, మరొకరనండి మాకు అభ్యంతరంలేదు. ఎవరి యిష్టంవారిదే అయినట్టు, ఎవరి మతం వారిదికదండి. ఒకరి యిష్టాయిష్టాన్ని మరొకరి మీద బలవంతంగా రుద్దాలనుకోవడం మూర్ఖత్వం అవుతుంది. మన మతాలు మనల్ని మూర్ఖుల్ని చెయ్యకూడదు. అయినా కాలగమనంలో ఎన్నో మార్పులు వస్తున్నాయి కదండి. ఇంకా మనం కులం, మతం అంటూ వాటినే పట్టుకు వేళ్ళాడుతుంటే ప్రస్తుత ప్రపంచానికి పనికిరాకుండా పోతాం. వ్యక్తికుండే ప్రతిభకి విలువయివ్వాలి. ఇవాళ యీ ప్రపంచంలో రెండే రెండు వర్గాలున్నాయి తాతగారూ. ఒకటి డబ్బున్నవాళ్ళు, రెండు పేదవాళ్ళు. డబ్బున్నవాడు ఎంత హీన కులస్థుడైనా మనం గౌరవించడం మానేస్తున్నామా? డబ్బులేనివాడు ఎంత వున్నత కులస్థుడైనా గౌరవిస్తున్నామా చెప్పండి... ఈ తేడాలు యిలాగే వుండాలని నా అభిప్రాయం కాదుగాని యివి యీనాటి సమాజంలో స్పష్టంగా కనిపిస్తున్నాయని మాత్రమే చెప్తున్నాను''

విలియమ్స్ లెక్చరర్ కావడంవల్ల విద్యార్థులకి పాఠం బోధించినంత వివరంగా తన అభిప్రాయాన్ని వివరించేడు. అతని మాటలు ఆ ముసలాళ్ళకి నచ్చేయో లేదో తెలీదుగాని వాళ్ళిచ్చిన కాఫీని మాత్రం తాగకుండానే ఆ యింటినుంచి బైటపడ్డారు.

దారిలో మరేమీ వ్యాఖ్యానించకుండా రెండో యింటికివెళ్ళి తలుపుతట్టేరు.

ఆ ఇల్లు మంజుల అనే గవర్నమెంటు ఉద్యోగస్థురాలిది. పరిచయాలు అయేక తెల్సిన విషయం ఏవిటంటే, మంజుల ఆ వూర్లో పోర్టులో పనిచేస్తుంటే, ఆవిడ భర్త విజయనగరంలో పనిచేస్తున్నాడు.

''పెళ్లాం యిక్కడ, మొగుడు అక్కడా అయితే, ఇంక మీ కాపురం ఎలాసాగుతున్నట్టే?'' అంటూ కామేశ్వరమ్మ బోలెడంత ఆశ్చర్యపోతూ నోరు నొక్కుకుంది.

మంజుల లోలోపల కాస్త బాధపడుతూనే జవాబుచెప్పింది. ''ఏంచెయ్యమంటారు మామ్మగారూ! మాకూ కలిసి బ్రతకాలనేవుంది. కానీ, ఆయనకి విజయనగరంలో వుద్యోగం వచ్చింది. ప్రతి శనివారం సాయింత్రం వస్తారు. ఆదివారంవుండి సోమవారం వుదయాన్నే వెళ్ళిపోతారు. నేను వుద్యోగం మానేసి ఆయన దగ్గరకెళ్ళిపోకూడదా అని మీరనొచ్చు. కానీ, యివాళ యిద్దరం కలిసి సంపాదిస్తేతప్ప యీమాత్రం బతుకు బతకలేకపోతున్నాం. వంటచేసుకునే ఆడదానికి చదువెందుకనే అభిప్రాయాన్నించి, ఆడదానికి వుత్తరం రాసుకునే చదువొస్తే చాలనుకుని, మన అభిప్రాయాల్ని మనం సవరించుకుంటూ వచ్చేం. చివరికిప్పుడు చదువుకోడానికి ఆడ' ఏవిటి? మగ ఏవిటి? అనే స్థితికి ఎదిగేం. అలాగే వుద్యోగం పురుషలక్షణం అనే సామెతని, వుద్యోగం మనిషి లక్షణంఅని, యీనాటి పరిస్థితులు మార్చుచేశాయి. చదువుకున్న చదువుని సార్థకం చేస్కోడానికైతేనేం, మరింతబాగా జీవించడానికైతేనేం, నేనూ వుద్యోగం చేస్తున్నాను. ఒకేచోట వుండాలి, ఒకే జీతంతో బతకాలి అనుకుంటూ, చాలీచాలని జీతంతో తీరీతీరని కోరికల్తో రాజీపడి బతకడంకంటే, రెండు జీతాలు సంపాదిస్తూ, మేం సుఖంగాజీవిస్తూ, మాయిద్దరు పిల్లలకీ మంచిభవిష్యత్తు కలిగించడం మంచిదికదా''

మంజుల చెప్పిందంతా ముసలాళ్లు జాగ్రత్తగా విన్నారుతప్ప, మరేం వ్యాఖ్యానించకుండా బయటికి నడిచేరు.

మరో రెండుమూడు ఇళ్లల్లో దూరి పలకరించేరుగాని, అక్కడ వారికేమీ ప్రత్యేకతలు కనిపించలేదు. ఇంక యీరోజుకీ సర్వే చాలనుకుని, యింటికి వచ్చేస్తుండగా, ఓ యింటి ముందు, పది పదిహేనుమంది జనం గుంపుగా నిలబడ్డం కనిపించి ఆగేరు.

''ఏం జరిగిందిరా అబ్బాయ్?'' అన్నాడో




వ్యక్తితో.

"ఆ ఇంటి కోడలు ఆత్మహత్య చేసుకుంటోందండి"

"ఆత్మహత్యా? ఏంపోయేకాలం వచ్చిందట?"

"ఆవిడ పెళ్లిటైములో యిస్తానన్న కట్నం యింకా యివ్వలేదట. అత్తగారు ఆవిణ్ణి చిత్రహింసలు పెడుతుంటే భరించలేక....

ఇలాంటివి మామూలేనండి! రోజూ పేపర్లో చూస్తున్నాంగా"

పంతులుగారు ఆవేశపడుతూ, ఆ వ్యక్తి వీపుమీద రెండు చరుపులు చరిచేడు.

"నికృష్ఠపు వెధవా! ఓ ఆడపిల్ల చిత్రహింసలు భరించలేక ఆత్మహత్య చేసుకుంటుంటే, ఇలాంటివి మామూలే అంటూ చుట్టకాలుస్తూ చెప్తావురా" అంటూ గబగబా వెళ్లి ఆ ఇంటి తలుపుల మీద దబదబమంటూ కొట్టేడు. కామేశ్వరమ్మా తలుపులు బాదింది.

"తలుపులు తెరవండ్రా పింజారీవెధవల్లారా" అంటూ బిగ్గరగా అరిచేడు పంతులు.

తలుపులు తెరుచుకున్నాయి.

గుళ్లోని పోలేరమ్మ విగ్రహంలావుందా అత్తగారు. అమ్మవారికి బలియిచ్చే మేకపిల్లలా విలవిల్లాడిపోతోంది కోడలు. ఆమె ఒంటిమీద నించి కిర్సనాయిలు వాసన గుప్పుమంటూ వస్తోంది.

"నువ్వు బలవంతంగా చావాలనుకుంటే, ఏ నూతిలోనో, గోతిలోనో పడు, లేదంటే, మీ యింటికిపోయి చావు. అంతేగాని, నాయింట్లో చచ్చి, నన్ను పోలీసుల కప్పగించాలని చూసేవో నిన్ను కత్తికో కండకింద నరికేస్తాను జాగ్రత్త" అంటూ అత్తగారు ధాంధూం మంటుంటే, కామేశ్వరమ్మ ఆవిడ వీపుమీద దభీదభీమని రెండు దెబ్బలు కొట్టింది.

"ఏవే నాపసానీ! ఓ నిండుప్రాణం నీ కళ్ల ముందే బలైపోతుంటే, జాలిపడి ఆపడంమానేసి, వీధిలోకెళ్లి చావమని సలహాయిస్తావా?" అంటూ గఁయ్‌మని లేచింది కామేశ్వరమ్మ.

"ఏవిటమ్మోవ్! నాయింట్లోకొచ్చి నన్నే గదమాయిస్తున్నావ్? ఇంతకీ మీరెవరు?" అత్తగారు బిగ్గరగా అరిచేసరికి పంతులుగారు రెచ్చిపోయేరు.

"మేం ఎవరమా... లాయరు చలపతి మా అబ్బాయి- చాలా యీ పరిచయం" అంటూ కోడల్ని బుజ్జగిస్తూ ఆమె తరపు పెద్దలు ఎందుకు కట్నం ఇవ్వలేకపోయేరో అడిగి తెల్సుకున్నాడు. వివరాలు తెల్సుకున్నాక చిచ్చరపిడుగులా రెచ్చిపోయేడు పంతులు.

"ఇస్తానన్న కట్నం యివ్వకపోవడం తప్పే. అయితే మాత్రం మీ యింటి కోడల్నింత అమానుషంగా హింసిస్తావా? ఒకవేళ మీ పెద్దవాళ్ళే నీపెళ్ళి సమయంలో కట్నం యివ్వకపోతే మీ అత్తగారే నిన్ను యిలా హింసిస్తే నువ్వెంత బాధపడతావో ఆలోచించావా? నువ్విప్పుడు అత్త స్థానంలో కొచ్చేవు కానీ, నువ్వో ఒకప్పుడు కోడలిగానే మీ అత్తారింటికొచ్చిన సంగతి మర్చిపోయేవా?"

పంతులుగారు ఓ పక్క, కామేశ్వరమ్మ మరో పక్క చెడామడా చెరిగేసేసరికి అత్తగారి నోటికి తాళం పడింది. తిరగబడదామన్న ఆవేశం లోలోపలున్నా వాళ్ళిద్దరూ కొడతారేమోనన్న భయంతో ఆగిపోయింది. కోడలు పిల్లని లోపల గదిలోకి తీసుకెళ్ళి, స్నానం చేయించి బట్టలు మార్పించేక పంతులు అత్తా కోడళ్ళని పక్కపక్కన నిలబెట్టి చెప్పేడు.

"చూడండి... కట్నం అనేది యివ్వగలిగేవారికి సాంప్రదాయం అవుతుంది. ఇవ్వలేనివారికి అదో భయంకరమైన శాపం అవుతుంది. భరించలేని శిక్షవుతుంది. అమ్మాయ్... మీ అన్నయ్యతో నన్నోసారి కలవమని చెప్పు- ఈలోగా మీ అత్తయ్యేమైనా వికారాలు ప్రదర్శిస్తే మాతో చెప్పు"

వారిద్దరికి చెప్పేక పంతులు, కామేశ్వరమ్మ యింటి ముఖం పట్టేరు. పట్టణం వచ్చి ఓ మంచి పని చేయగలిగేం అన్న సంతోషం వారిద్దర్లోనూ కనిపించింది.

నాలుగు రోజులు గడిచేసరికి ఆ వీధిలోవాళ్లందర్ని పలకరించేశారు. వారి పేర్లు, వివరాలు ఓ కాగితం మీద రాసి కొడుక్కి అందించేడు పంతులు.

"ఎందుకు నాన్నా యీ లిస్టు?" అన్నాడు చలపతి చిన్నగా నవ్వుతూ.



"ఎందుకైనా పనికొస్తుంది. నీ టేబులు సొరుగులో పెడితే యిదేం అన్నమూ నీళ్ళు అడగదులే" అన్నాడు పంతులు కాగితాన్ని చలపతి జేబులో పెడుతూ.

ఆ వారంలోనే జనరల్ ఎలక్షన్లు జరగబో తున్నాయి.

ఆరోజు వుదయం వేళ రామకృష్ణయ్యగా రనే దేశభక్తుడు, ప్రజాసేవకుడు, నలుగురైదు రు మనుషుల్ని మాత్రం వెంటబెట్టుకుని కేన్వా సింగ్ కోసం ఆ యింటికొచ్చేడు.

అతన్ని స్వాతంత్ర్య సమరయోధుడిగా, గాంధీగారి సహచరుడిగా, నిజమైన దేశభక్తు డిగా చలపతి తన తండ్రికి పరిచయం చేసే డు. అతనిపట్ల పంతులుగారికి చాలా గౌరవం కలిగింది.

"మా ఓట్లన్నీ మీకే వేస్తామండి" అన్నాడు చలపతి సిన్సియర్‌గా, పంతులు కూడా రామ కృష్ణయ్యగారికి నమస్కరిస్తూ అన్నాడు.

"నాకూ, వీళ్ళమ్మకీ యీ వూళ్ళో ఓట్లు లేవు. చింతలఅగ్రహారంలో వున్నాయి. వాటిని యిక్కడికి తెప్పించే ఏర్పాటు చేస్తే మా రెండు ఓట్లూ మీకే వేసేస్తాం"

రామకృష్ణయ్య చిన్నగా నవ్వి "ఒకవూరి ఓట్లు మరో వూరికి తీసుకొచ్చే ఏర్పాటు ఏదీ లేదండి. ఏమైనా మీ అభిమానానికి కృతజ్ఞు ణ్ణి" అంటూ వెళ్ళిపోయేడు.

మధ్యాహ్నం ఆనందరావు మరో కేండిడే టుతో వచ్చేడు. అతని వెనక ఓ వందమందిదా కా మద్దతుదార్లున్నారు. అతను రెండు నిమిషా లు మాట్లాడగానే అతనికి పదవీ కాంక్ష తప్ప మరేవీలేదన్న విషయం అర్థమైపోయింది.

ఆనందరావు వచ్చేసరికి చలపతిరావు నిద్ర పోతున్నాడు.. ఆ సమయానికి నర్సింపంతులు బయట వరండాలోనే వుండడంతో అతను చాలా యిరకాటంలో పడ్డాడు.

"ఏం నాయినా... నువ్వూ ప్రజా సేవ చెయ్య డానికే ఎలక్షన్లో నిలబడుతున్నావూ?" అన్నాడు పంతులు పుల్లతో పళ్ళు కుట్టుకుంటూ.

తమ నాయకుణ్ణి అలా అన్నందుకు ఆ బృందంలోని చాలామందికి కోపం వచ్చింది. కానీ ఆనందరావు పకపకమని నవ్వేశాడు.

"మన అపోజిషన్ పార్టీ వాళ్ళు అమ్మా, ఆలీ అంటూ బూతులు తిట్టినప్పుడే నేను పట్టించు కోలేదు. అట్టాంటిది యీయన మన లాయరు గారి తండ్రి- అంటే నాకు తండ్రిలాటోళ్ళేగదా! ఈయన కోప్పడితే తప్పొచ్చిందేటి?" అన్నాడు.

పంతులుగారు ఆ మాటలకి రవంత కూడా సంతోషించకుండా మరో ప్రశ్న వేసేరు.

"ప్రజానాయకుడిగా నిలబడుతున్నావు గదా! అందుకు నీకున్న అర్హతలేమిటి?"

"మీరు వూరికి కొత్తగదా తాతగారూ! అంచేత నా అర్హతలేమిటో మీకు తెలీకపోవ డంలో సిత్రం ఏవీ లేదండి. ఆంధ్రా మొ త్తంమ్మీద మనకి నాలుగు సారాఫేక్టరీలున్నా యండి".

ఆనందరావు నవ్వుతూ తన అర్హతలు చె ప్పేసరికి పంతులుగారు చర్రుమంటూ లేచే రు.

"నేను అడుగుతున్నది నీకెన్ని సారాఫేక్టరీ లున్నాయి? అందులో నువ్వెంత సారా తాగుతా వని కాదు? స్వతంత్రపోరాటం, అలాంటి వాటి ల్లో ఎప్పుడైనా పాల్గొన్నావా అని"

"లేదండి... ఎంచేతంటే స్వాతంత్ర పోరా టంలో పాల్గొందారీ పాల్గొందారీ అనుకుంటున్నా ను. ఇంతలో సాతంత్రం వచ్చేసిందండీ"

"పోనీ- ప్రత్యేక ఆంధ్రరాష్ట్రంకోసం నువ్వే మైనా కృషిచేసావా?"

"ఆంధ్రరాష్ట్రంకోసం నిరాహారదీక్షకి కూర్చుందారీ కూర్చుందారీ అనుకుంటుండ గానే అల్లక్కడెక్కడో పొట్టి శ్రీరాములు కూకుండిపోయేడు. ఒక్క చాప మీద యిద్దరం ఎలా కూకుంటాంలే అని నేను మానేసానండి"

ఆనందరావు సమాధానాలు అయితే చెప్త న్నాడుగాని పరిస్థితిమాత్రం అతనికి దుర్భ రంగా వుంది. వెళ్లిపోదాం అనుకుంటే పంతు లుగారు వెళ్లనివ్వకుండా ప్రశ్నమీద ప్రశ్న అడిగేస్తున్నారు.

"అయితే దేశంకోసం నువ్వేం త్యాగాలు చెయ్యలేదన్నమాట" పంతులుగారు మళ్లీ ప్ర శ్నించేరు.

"చెయ్యకేవండి బాబూ... నేను చేసిన త్యా





మెరిసే మీపళ్ళ రహస్యం ఒక్కరికే
మాత్రమే తెలుసు జెమిని పళ్ళపొడి












**జెమిని** పళ్ళపొడి

పళ్ళకు తెలుపుదనం–చిగుళ్ళకు గట్టిదనం.

OTS/89

జెమిని కెమికల్ ప్రొడక్ట్స్ (ఫర్మ్) పోస్ట్ బాక్స్ నం. 7, మచిలీపట్నం-521 001. ఆం.ప్ర. (ఇండియా)



మీ సస్యాలకు రక్షణ... అన్నదాత

మీ పశుపోషణలో శ్రీరామరక్ష... అన్నదాత

మీ ఆర్థిక స్థోమతకు పునాది... అన్నదాత

మీ పంటలకు జవం జీవం... అన్నదాత

చీడపీడలపై బ్రహ్మాస్త్రం... అన్నదాత

రైతులకు, సంస్థలకు వారధి... అన్నదాత

గాలు ఒకటా రెండా? ఈ మద్దిన యిట్టాటి ప్రెశ్నలు ప్రెతివాడూ నిలబెట్టి అడిగేస్తన్నాడనే నేను చేసిన త్యాగాలన్నీ కలిపి ఓ లిస్టు కింద పేపరు కొట్టించేశాను'' అంటూ తన అనుచరుణ్ణి పిల్చి అతని చేతిలోని పేంప్లెట్స్‌లోనించి ఒకటి తీసి పంతులుగారికి అందించేడు.

పంతులు ఆ పేపర్ని అతని ముందే నలిపి దూరంగా పారేశాడు. తర్వాత మరికొన్ని ప్రశ్నలు అడిగేడు. ''మన దేశానికి స్వతంత్రం ఎప్పుడు వచ్చింది? మన జాతీయ పతాకాన్ని రూపొందించిన తెలుగువ్యక్తి పేరేవిటి? ఆంధ్ర రాష్ట్రం ఎప్పుడు అవతరించింది?''- ఇలాంటి ప్రశ్నలు ఓ యిరవైదాకా వేశాడు. ఆనందరావు ఒక్కదానికీ సరైన జవాబు చెప్పలేకపోయేడు.

''దేశం గురించి, రాష్ట్రం గురించి ఏ ఒక్క విషయమూ తెలియనివాడివి నువ్వు ఎమ్మెల్యే పదవికి పోటీ చేస్తున్నావా?'' అంటూ పంతులుగారు విరుచుకుపడుతున్నప్పుడే చలపతిరావు నిద్రలేచి వచ్చేడు. జరిగింది తెల్సుకుని ఆనందరావుకి క్షమాపణ చెప్పేడు.

''మా ఓట్లన్నీ మీకేనండి... మీరు ప్రత్యేకంగా యింటికొచ్చి అడగాలా?'' అంటూ గేటు వరకూ వెళ్లి సాగనంపేడు.

ఆనందరావు వెళ్లే ముందు- కాస్త గొంతు తగ్గించి చలపతిని అడిగేడు.

''మీ నాన్నగారు యీవారంరోజులూ యిక్కడే వుంటారా?''

''ఏం సార్?''

''మరేం లేదు... ఆయనకి కాస్త చాదస్తం ఎక్కువలాగుంది. నా గురించి ఇంటింటికి వెళ్లి నాకు ఓట్లు వెయ్యొద్దని ప్రచారం చేస్తాడేమోనని భయంగా వుంది. ఒకవేళ యీవారమంతా యిక్కడే వుంటే ఎలక్షనయ్యేదాకా ఆయన యిల్లు కదలకుండా చూడండి లేదా మీ వూరికి పంపించేసి ఎలక్షనయ్యేక మళ్లీ తీసుకురండి''

అతని భయానికి చలపతి లోలోపల నవ్వుకున్నా పైకి మాత్రం వినయం ప్రదర్శిస్తూ ''అలాంటి ప్రమాదమేం జరగదులెండి'' అని భరోసా యిచ్చి పంపించేశాడు. అతను వెళ్లేక తండ్రీకొడుకుల మధ్య చిన్నసైజు ఘర్షణ జరిగింది.

''ఒకవైపు దేశభక్తుడు రామకృష్ణయ్యకి ఓట్లు వేస్తానని మాటిచ్చేవు; మరోవైపు యీ ఆనందరావుకి ఓట్లు వేస్తానంటున్నావు. వీడిదగ్గర నీకంత మొహమాటం దేనికి? నీలాంటి వెధవకి ఓట్లు వెయ్యనుపోరా అని ఖచ్చితంగా చెప్పొచ్చుగా''- ఇదీ తండ్రి వాదన.

''వచ్చినవాళ్లందరికీ ఓట్లు వేస్తాననడం లౌక్యం అనిపించుకుంటుంది; మనకి నచ్చినవాడికే ఓటువెయ్యడం మనకుండే హక్కు అనిపించుకుంటుంది. నిజానికి నాకా రామకృష్ణయ్యగారి పట్ల చాలా భక్తీ గౌరవం వున్నాయి. **అయినా నేను ఆనందరావుగారికే ఓటు వెయ్యాలి. ఎందుకంటే ఆయనకి** నేను లీగల్ **ఎడ్వయిజర్ని. అతనికి** ఓటువెయ్యడం నా నైతికధర్మం''- యిది కొడుకు యిచ్చిన సంజాయిషీ.

కొడుకు చెప్పిన లౌక్యం, నైతికధర్మం తండ్రికి ఎంతమాత్రం నచ్చలేదు.



డాన్స్‌స్కూలు దగ్గర సుజాత, రవీంద్ర రోజూ కలుస్తున్నా పెళ్లివిషయం యిద్దర్లో ఎవరూ ఎత్తలేదు. రోజూ సాధన చేస్తున్నట్టే యిద్దరూ ఓ గంటసేపు సాధనచేసి ఎవరిదారినవారు వెళ్లిపోతున్నారు.

నర్సింపంతులుగారికి సుజాత డాన్స్‌ప్రోగ్రామ్సు యిచ్చే విషయం తెలియకూడదని ఎంత జాగ్రత్తపడినా తెలిసిపోయింది.

ఆరోజు చలపతి కోర్టుకెళ్లిపోయినా, అతని గుమస్తాకి ఆఫీసులోనే వేరేపని వుండడంవల్ల అక్కడే వుండిపోయేడు. పంతులుగారు కూడా





ఆఫీసులోనే కూర్చుని 'చందమామ' చదువుతున్నారు. అప్పుడే పోస్టుమాన్ వచ్చి ఓ పది పదిహేను వుత్తరాలు యిచ్చి వెళ్లిపోయేడు.

ఆ కవర్లలో ఒకదానిమీద ఓ నర్తకి రేఖాచిత్రం, మరోవైణికుడి రేఖాచిత్రం ఆకర్షణీయంగా కనిపించాయి.

"ఈ బొమ్మలు బాగున్నాయ్... ఎక్కడనించి వచ్చాయ్?" అడిగాడు పంతులు.

గుమస్తా ఆ కవరు చూసి- "ఇది విజయవాడనుంచి మీ మనవరాలిగార్కి వచ్చిందండి" అన్నాడు.

పంతులు కవరు విప్పేడు. అందులో కొన్ని ఫొటోలు, రెండు పేపర్ కటింగ్స్ కనిపంచాయి. అవి సుజాత ఇచ్చిన డాన్స్ ప్రోగ్రామ్ తాలూకు ఫొటోలే.

అంతే... పంతులుగారు పరశురాముల్లా హూంకరిస్తూ లోపల కెళ్లాడు. కోడల్ని, మనవరాల్ని పిలిచేడు.

"ఇలాంటి పనులు మన వంశంలో ఎప్పుడైనా జరిగేయా? మన ఆచారాన్ని, కట్టుబాట్లనీ ఎందుకింత భ్రష్టు పట్టిస్తున్నారు?" అంటూ రంకెలు వేశాడు. కామేశ్వరమ్మ అతన్ని మించిపోయింది.

వారికి ఈ విషయం తెలియకుండా జాగ్రత్త పడ్డాంకదా అనుకున్నారు తప్ప, అతనీ విషయం గురించి నిలదీసి అడిగినప్పుడు ఏం చెప్పాలో ఆలోచించలేదు వారెవరూ.

సాయంత్రం చలపతి కోర్టునించి వచ్చాక గాని యింట్లో మొదలైన గాలివాన తగ్గుముఖం పట్టలేదు. కొడుకు వచ్చీరాగానే మున లాళ్ళిద్దరూ ప్రశ్నల్తో దులిపేశారు. కానీ చలపతి చాలా నిబ్బరంగా, నిదానంగా జవాబు చెప్పేడు.

"ఇలాంటి లలిత కళలు మునుపెన్నడూ మనవంశంలో లేవుకదాని, యిప్పుడు కూడా వుండకూడదని రూలుందా? పైగా యీ కళలు రమ్మంటే వచ్చేవి కావు నాన్నా! పూర్వజన్మ సుకృతం కొద్దీ అబ్బుతాయి. వాటిని స్వయంకృషితో సాధన చెయ్యడంవల్ల రాణిస్తాయి. మనకంటే గొప్పగొప్ప వంశాల్లోనుంచి వచ్చినవాళ్లు కూడా ఈ కళల్ని సాధనచేసి కళాకారులుగా రాణిస్తున్నారు. ఎందరికో ఆనందం కలిగించి, వాళ్లూ ఆత్మానందం పొందుతున్నారు. నీ మనవరాలు, ఒక నర్తకిగా యింతరాణిస్తున్నందుకు మనందరం గర్వపడాలితప్ప, బాధపడ్డం మూర్ఖత్వమనిపించుకుంటుంది.

ఇంక, విధవరాలైన ఆడపిల్ల పబ్లిగ్గా డేన్సు ప్రోగ్రాములు యివ్వడం, నువ్వు అనుకున్నట్టుగా బరితెగించడం అవదు నాన్నా! అమ్మాయికి వైధవ్యం కలగడం కేవలం దాని వ్యక్తిగత విషయం. మనవరకూ కుటుంబ విషయం అవుతుంది. కానీ, కళారాధన కూడా ఓ పవిత్రమైన దేవతార్చనలాంటిదే! అందరికీ సంక్రమించిన విద్య, ఏకొద్దిమందికో దక్కినప్పుడు, తమ వ్యక్తిగతమైన యిబ్బందులకోసం ఆ కళనెందుకు వదిలెయ్యాలి? అదీకాక చిన్న వయసులోనే దాని పసుపూ కుంకాలు చెరిగిపోయినప్పుడు దాని కన్నీరు తుడిచి, దానికి మనోధైర్యాన్నిచ్చింది మేంకాదు నాన్నా! దాని కళారాధనే దాన్ని ఓదార్చింది, ధైర్యాన్నిచ్చింది, మనిషిగా నీ ఆవేదననీకున్నాకళాకారిణిగా నువ్వు పదికాలాలపాటు పచ్చగా వర్ధిల్లాలని బోధించిందికూడా ఆ నాట్యకళే. విధవరాలు, యింటిచాకిరీ తప్ప మరే పనీ చెయ్యకూడదనే సిద్ధాంతానికి బూజు పట్టేసి చాన్నాళ్లైంది. మారుతున్నకాలంతోపాటు మనమూ మారకపోతే, ఈ సమాజంనించి, మనల్ని మనమే బహిష్కరించుకున్నట్టవుతుంది"

చలపతిరావు హృదయాంతరాల్లోనించి ఓ కళాభిమాని, ఓ కన్నతండ్రి వెలుపలకొచ్చి సూటిగా, ధాటిగా ఆవేశంగా మాట్లాడుతున్నాడు. అలా కాసేపు ఏకబిగిని కూతుర్ని, ఆమె ఆరాధిస్తున్న కళనీ సమర్థిస్తూ మాట్లాడేక, ఆ ఇంట్లోని వుధృతం కాస్త తగ్గినట్టనిపించింది.

నర్సింపంతులు కొడుకుతో ఆ తర్వాత వాదించలేదుగాని, కొడుకు చెప్పిందానితో రాజీపడలేదు. ఆ రాత్రి అలిగి భోజనం చెయ్యలేదు. అతను తిననప్పుడు నేను మాత్రం తింటానా? అని కామేశ్వరమ్మ ఓ ముద్ద ముట్టలేదు. పంతులు దుప్పటీ, దిండూ తీస్కొని మేడమీదకెళ్ళి డాబా మీద పడుకున్నాడు. చలపతిగాని, సుభద్రగాని, వార్ని ప్రాధేయపడలేదు. అందరూ గంభీరంగా, మౌనంగా వుండి

పోయారు.

ఆ రాత్రి సుజాతకి నిద్రపట్టలేదు. నాట్యం సంగతి తెలిస్తే తన తాతగారు ఎంతగా గుండెలు బాదుకుంటారో ఇప్పుడు పూర్తిగా అర్థమైంది.

అలాంటి సనాతనుడు విధవా వివాహానికి ఒప్పుకుంటాడా?

ఇదే ప్రశ్న ఆమెకు నిద్రని దూరంచేసింది.

★ ★ ★

తెల్లవారుతూనే కామేశ్వరమ్మ ఏడుపు లంకించుకుంది. నర్సింపంతులు కనబడ్డంలేదు. మేడమీద వేసిన దుప్పటీ, దిండూ అలాగే వున్నాయిగాని మనిషిమాత్రం కనబడలేదు. అతను వేసుకునే చెప్పులూ గుమ్మంలో లేవు.

నిన్న సాయంకాలం జరిగిన ఘర్షణకి కోప్పడి ముసలాడు ఏ అఘాయిత్యం చేసుకోడానికి యింట్లోనించి వెళ్ళిపోయాడోనని కామేశ్వరమ్మ యిల్లు ఎగిరిపోయేలా కేకలు వేస్తూ ఏడవసాగింది. ఆమెను ఓదార్చడం ఎవరివల్లా కాలేదు. గత్యంతరంలేక ఆవిడకి సాయంగా సుభద్రని, సుజాతనీ యింట్లో వుంచి మిగతావారంతా పంతులుగార్ని వెదకడానికి బయలుదేరారు. చలపతిరావు, భారతి కారుమీద; శంకరానంద్, అతని భార్య స్కూటరుమీద బయలుదేరారు. వుదయం ఆరుగంటల్నించి పదిగంటలవరకూ వెదికినచోట వెదక్కుండా అన్ని ముఖ్యమైన స్థలాలూ వెదికినా అతని జాడ కనిపించలేదు. ఇంక పోలీస్ కంప్లయింట్ ఇవ్వడం తప్ప మరో మార్గంలేదనుకుంటూ అందరూ ఇంటికి చేరుకున్నారు. కానీ అక్కడ కనిపించిన దృశ్యాన్ని చూసి ఎవరికి వారే అవాక్కై నిలబడిపోయేరు.

నర్సింపంతులు నేలమీద కూర్చుని వుప్మా తింటున్నాడు. కామేశ్వరమ్మ నవ్వుతూ వడ్డిస్తోంది. గుమ్మంలో నిలబడిపోయినవాళ్ళని చూసి పంతులుగారే లోపలకి రమ్మని పిల్చి చీవాట్లు పెట్టేడు.

"మీరింతింత చదువులు చదువుకున్నారుగాని ఒక్కరికీ బుద్ధిజ్ఞానం తగలడలేదురా! నేను మేడమీద పడుకుంటే ఓ దిక్కుమాలిన బల్లి నా కుడిభుజంమీద పడింది. ఆ బల్లిపాటుకి ఫలితం ఏవిటో తెల్సుకోడానికి బల్లిశాస్త్రాన్ని అగ్రహారంలో వదిలేసి వచ్చాను. ఈ వీధి చివర ఎవరో సిద్ధాంతి వున్నాడంటేనూ వుదయాన్నే అక్కడికెళ్ళి ఫలితం తెల్సుకుని అట్నుంచి అటే సముద్రానికెళ్ళి స్నానంచేసి, సూర్య నమస్కారం చేసి యిప్పుడే వచ్చాను. ఈ మాత్రం దానికి మీరంతా కంగారుపడిపోయారు. గబగబా స్నానాలు ముగించి ఫలహారాలు కానివ్వండి" అంటూ మళ్ళీ వుప్మా తినడంలో నిమగ్నమైపోయేడు. ఆ క్షణంలో అతను తమ అంచనాలకు అందని ఓ విచిత్రమైన చాదస్తుడిలా అందరికీ కనిపించేడు. ఏమైతేనేం రాత్రి జరిగిన ఘర్షణకి అతను ఏ అఘాయిత్యమూ తలపెట్టనందుకు అందరి మనసులూ తేలికపడ్డాయి.

ఆరోజు ఎలక్షన్ జరిగేరోజు.

ప్రజాస్వామ్యంలో ఎన్నికలు ఎలా జరుగుతాయో, ఓటరు చేతిలోని ఓటు ఎంత శక్తివంతమైందో పాలిస్తున్న ప్రభుత్వాన్ని కూలదోసి, కొత్త పార్టీని ఎలా గద్దె ఎక్కించగలదో చలపతిరావు ఆ వుదయాన్నే తండ్రికి వివరించేడు.

ఒక్కోసారి ఓటర్లు యిచ్చే తీర్పు, రాజకీయ మేధావుల అంచనాలని ఎలా తలకిందులు చేసి తిమ్మినిబమ్మిని, బమ్మినితిమ్మిని చేయగలదో కొడుకుద్వారా తెలుసుకున్నాక ఓటింగు ఎలా జరుగుతుందో చూడాలనిపించిందాయనకు.

"మేమందరం ఓట్లు వేయడానికి ఎలాగూ వెళ్ళాలిగా. నువ్వూ మాతోపాటు వచ్చి పోలింగ్ బూత్ బయట నిలబడి కాస్సేపు చూడు" అన్నాడు చలపతిరావు.

కానీ పంతులుగారు ఒప్పుకోలేదు. "ఈ ప్రాంతంలో ఆరో ఏడో బూత్‌లున్నాయని చెప్పేనుగా- నేను నిదానంగా ఒక్కో బూత్‌దగ్గరకెళ్ళి తాపీగా చూసొస్తాను" అంటూ కామేశ్వరమ్మని కూడా రమ్మన్నాడు. ఆమె రానంది. టిఫిను చేసేక అతనొక్కడే బయలుదేరేడు.

రికార్డుస్థాయిలో రిగ్గింగ్‌తో సహా మిగతా అరాచకాలన్నీ ఆ ఎలక్షన్లోనూ జరిగేయి కాబట్టి ప్రస్తుత ప్రజాస్వామ్యం ఎలా వుందో తెల్సుకోడానికి నర్సింపంతులుకి మంచి అవకాశమే దొరికింది. ఓట్లు వేయడం గురించి పంతులుగారి




కి బొత్తిగా తెలీకపోలేదు. చింతలఅగ్రహారానికి ఆనుకుని వున్న వెంకటాపాలెంలో రెండు ఎలక్షన్సుకి నడుచుకుంటూ వెళ్లి మరీ ఓటు వేశాడు. కాకపోతే కాలంతోపాటు అన్నీ మారిపోతున్నాయని తన కొడుకు ప్రతి విషయంలోనూ వాదిస్తున్నాడు కాబట్టి, పట్నాల్లో జరిగే ఎలక్షన్సులో ఎలాంటి మార్పులొచ్చేయో కళ్లారా చూడాలనే కుతూహలంతోనే బయలుదేరాడు.

ఓ పోలింగ్ బూత్ దగ్గరకి వెళ్లేసరికి అక్కడ అన్ని పార్టీల కార్యకర్తలూ మహా హడావిడిగా తిరుగుతున్నారు. ఓటర్లని కారుల్లో, ఆటో రిక్షాల్లో, రిక్షాల్లో తెస్తున్నారు.

అక్కడున్న కార్యకర్తల్లో ఎక్కువమంది ఆనందరావు పార్టీ మనుమలుగానే కనిపిస్తున్నారు. వాళ్ళలో చాలామంది తప్పతాగిఉన్నట్లు స్పష్టంగా తెలుస్తోంది. ఓట్లు వెయ్యడానికి వెళ్తున్నవారికి అందరూ చూస్తుండగానే డబ్బు పంచుతున్నారు. వాళ్ళ శిబిరానికి కాస్త దూరంగా, రెండు టేబుల్స్‌మీద కొన్నివందల సారాపేకెట్లు కనిపిస్తున్నాయి. వాటిమీదకి అలగాజనం చాలామంది ఎగబడి మరీ పేకెట్లు అందుకుని తాగుతూ, తాగినమైకంలో డాన్సులుచేస్తూ ఆనందరావుకి జైకొడుతున్నారు.

ముప్ఫయి ఏళ్ళక్రితం వెంకటాపల్లిలో తను ఓటువెయ్యడానికి వెళ్ళినప్పుడు ఇలాంటి అసహ్యకరమైన దృశ్యాలేవీ కనిపించలేదు. అప్పుడు కూడా ఓటర్లకి సారా పోయించడం, డబ్బు ఇచ్చి ఓట్లు వేయించడం జరిగిందని చూచాయిగా విన్నాడేగాని, మరీ ఇంత బరితెగించి, పబ్లిగ్గా ఆ పనులు జరగలేదు. రామకృష్ణయ్య పార్టీవాళ్ళ శిబిరందగ్గరకెళ్ళేడు. అక్కడ ఇద్దరు మధ్యవయస్కులు ఓటర్లలిస్టులు పట్టుకుని కూర్చున్నారు. మూడోమనిషి ఎవరూ కనిపించలేదు.

"మీ రామకృష్ణయ్యగారి పరిస్థితి ఎలా వుంది? ఓట్లు బాగా పడుతున్నాయ్యా?" అని ఒకర్ని అడిగేడు.

"ఎలా పడతాయండి? పరిస్థితి ఏమిటో చూస్తున్నారుగా! ఆనందరావు డబ్బు, సారా అంత విచ్చలవిడిగా వెదజల్లుతోంటే, ఇంక ఈ రామకృష్ణయ్యలు ఎలాగెలుస్తారండి?" ఆ కార్యకర్త దుఃఖంతోనే జవాబు చెప్పేడు.

"ఇంత బాహాటంగా అవినీతి జరుగుతున్నప్పుడు, ఇక్కడ పోలీసులున్నారుగా వాళ్ళకి చెప్పి ఎందుకీ అవినీతిని ఆపుచేయించర్రా వెధవల్లారా" పంతులుగారు ఆవేశంగా కుతకుతలాడిపోతూనే అరిచేడు.

"మమ్మల్నికాదండి, ఆ పోలీసుల్ని తిట్టండి. వాళ్ళజేబులు వెదికిచూడండి ఆనందరావు ఇచ్చిన డబ్బుతో నిండిపోయి కనిపిస్తాయి. సాయంకాలం అయేసరికి ఒక్కో ఇన్‌స్పెక్టరు ఇంటికీ ఒక్కో బ్రేందీబోటిల్లో, విస్కీబోటిల్లో వెళ్ళిపోతుంది. ఇంక వాళ్ళేం అవినీతిని కంట్రోల్‌చేస్తారు" ఒకాయన ఆవేశపడ్డాడు.

"ఇప్పుడు జరిగే పోటీ ఆనందరావుకి, రామకృష్ణయ్యగారికీ కాదు తాతగారూ! సుబ్బయ్యలింగం అని మరో కేండేటున్నాడుగదా"

"నాకు తెలేదు... మా అబ్బాయిగారింటికి ఆ సుబ్బయ్యలింగం రాలేదు"

"మీ అబ్బాయి ఎవరు?"

"లాయరు చలపతిరావు"

"అలాంటివాళ్ళ ఇంటికి వెళ్ళడులెండి. వాడిచరిత్ర తెల్సిన ఏ విద్యావంతుడూ వాడికి ఓటు వెయ్యడని వాడికి బాగా తెలుసు. అందుకే లేబర్‌జనాన్ని తనపక్క తిప్పుకుంటున్నాడు. పైగా ఈ ఏరియా అంతట్లోనూ వాడికే ఎక్కువ ఓట్లు పడతాయి"

"మరీ తాగుబోతులంతా ఆనందరావుకి జైకొడుతున్నారే?" కార్యకర్తలిద్దరూ పంతులుగార్ని లోకం తెలియని పసివాడిలా చూసి చిన్నగా నవ్వేరు.

ప్రజానీకం జేజేలు పలకడానికి, ఓట్లు పడ్డానికి ఏమీ సంబంధంలేదండి. ఎవడు మీటింగు పెట్టినా జనం వెళ్తారు. మా మీటింగుకి జనం బాగా వచ్చేరుకదాని, మేమే గెలుస్తాం అనుకునేటంత బుద్ధిపొరపాటు మరొకటి వుండదండి. పైగా వీళ్ళు తాగేసి, ఆనందరావుకి జైకొడుతున్నారు. ఇలాంటి సారా స్టాల్ సుబ్బయ్యలింగం పక్కవీధిలో పెట్టేడు. సారా పొట్లాలతో పాటు కబాబ్స్, జంతికలు గూడా తాగుబోతులకి సప్లయిచేయిస్తున్నాడు. అక్కడ తాగి, వాడికి జై కొట్టి, ఇక్కడకొచ్చి తాగి, వీడికి

జైకొడుతున్నారు''

వాళ్ళు చెప్తున్నది పంతులుగారికేం అంతు బట్టడంలేదు. సుబ్బయ్యాలింగం, ఆనందరావు ఇద్దరూ వెధవల్లాగే కనబడుతున్నారు. వాళ్ళిద్దరి మధ్యా పోటీయా? అందులో ఒకడు గెలుస్తాడా?

అతని ఆలోచనలు ఓ కొలిక్కి రాకముందే, ఓ వేన్ వచ్చి ఆగింది. అందులోనించి పది మంది భారీగా వున్న మనుషులు దిగి లోపలకి నడిచేరు.

''వాళ్ళెవరు?''

''గూండాలండి... అందుకే పోలీసులు ఏమీ ఎరగనట్టు పక్కకి తప్పుకుంటున్నారు చూడండి''

పంతులుగారు రెండు అడుగులు ముందుకువేసి మరీ గమనించేడు. గూండాల్ని పోలీసులు అడ్డగించకపోగా, ఏదోపనివున్నట్టుగా తలా ఓవైపు జారుకుంటున్నారు.

''వాళ్లు ఎవరి తరపు గూండాలు?'' పంతులుగారు మళ్లీ కార్యకర్తల దగ్గరకొచ్చి అడిగేడు.

''ఆ వేన్‌కి తగిలించిన బోర్డులు చూడండి. వాళ్లు ఆనందరావు పంపిన గూండాలు''

అంతలో పోలింగ్ బూత్‌నుంచి కేకలు, హాహాకారాలు వినిపించేయి. క్యూలో నిలబడ్డ ఓటర్లంతా ఒక్కమూకగా బయటికి పరుగెత్తుకొచ్చేరు.

''ఏం జరిగిందట?'' పరుగు పరుగున వస్తున్న ఓ ఆడమనిషిని పంతులుగారు ఆపి, అడిగేరు.

''ఆ దొంగ నచ్చినోళ్లు వచ్చి- మీరేం శ్రమపడి ఓట్లు వెయ్యక్కర్లేదూ, మీ తరపున మేమే వేసిపెడతాం, మీరంతా యింటికి పోండీ- అన్నారండి. అలా జరగడానికి వీల్లేదని ఎవరో మగాయన ఎదిరిస్తే కర్రల్తో గొడ్డుని బాదినట్టు బాదేశారు బాబూ'' ఆ మాట చెప్పేసి ఆవిడ పారిపోయింది.

పంతులుగారికి రక్తం వేడెక్కింది. గబగబా అక్కడున్న పోలీసు కానిస్టేబులు దగ్గరకెళ్లి ''ఏవిట్రా... యీ దారుణం? ఇదేనా ప్రజాస్వామ్యం?'' ఆవేశంగా అడిగేడు.

ఆ కానిస్టేబుల్ అప్పటికే ఏ కారణంవల్లో మహా చిరాగ్గా వున్నాడు. ''ప్రజాస్వామ్యమూ లేదు, గాడిదగుడ్డూలేదు. ఈ ఎలక్షన్లో ఏ పార్టీ గెలుస్తాదో తెలీదు. గెల్చిన పార్టీలవల్ల మా వుజ్జోగాలు ఎలా తగలడతాయో తెలీదు. మద్దిన మీ గోల ఏటండి... ఎల్లండెల్లండి'' అన్నాడు.

పంతులుగారు మరోమాట అనేలోగా మరో వైపు నుంచి మరో వేన్ వచ్చింది. అందులో నుంచి పన్నెండుమంది గూండాలు గబగబా దిగేరు. వాళ్ల చేతుల్లో కర్రలు, సైకిల్ చైన్లు వున్నాయి.

''సుబ్బయ్యాలింగం గారి మనుషులొచ్చేశారు. పెద్దోళ్లు మీరిక్కడ వుండకండి'' అంటూ కానిస్టేబుల్ గబగబా మరోవైపు వెళ్ళిపోయేడు.

మరుక్షణంలో ఆ గూండాలకి, వీళ్లకి కొట్లాట ఆరంభమైంది. వాళ్ల కొట్లాట భీభత్సంగా మారేసరికి అక్కడున్న ఓటర్లు, యితరులు కాకావికలై పరుగులు తీశారు. రామకృష్ణయ్యగారి కార్యకర్త ఒకాయన పంతులుగార్ని చెయ్యి పట్టుకుని దూరంగా లాకొచ్చేసి ''మీరెందుకండీ అక్కడున్నారు? ఆ గూండా వెధవలకి చిన్నంతరం, పెద్దంతరం లేదు. అక్కడ ఎవరున్నా సైకిల్ చైనుల్తో బాదుతారు. నామాట విని యింటికి వెళ్లిపోండి'' అన్నాడు. అయినా పంతులుగారు వెళ్లకుండా అక్కడే నిలబడి చూస్తున్నారు. కొట్లాట మరింత ముదిరింది. ఇప్పుడు బేలెట్ బాక్సులు కొన్ని వీధిలోకొచ్చిపడ్డాయి. వాటిమీద పెట్రోల్‌పోసి నిప్పు అంటించారు. అయినా పోలీసులు జోక్యం చేసుకోలేదు. బాక్సులు నడివీధిలో భగ్గుమంటూ మండుతున్నాయి. ఓ గూండా గబగబా పరుగెత్తుకుంటూవచ్చి ఎర్రచొక్కా వేసుకున్న గూండాని కత్తితో పొడిచేడు. ఏ పార్టీవాడు ఏ పార్టీవాడిని పొడిచేడో అర్థం కాలేదు.

పంతులుగారి పక్కకి చలపతిరావు కారు వచ్చి ఆగింది. అందులో చలపతిరావే వున్నాడు. ''నాన్నా... కారెక్కు'' అంటూ డోర్ తెరిచేడు. ఆయన ఏదో అనబోతే మాట్లాడే అవకాశం యివ్వకుండా కారులోకి అతన్ని బలవంతంగా లాగి డోర్‌మూసి, కారుని రివర్స్‌చేసి యింటివైపు పోనిచ్చాడు.




"నీకోసం అన్ని పోలింగ్ బూత్స్ వెదుకుతున్నాను. ఆఖరుగా యిక్కడికొచ్చేను. అయినా యిక్కడింత బీభత్సం జరుగుతుంటే, యింటికి వచ్చెయ్యకుండా ఎందుకు నిలబడ్డావు?'' చలపతి కంగారు కంగారుగా మాట్లాడుతున్నాడు.

ఇంటికొచ్చేవరకూ పంతులుగారు ఏమీ మాట్లాడలేదు. ఇంటికొచ్చి రాగానే కొడుకు మీద కస్సుమంటూ లేచేడు. "ఏవిట్రా ఈ ఎలక్షన్ను? ఇదట్రా ప్రజాస్వామ్యం? ఇన్ని అవినీతి పనులు, ఇంత అమానుషం జరిపించే ఆనందరావుకి నువ్వు ఓట్లు వేసి గెలిపిస్తావా? చదువూ సంధ్యా లేనివాళ్లు, సారాకి, డబ్బులకి లొంగిపోయి తాడు ఏదో, పాము ఏదో తెల్సుకోకుండా ఓట్లు వేస్తే వెయ్యొచ్చు కానీ నువ్వో లాయరువైవుండి కూడా ... ఛీఛీ'' అంటూ గబగబా తన గదిలోకి వెళ్లి తలుపులు మూసుకున్నాడు.

నర్సింపంతులు వెళ్లిన పోలింగ్‌బూత్ దగ్గర కాదు మరో రెండుచోట్ల కూడా కొట్లాటలు జరిగేయి. కాకపోతే యిక్కడ కత్తుల్తో పొడుచుకోవడం వరకూ వచ్చింది. ఈ విషయాలువినే తండ్రికి ఏ ప్రమాదమూ జరగకూడదని గబగబా కారు వేసుకొచ్చేడు. తండ్రి తనని దూషించినందుకు చలపతి బాధపడలేదు. కానీ ఆనందరావు ఎలాంటి వాడో తెలిసి, తెలిసి తను ఓటువేశాడు. ఇంట్లో వాళ్లందరి ఓట్లూ వేయించేడు. భారతదేశ పౌరుడిగా, న్యాయం చట్టం తెల్సుకుని, న్యాయం కోసం వాదించే న్యాయవాదిగా ఆరోజంతా చలపతి బాధపడ్డాడు. తనని తాను అసహ్యించుకున్నాడు.

★ ★ ★

ఎన్నికల ఫలితాలు ప్రకటించారు.

ఆనందరావు విజయం సాధించేడు. రెండు వేల ఓట్ల తేడాతో సుబ్బయ్య లింగం ఓడిపోయేడు. రామకృష్ణయ్యకి డిపాజిట్టు దక్కలేదు. ఆనందరావు ఫలితాలు ప్రకటించిన వెంటనే రెండు మూడు వేల జనంతో, బేండు మేళంతో వూరేగుతూ వచ్చేడు. అప్పటికే అతని మెడలో చాలా దండలున్నాయి. ఊరేగుతున్న జీపులో పూలదండలు కుప్పగా పడివున్నాయి.

చలపతి యింటిముందు జీపు ఆపుచేయించేడు. చలపతికి ఆనందరావు గెలుస్తాడని తెలుసు. అయినా అతన్ని అభినందిస్తూ దండవేయడానికి అంతరాత్మ అంగీకరించలేదు. చలపతి వుత్త చేతుల్తో యింట్లోనుంచి వచ్చేసరికి ఓ కార్యకర్త జీపులోనుంచి ఓ దండ తీసి చలపతికి అందించేడు. ఆనందరావు అదేమీ గమనించనట్టుగా నటిస్తూ, దండ వేయించుకోడానికి వినయంగా తలవంచేడు.

ఆతర్వాత ఆ విషయమై తండ్రీకొడుకులు మరేమీ మాట్లాడుకోలేదు. పంతులుగారు మాత్రం గతాన్ని ప్రస్తుతాన్నీ ఒక్కసారి సమీక్షిస్తూ ఆలోచించేడు. అతని జీవితంలో గాంధీగార్ని ఓసారి చూడ్డం అతని జీవిత విశేషాల్లో అతిముఖ్యమైంది. తర్వాత వెంకటరాజుగారు గాంధీగారి జీవితచరిత్ర, నెహ్రూగారి జీవిత విశేషాలు తెలిపే పుస్తకాలు ఇవ్వడంవల్ల వాళ్ళిద్దరిగురించి చదివి తెల్సుకున్నాడు. రాజుగారి ద్వారా మరికొంతమంది దేశభక్తుల గురించి తెల్సుకున్నాడు. తెల్సుకున్నాక గాంధీగారి లాంటివాళ్ళు శతాబ్దానికొక్కరైనా పుడతారా అనుకున్నాడు. ఇప్పుడు జరిగిన ఎలక్షన్లు, ఈ ఆనందరావులాంటి నాయకుల్ని చూశాక, గాంధీగారు మళ్ళీ పుడితే బాగుణ్ణుకదా అనుకున్నాడు. కాలంతోపాటు చాలా మార్పులొస్తున్నాయని తన కొడుకు పదే పదే చెప్తున్నాడు. మిగతా ఏరంగంలో, ఏ విషయంలో మార్పులు వచ్చినారాకపోయినా గాంధీ, నెహ్రూలాంటి మహనీయులు పుట్టిన దేశంలో ఆనందరావు, సుబ్బయ్యలింగంలాంటి వ్యక్తులు పుట్టడం నిజంగా, దేశపరిస్థితిలో వచ్చిన గొప్పమార్పే అనుకోకతప్పదు. వర్తమానంకంటే గతమే గొప్పదన్న తన నమ్మకం ఆనాటి గాంధీ, నెహ్రూల్ని ఈనాటి ఆనందరావు, సుబ్బయ్యలింగాన్ని చూసేక మరింత బలపడిందనుకున్నాడు.

★ ★ ★

వినాయక నవరాత్రులు అన్నినగరాల్లోనూ జరుగుతున్నట్టే విశాఖపట్టణంలోకూడా భారీఎత్తున జరగడం ఆనవాయితీ. ఆ వీధిలోని యువకులు కొంతమంది నవరాత్రి ఉత్సవాలు జరపడానికి ఓ కమిటీగా ఏర్పడి, ఇంటింటికీ వెళ్లి చందాలు వసూలుచేస్తున్నారు. ఆ కమిటీ

లోని కుర్రాళ్ళంతా పదిహేనేళ్ళనుంచి ముప్పై య్యేళ్ళలోపువాళ్ళే. ఎవరికీ పెద్దగా చదువు సంధ్యలబ్బలేదు.

అన్ని ఇళ్ళకీ వెళ్తున్నట్టే చలపతిగారింటికీ చందాలకోసం వచ్చేరు. హాల్లోనే కూర్చున్న పంతులుగారే వాళ్ళకి ముందుగా దర్శనం ఇచ్చేరు.

''పండగ తొమ్మిది రోజులూ ఏవేం కార్యక్ర మాలు నిర్వహిస్తార్రా?''

''రోజుకో సినిమా చొప్పున తొమ్మిది సినిమా లు వేస్తామండి'' ఓ యువకుడు చాలా గొప్పగా జవాబుచెప్పేడు. ఆ ఒక్క సమాధానంతో పంతులుగారు రెచ్చిపోయేరు.

''రామా కృష్ణా అంటూ ఏవైనా పుణ్యంవచ్చే కార్యక్రమాలు పెట్టకుండా దిక్కుమాలిన సిని మాలు వేస్తానంటారేవిట్రా? హరికథలు పె ట్టించండ్రా- పుణ్యం, పురుషార్థం రెండూ కలు గుతాయి''

''హరికథలు పెడితే పుణ్యం, పురుషార్థం వస్తాయేమోగాని అలాంటి ప్రోగ్రామ్స్‌కి జనం ఎవరూరారండి''

''పోనీ బుర్రకథలు పెట్టండి''

''వాటికీ రావడం లేదండి''

''పోనీ, చెక్క భజనలు పెట్టండి''

కుర్రాళ్లంతా పంతులుగార్ని చిత్రంగా చూ స్తూ వెటకారంగా మాట్లాడేరు.

''అవన్నీ ఓల్డ్ మోడల్ ప్రోగ్రాములండి. అవిపెడితే జనానికి బోర్‌కొట్టేస్తాయి. ఎన్నిసార్లు చూసినా బోర్‌కొట్టందల్లా సినిమా ఒక్కటే తాత గారూ! ఆఖర్రోజున మాత్రం దేవుడి విగ్రహాన్ని పెద్ద ఊరేగింపుతో తీసుకెళ్ళి సముద్రంలో నిమజ్జనం చేస్తాం. అప్పుడు మాత్రం కోయవేషాలు, కోలాటం పెడదామనుకుంటు న్నామండి. అదీ చందాలు బాగా వసూలైతే ఈసారి మన వీధిలో పద్దెనిమిది అడుగుల విగ్రహం పెడుతున్నాం.

మీ అబ్బాయిగారూ పెద్ద చందాయిస్తే తొమ్మిది రోజులూ తొమ్మిది కలర్ పిక్చర్స్ వేస్తామండి. దాంతో మన వీధే టౌన్‌లోకల్లా టాప్ అయిపోతుందండి''

ఒక్కో యువకుడు ఎంతో ఉత్సాహంగా తను కార్యక్రమాల గురించి చెప్తుంటే పంతు లుగారు ఒక్కో మెట్టుచొప్పున రెచ్చిపోయేరు.

''వెధవల్లారా... దేవుడి బొమ్మ ఎంతపెద్దది పెట్టేవ్వూ, ఎంతమంది జనంతో వెళ్ళి దాన్ని నిమజ్జనం చేశాం అనట్రా ఆలోచిస్తారు?''

అతని వాదన ఇంకాస్త తీవ్రస్థాయికి వెళ్లేదే గాని చలపతిరావు, శంకరానంద్ అక్కడికి రావడంతో ఆగిపోయేడు. వాదన ఏ విషయం మీద జరుగుతుందో విన్నాక ఆనంద్ ''ఇప్పు డు అన్నిచోట్లా ఇలాగే జరుగుతోంది తాత య్యా'' అన్నాడు.

''దేవుడి నామాన్ని స్మరించుకోడానికి అప్పు డో పద్ధతి, ఇప్పుడో పద్ధతీ వుంటాయా? అయినా ఇదేం చోద్యంరా... సినిమాహాల్లోనూ సినిమాలే చూస్తున్నారు, టీవీల్లోనూ సినిమాలే చూస్తున్నారు- అవి చాలక ఇప్పుడు నవరాత్రి పండుగల్లో కూడా వీధుల్లో సినిమాలే చూ డాలా? ఇహ పుణ్యం గిణ్యం అంటూ ఏవీ అక్కర్లేదా?''

అతని మాటలు ఎవరూ పట్టించుకోనట్టుగా, చందా ఎంతివ్వాలి అన్న పాయింటు మీదే మాట్లాడనారంభించేరు.

''క్రిందటి సంవత్సరం మీరూ బ్లేక్ అండ్ వైట్ పిక్చరు వేయడానికి నాలుగు వందలిచ్చే రు. ఈసారి కలర్ పిక్చరు వేయించడానికి ఎనిమిది వందలు ఇప్పించండి సార్! ఎందు కంటే మన వీధిలో మనం ఒక్క బ్లేక్ అండ్ వైట్ పిక్చరు వేసినా మన వీధికి బేడ్‌నేమ్ వచ్చేస్తుంది. అక్కయ్యపాలెం కుర్రాళ్లు మన కంటే లీడింగ్‌లోకొచ్చేస్తారు. అదీ మా భయం''

ఆ అబ్బాయి చెప్పింది విని చలపతి చిన్నగా నవ్వుకున్నాడు. వీళ్లంతా భావిభారత నిర్మాతలు, నవతరానికి ఆశాజ్యోతులు. కానీ వీళ్లు మరొకరితో పోటీ పడుతున్నది, వీధుల్లో కలర్ పిక్చర్స్ వేయించడానికి. ఈ మాటల్నే బయటకు అనాలనుకున్నాడుగాని, తండ్రిని చూసి తమాయించుకున్నాడు. తను గనుక ఆ మాటలుఅంటే వాటిని ఆసరాగా తీస్కుని ఆ కుర్రాళ్లని కొట్టినా కొడతాడని తన ప్రయత్నాన్ని మానుకున్నాడు. వాళ్లు అడిగినట్టుగా ఎనిమిది వందలూ ఇవ్వడానికి ఒప్పుకున్నాడు గానీ-





పంతులుగారు ససేమిరా డబ్బులు ఇవ్వడాని కి వీల్లేదన్నారు.

చందాలు ఇవ్వకపోతే తననో పిసినారిగా అందరూ భావిస్తారని చెప్పేడు చలపతి. "అ యితే ఆఖరిరోజు అన్నదానం నిమిత్తం ఆ ఎనిమిది వందలూ చందాయివ్వు" అన్నాడు.

"ఇప్పట్లో అన్నదానం చెయ్యాలంటే ఎంత లేదన్నా పదివేలుండాలి. అందుకనే అలాంటి ఖర్చుదారీపనులు మానేశాం" అన్నాడో అబ్బాయి.

"హరికథలూ లేక అన్నదానాలూ లేకపోతే ఇంక మీరేం వినాయక నవరాత్రులు చేస్తున్న ట్రా? వీళ్లకొక్క దమ్మిడీ కూడా ఇవ్వడానికి వీల్లేదు- పొండిరా పొండి" అంటూ అందర్నీ బైటకి తరిమేశాడు. చలపతి శంకరానంద్‌తో మెల్లగా ఇంగ్లీషులో ఏదో చెప్తే ఓ అబ్బాయిని పక్కకి పిల్చి "సాయంత్రం నేనే వచ్చి యిస్తా ను" అని చెవిలో చెప్పి పంపించేశాడు.

"నువ్విలా కసురుకుంటే రేపట్నించి వాళ్లంతా నాగురించి ఏం అనుకుంటారో ఆలో చించేవా నాన్నా?" అన్నాడు చలపతి తనలో తాను గొణుక్కుంటున్నట్టుగా.

"ఏవీ అనుకోరు... వాళ్ల ముఖాలు చూ స్తుంటే చవితినాడు పూజ కూడా సరిగ్గా తగలె ట్టేట్టులేరు. నువ్విస్తానన్న ఎనిమిది వందలూ పెట్టి నేనూ మీ అమ్మా ఘనంగా పూజచే యించి, ఇంటింటికీ వెళ్లి మరీ వడపప్పు, ఉండ్రాళ్లు పంచుతాం. నువ్వేం తొందరపడి డబ్బు ఇచ్చెయ్యక్కర్లేదు" అంటూ లోపలికి వెళ్లిపోయేడు.

చలపతి ఇరకాటంలో పడ్డాడు. తను ఎని మిది వందలు ఇస్తానని మాటిచ్చేడు. ఇప్పుడు తన తండ్రి ఎనిమిది వందలూ పెట్టి భారీఎ త్తున పూజ చేయిస్తానంటున్నాడు. అతను చేయించే పూజవల్ల ఆ కార్యకర్తలు సంతృప్తిప డరు. తను చందా ఇచ్చినట్టుగా భావించరు. మొత్తం పదహారు వందలు పోయినట్టే అను కున్నాడు.

★ ★ ★

ఇంట్లో కూరగాయలు అయిపోయేయి. డ్రైవర్‌కి చీటీ యిచ్చి సుభద్ర మార్కెట్‌కి పంపిస్తుండగా పంతులుగారు అక్కడ కొచ్చి "వాడేం తెస్తాడమ్మా! నేను వెళ్ళి తెస్తాగా" అన్నాడు.

"అయ్యో! మీరు వెళ్లడం ఏవిటి మావయ్య గారూ! ప్రతిరోజూ రెండు కూరగాయల బళ్లు మన వీధిలోకొచ్చేవి. కానీ వాళ్లకేం వచ్చిందో గాని, రెండ్రోజుల్నించీ రావడంలేదు. నేనూ బద్ధకించేసాను" అంటూ ఏదో సంజాయిషీ చెప్తున్నట్టుగా చెప్పింది.

"మరేం ఫర్వాలేదులేమ్మా! మన పనులు మనం చేస్కుంటే తప్పా? పైగా, యిక్కడ కొచ్చిందగ్గర్నించి ఏ పనీ చెయ్యక ఒళ్లంతా తిమ్మిర్లు పట్టేశాయి" అంటూ సంచి తీస్కుని, చెప్పులు తొడుక్కున్నాడు.

"కార్లో వెళ్లిరండి మావయ్యగారూ" అంది సుభద్ర గుమ్మందాకా వచ్చి.

"ఉక్కు ముక్కల్లాంటి కాళ్లుండగా మళ్లీ ఈ కార్లెందుకమ్మా" అంటూ కూనిరాగం తీస్తూ వీధిలోకి నడిచేడు.

వెళ్తూ వెళ్తూ అత్తాకోడళ్ల యింటి దగ్గర ఆగేడు. ఆరోజు ఆ యింటికోడలి ఆత్మహత్యా ప్రయత్నాన్ని ఆపుచేసిందగ్గర్నించి, ఆ యింటి విషయాలేం తెలియలేదు. వాళ్లన్న య్య వచ్చేక తన దగ్గరికి పంపించమని చెప్పినా అతను రాలేదు. ఆసక్తిని ఆపుకోలేక యింటి తలుపులు తట్టేడు.

ఇంట్లో కోడలు ఒక్కతే వుంది. అత్తగారు లేరు. "విశేషాలు ఏమిటమ్మా" అని అడిగేడు.

ఆవిడ రెండే విషయాలు చెప్పింది. ఒకటి, వాళ్లన్నయ్యకి వుత్తరం రాసినా, అతనింకా డెహ్రాడూన్ నించి రాలేదట! రెండు, వాళ్లత్త గారు యింకా బాధలు పెడుతూనే వుందట! ఈ సమస్యకి పరిష్కారం ఏవిటాని ఆలోచి స్తూనే ఆ యింటినించి బైటపడ్డాడు.

మార్కెట్లో నాలుగు దుకాణాలవారితో గొడవ పడి, అయిదో దుకాణంలో కావల్సిన కూరగా యలు కొని రోడ్డు మీద నడుచుకొస్తూ ఓ చోట ఆగేడు.

ఓ పోలీస్ కానిస్టేబులు ఓ పద్దెనిమిదేళ్ల కుర్రవాణ్ణి పట్టుకొని, పోలీసుజులుం అంతా వుపయోగించి మరీ దబాయిస్తున్నాడు. తనని వదిలేయమని అబ్బాయి ప్రాధేయపడుతున్నా

డు. విషయం ఏమిటో సులభంగానే పంతులు గారికి అర్థమైంది. అక్కడ ఎవరూ మూత్రవిసర్జన చేయకూడదు అని గోడమీదరాసినా, ఈ అబ్బాయి ఆ పనిచేసేడట, అందుకని అతని మీద న్యూసెన్సు కేసు పెట్టడానికి స్టేషన్‌కి లాక్కు వెళ్తున్నాడు. అప్పటికే అక్కడ కొంత మంది జనం మూగేరు. పంతులుగార్ని చూడగానే అబ్బాయి "నన్ను రక్షించండి తాతగారూ" అంటూ ఏడ్చేసాడు. పంతులుగారికి జాలివేసింది. కానిస్టేబుల్తో అన్నాడు "అసలీ వెధవ అక్కడ మూత్రవిసర్జన చేసినట్టు ఋజువేంట్రా?"

తనని ఒరేయ్ అన్నందుకు కానిస్టేబులుకి చిర్రెత్తుకొచ్చింది. "మర్యాదగా మాట్లాడండి, అరేయ్ ఒరేయ్ అంటే చాలా గొడవైపోతుందండి" అన్నాడు.

"అన్యాయంగా కేసు బనాయించేవాడిని ఒరేయ్ అనకుండా మహారాజ, రాజపూజితులైన పోలీసు జవానుగారూ అని సంబోధిస్తారేవిట్రా? అసలు వీడక్కడ మూత్ర విసర్జన చేసాడా?"

"చేసేడండి"

"ఋజువేఁవిటి?"

"నేనే ఋజువు, నేనే సాక్ష్యంవూనండి. వీడు ఆపని చేస్తుండగా చూసి, ఆపని పూర్తయ్యేక పట్టుకున్నానండి"

పంతులుగారికి ఏదో పాయింటు దొరికినట్టైంది. గుమిగూడిన జనంలో ఒకాయన కాస్త ముందుకొచ్చి, "నేను పదవిలోనించి దిగిపోయేను, వూళ్లో పోలీసుల జులుం ఎక్కువైపోయింది" అన్నాడు ఏదో ఉపన్యాసం యిస్తున్నట్టుగా.

"నువ్వు ఏదైనా మంత్రి పదవి వెలగబెట్టేవా?" పంతులుగారు అతన్ని అడిగేరు.

"నేను ఈ వార్డుకి మాజీ కార్పొరేటర్ని" దర్జాగా చెప్పేడా మాజీ నాయకుడు.

"నువ్వు మాజీ నాయకుడివైనా, తాజా నాయకుడివైనా నీకు బుద్ధీ బుర్రా వుంటే యీ కేసులో న్యాయం చెప్పరా! ఈ కుర్రాడు మూత్ర విసర్జన చేస్తుండగా యీ జవాను చూసేడట. చూసినవాడు వెంటనే ఆపొచ్చుగా! అలా ఆపితే నగం నేరమే జరిగుండేది. కానీ నేరం పూర్తిగా జరిగిపోయే వరకూ ఆగి అప్పుడు నేరస్థుణ్ణి పట్టుకున్నాడట... అది వీడి తప్పు కాదా?"

పోలీసు గబగబా అతని దగ్గరకొచ్చి "నేను చేసింది తప్పెలాగవుద్దండి?" అంటూ అరిచేడు.

"ఎలా అవుతుందా?" అంటూ కార్పొరేటర్ వైపు తిరిగి పంతులు మాట్లాడేడు.

"నువ్వు రాజకీయ నాయకుడివేగదా... అంటే నీకూ కొంతమంది శత్రువులు అఘోరిస్తారుగదా. అందులో ఎవడో ఓ పింజారీ వెధవ వెనకనుంచొచ్చి నీ వీపు మీద కత్తితో పొడవబోయేడనుకో- అప్పుడు యిదే జవాను ఆ దృశ్యాన్ని చూడ్డం జరిగిందనుకో, అప్పుడు వీడేం చెయ్యాలి? పొడవబోతున్నవాణ్ణి ఆపి నిన్ను రక్షించడం వీడి కర్తవ్యమా లేక నిన్ను కసుక్కుమని పొడిచేసి నువ్వు చచ్చింతర్వాత ఆ వెధవని పట్టుకుని బంధించడం వీడి కర్తవ్యమా... నువ్వే చెప్పరా! ఇలాంటి రాలుగాయి వెధవలుండడంవల్ల నీలాంటి మంచి వెధవలు వుత్తపుణ్యానికి చచ్చిపోర్రా?" పంతులుగారు యిలా లాజిక్కులు తీసి మాట్లాడేనరికి మాజీ కార్పొరేటర్‌కే కాకుండా అక్కడున్న మిగతావారికి కూడా ఆ కానిస్టేబులు మహా అవినీతిపరుళ్ళాగా మహామహాదుర్మార్గుడిలాగ కనిపించేడు.

'పోలీసుల జులుం నశించాలి' అంటూ కేకలు వేశారు. కానిస్టేబుల్‌కి చెమటలు పట్టాయ్. ఇప్పటికే తన మీద రెండు కంప్లయింట్స్ రావడం వలన ప్రమోషన్ ఆపుచేసేరు. ఇప్పుడు వీళ్ళంతా ప్లేటు ఫిరాయించి మరో కంప్లయింట్ చేస్తే అధికారుల దృష్టిలో చాలా గొడవైపోతుంది. పైగా యీ ముసలాడు లాయరు చలపతిరావుగారి తండ్రినంటున్నాడు. ఆయన బాగా పేరున్న లాయరు. అలాంటివాళ్ళతో గొడవపడ్డానికి తన కెపాసిటీ చాలదు.

"నన్ను క్షమించండి తాతగారూ... ఏదో తొందరపడ్డాను" అంటూ తగ్గు స్వరంతో ప్రాధేయపడ్డాడు. పంతులుగారు జనాన్ని వెళ్ళమని చెప్పి జవానుతో "నాకో చిన్న పనిచేసిపెడితే

 

యీ గొడవ సంగతి మా అబ్బాయి దాకా తీసుకువెళ్ళను" అన్నాడు.

"ఏం చెయ్యాలో చెప్పండి"

"నాకు నువ్వేం వుపకారం చేయనక్కర్లేదు. ఇది కూడా నీ కర్తవ్యంలో ఒక భాగమే అనుకో" అంటూ జవానుతో పాటు నడుస్తూ తమ వీధిలోని అత్తాకోడళ్ళ విషయం వివరించేడు. "నువ్వు ఆ అత్తగార్ని కాస్త అదరగొడితే చాలు ఆ కోడలు పిల్ల సుఖపడిపోతుంది"- అతని రిక్వెస్టుకి కానిస్టేబులు ఒప్పుకున్నాడు.

ఇద్దరూ ఆ యింటికొచ్చి తలుపు కొట్టేరు. ఇప్పుడు యింట్లో అత్తగారు కూడా వున్నారు. పంతులుగార్ని పోలీసు కానిస్టేబుల్ని చూడగానే ఆవిడా, ఆవిడ కొడుక్కూడా కంగారుపడ్డారు.

పంతులుగారు వీధిలో నిలబడే అందరికీ వినిపించేలా బిగ్గరగా మాట్లాడేడు. అప్పటికప్పుడు ఓ పదిమంది వరకూ ప్రోగయ్యారు.

"చూడమ్మా... మీ యింటి పరిస్థితిలోగాని మీరు మీ కోడల్ని కట్నం విషయంలో చిత్ర హింసలు పెట్టే విషయంలోగానీ ఆరోజు నించి యీ రోజు వరకూ ఎటువంటి మార్పురాలేదని గమనించేను. ఈ జిల్లా అంతటికీ పెద్ద పోలీసు అధికారితో మాట్లాడేను. మీ యింటి మీద నిఘా వేసి వుంచమని ఈ జవాన్ని పంపించేరు. ఈ రోజునుంచి మీ కోడలు ఏ కారణంతో చనిపోయినా ఆవిణ్ణి మీరే చంపినట్టుగా లెక్కవుతుందట. అమ్మాయికి ఓ మేకు గుచ్చుకున్నా అది మీరే గుచ్చినట్టుగా లెక్కవుతుందట. చివరికా అమ్మాయి తలకి ద్వార బంధం తగిలినా ఆ ద్వారబంధాన్ని మీరే కుట్ర చేసి కావాలని ఆవిడ తలకి తగిలించినట్టుగా లెక్కవేసి మీ తల్లీకొడుకులకి చెరి ఏడు సంవత్సరాలు శిక్ష విధించే విధంగా మీ మీద కేసు నమోదు చెయ్యడం జరుగుతుందట. అలాగే వాళ్ళన్నయ్య అదేదో పూర్నించి వచ్చినా మీకా కట్నం డబ్బు యివ్వకూడదట. ఒకవేళ యిస్తే అతనికి నాలుగేళ్ళు, పుచ్చుకున్నందుకు మీకు ఎనిమిది సంవత్సరాలు శిక్షపడుతుందని గుర్తుపెట్టుకోండి."

పంతులుగారు చెప్పిన ప్రతి మాటకి కానిస్టేబులు ఔనౌను అంటూ లాఠీతో తలుపు మీద కొడుతూ వంత పలికేసరికి తల్లీకొడుకులు అదిరిపోయి ఏడుపులంకించుకున్నారు. అమ్మాయికి ఏ కష్టం కలిగించకుండా చూసుకుంటామని అందరి ముందూ ఒప్పుకున్నాక పంతులుగారు కానిస్టేబుల్ని పంపించేసి విజయగర్వంతో యింటికి నడిచేరు.

వినాయకచవితి వచ్చింది!

చలపతిరావు ఇచ్చిన డబ్బుతో నర్సింపంతులు సతీసమేతంగా ఆ వీధిలో వేసిన పందిరి దగ్గరకెళ్లి నిష్ఠగా పూజ జరిపించేడు. వినాయక వ్రతకల్పాన్ని పూజారి హడావిడిగా చదివేసి, విక్కీ మోపెడ్ మీద వెళ్లిపోతుంటే, అతన్ని గట్టిగా పట్టి ఆపుచేసి మళ్లీ నిదానంగా చదవమన్నాడు. "ఇలా అయితే నాకు గిట్టుబాటు అవదండి. అవతలింకా నాలుగు పందిళ్లలో పూజలు జరిపించాలి" అంటూ గుండెలు బాదుకున్నాడు పూజారి.

"అదేంకుదరదు... కావాలంటే మరో పది రూపాయలు ఎక్కువ తీస్కో! అంతేగాని పూజా కార్యక్రమం సక్రమంగా నిర్వర్తించకుండా బండెక్కేవంటే నేనూరుకోను" అంటూ మొండిపట్టు పట్టి మరీ ఆ కార్యక్రమాన్ని జరిపించేడు. తర్వాత కుర్రాళ్లతో ప్రసాదం బుట్టలు మోయించుకెళ్ళి ఆ వీధిలోనూ, పక్క వీధిలో కూడా ఇంటింటికీ ప్రసాదాలు పంచిపెట్టేడు.

★ ★ ★

నర్సింపంతులు, కామేశ్వరమ్మ ఆరోజు సాయంకాలం సముద్రపొడ్డున కూర్చుని బఠాణీలు నములుతూ ఓ ముఖ్యమైన విషయం గురించి చర్చించుకున్నారు.

అది భారతీ, రాజేష్‌ల పెళ్లి విషయం!

భారతి చలపతిరావు చిన్నకూతురు! రాజేష్ తమ కూతురి కొడుకు! ఒక్కడే కొడుకు. పైగా డాక్టరు. ఆ ఇద్దరికీ పెళ్లి చేసేస్తే, మేనరికంవల్ల రెండుకుటుంబాల మధ్య శాశ్వతమైన సంబంధమూ కలిసినట్టవుతుంది. రెండు ఇళ్లల్లోనూ జరిగే యీ ఆఖరి శుభకార్యాన్ని తమ కళ్లతో చూసేసినట్టూ అవుతుంది.

తమ అభిప్రాయం వినగానే కొడుకు, కోడ

లూ ఎంతో సంతోషిస్తారనుకున్నాడుగాని సంతోషించకపోగా చలపతి చాలా ఆవేశంగా మాట్లాడేడు.

"భారతి యింకా ఫైనలియర్ చదువుతోంది. పైగా దానికి మొన్ననే పదహారు వెళ్లి పదిహేడు వచ్చింది- అప్పుడే దానికి పెళ్లేఁవిటి?" అన్నాడు.

ముసలాళ్లిద్దరూ విస్తుపోయేరు. "దానికి పదిహేడొచ్చిందని చెప్తూనే, అప్పుడే దానికి పెళ్లేవిటంటావేవిట్రా? ఆడపిల్లల పెళ్లిళ్లు ఆ వయసులో కాకపోతే అరవై ఏళ్లొచ్చేక చేస్తావా?" అంటూ నోరు నొక్కుకుంటూ మాట్లాడింది కామేశ్వరమ్మ.

"నా పెళ్లయ్యేటప్పటికి నా వయసెంతో తెల్సురా? పధ్నాలుగు- అప్పటికి మీ అమ్మ వయసు పదకొండు. ఆమాటకొస్తే మీ చెల్లెలి పెళ్లి ఎన్నో ఏట చేసేం? పదిహేనెళ్లి పదహారొ

చ్చేసరికి చేసేం. నీ పెళ్లయేటప్పటికి నీ పెళ్లాం వయసూ పదహారేగా'' ఇది పంతులుగారి వాదన.

''ఆ కాలం వేరు... యీ కాలం వేరు నాన్నా'' అన్నాడు చలపతి తన ఆవేశాన్ని తమాయించుకుంటూ.

ఆమాటకి పంతులుగారు సహనంచచ్చి, వ్యక్తిత్వం దెబ్బతిన్నవాడిలా అరుస్తూ మాట్లాడేడు.

''ఏఁవిట్రా... నేను యిక్కడకొచ్చిందగ్గర్నించీ చూస్తున్నాను. మేవేం చెప్పినా ఆ కాలం వేరు, ఈ కాలం వేరూ అంటూ మా ప్రతీమాటని కొట్టిపారేస్తున్నావ్! కొన్ని కొన్ని విషయాల్లో అప్పటికీ యిప్పటికీ మార్పులొచ్చి వుండొచ్చు. మా పెళ్లినాటికి తులం బంగారం ముప్పైరెండు రూపాయలు. అదే నీ పెళ్లినాటికి రెండువందల డెబ్భై అయింది. ఇప్పుడు దగ్గరదగ్గర నాలుగువేలు అమ్ముతోంది. మా టైములో బియ్యం బస్తా ఖరీదు ఎనిమిది రూపాయలు, ఇప్పుడు ఒక్క కేజీ బియ్యమే ఆర్రూపాయలు అమ్ముతోంది, ఇలాంటి వాటిల్లో అప్పటికీ యిప్పటికీ విపరీతమైన తేడావచ్చిందను ఒప్పుకుంటాను, అంతేతప్ప అన్నింట్లోనూ తేడాలు వచ్చేశాయంటే మాత్రం నేనొప్పుకోను. ఏం, అప్పట్లో తూర్పున వుదయించే సూర్యుడు, యిప్పుడు పడమట వుదయిస్తున్నాడా? దక్షిణాన వుదయిస్తున్నాడా? అప్పట్లో ఆడవాళ్లు పిల్లల్నికంటే, యిప్పుడు మగవాళ్లు కంటున్నారా? అలాగే పెళ్లిళ్లు కూడాను''

తండ్రి అనే గౌరవంతో చలపతి ఈ విషయంలో రాజీపడకుండానే మాట్లాడేడు.

''చూడు నాన్నా... నువ్వు చెప్పినట్టు అప్పుడూ యిప్పుడూ సూర్యుడు తూర్పునే వుదయిస్తున్నాడు, పిల్లల్ని ఆడవాళ్లేకంటున్నారు, వాటిల్లో మార్పులేదు. యికమీదట రాదు, ఎందుకంటే అవి మనుషుల ఆధీనంలో లేని విషయాలు కాబట్టి వాటిల్లో మనం మార్పు తీసుకురాలేం! కానీ, మనల్ని మనం మార్చుకుంటూ ఎంతదూరం వచ్చేమో ఆలోచించు. ఒకప్పుడు మనిషికీ, జంతువుకీ తేడాలేకుండా బ్రతికేడు ఒంటికి బట్టకూడా కట్టుకునేవాడు కాదని చరిత్ర చెప్తోంది. మరి కాలక్రమేణా మనిషి ఎంత మార్పుచెందేడో ఓసారి ఆలోచించు. పెళ్లిళ్లు కూడా అంతే నాన్నా! ఒకప్పుడు ఆడపిల్లకి ఎనిమిదేళ్లు వస్తేచాలు, పెళ్లి చేస్కునే అర్హత వచ్చేసిందంటూ పెళ్లిళ్లు చేసేరు. ఇంకా కొన్ని ప్రాంతాల్లో అంతకంటే తక్కువ వయసులోనే పెళ్లిళ్లు చేసేవారట. కానీ కాలం అలాగే వుండిపోయిందా? ఇప్పుడు ఆడపిల్లకి పద్దెనిమిదేళ్లు, అబ్బాయిలకి యిరవై ఒక్క సంవత్సరం నిండకుండా పెళ్లిచేస్తే అది చట్ట ప్రకారం నేరం అవుతుంది. ఆ నేరం చేసినవాళ్లకి శిక్ష కూడా పడుతుంది''

ముసలాళ్లిద్దరూ ఒకర్నొకరు వింతగా చూసుకున్నారు.

''అంటే చట్టం ఒప్పుకోదని దానికి పెళ్లి చెయ్యనంటున్నావా లేక నీకు యిష్టంలేక చెయ్యనంటున్నావ్రా?'' అంది కామేశ్వరమ్మ.

''మనమ్మాయి పెళ్లి చెయ్యొద్దంటానికి చట్టం ఎవరే? దాన్ని కనీ పెంచినోళ్లు దాని పెళ్లి చెయ్యాలిగాని, చట్టాలూ, కోర్టులూ వచ్చి దాని పెళ్లి చేస్తాయా? వీడికే యిష్టం లేనట్టుంది!'' అన్నాడు పంతులు.

''ఔను నాన్నా... పదిహేడో ఏట ఆడపిల్ల పెళ్లి చెయ్యడానికి ఒకవేళ చట్టం ఒప్పుకున్నా దాని పోస్టుగ్రాడ్యుయేషన్ అయ్యేవరకూ దాని పెళ్లి చెయ్యను. అప్పుడుగూడా దాని పెళ్లి నా చెల్లెలి కొడుకుతో కాదు వేరే మరో సంబంధం చేస్తాను''

చలపతి మేనరికాన్ని కాదంటాడని వాళ్లు ఎంతమాత్రం వూహించలేదు. చెల్లెలంటే ఎంతో ప్రేమ చూపించే చలపతి ఎందుకిలా తిరస్కరిస్తున్నాడో ముసలాళ్లకి అర్థంకాలేదు.

''నీ చెల్లెలి కొడుక్కేం తక్కువని ఆ సంబంధం కాదంటున్నావురా? నీ మేనల్లుడు డాక్టరు గదా అంతకంటే గొప్ప సంబంధం చేస్తావా?'' కామేశ్వరమ్మ కొడుకుని నిలదీసి అడుగుతున్నట్టుగా అడిగింది.

''అదీగాక, యీ పెళ్లివల్ల మీ రెండు కుటుంబాలూ శాశ్వతంగా కలిసి వుంటాయని, వుండాలనీ మా ఆశరా'' పంతులుగారి గొంతులో ఆజ్ఞకంటే ఆవేదనే ధ్వనించింది.




చలపతి రెండుమూడు క్షణాల తర్వాత జవాబు చెప్పేడు "నన్ను క్షమించు నాన్నా... మా రెండు కుటుంబాలు శాశ్వతంగా కలిసి వుండడానికి యీ పెళ్ళే జరగక్కర్లేదు. మా మనసుల్లో కపటాలూ, కల్మషాలు లేకుండా వుంటే యిప్పట్లాగే ఎప్పుడూ కలిసుంటాం. కాకపోతే మేనరికం చెయ్యడం నాకూ యిష్టం లేదు, నా చెల్లెలికీ యిష్టంలేదు"

"ఎందుచేత?"

"మేనరికాలు చేసుకున్న అందరిలో కాకపోయినా చాలామందిలో చెడు ఫలితాలు కనిపిస్తున్నాయి. ఇది నేను చెప్తున్న మాటకాదు వైద్యశాస్త్రమే చెప్తోంది"

"ఏవిట్రా చెప్తోంది... పదిహేడో ఏట పెళ్లిచెయ్యడానికి చట్టం ఒప్పుకోదా? మేనరికం చెయ్యడానికి వైద్యశాస్త్రం ఒప్పుకోదా? అంటే నువ్వుచేసే ప్రతిపనికీ శాస్త్రాన్నీ చట్టాల్నే సంప్రదిస్తావుగాని నిన్ను కనీ పెంచిన తల్లిదండ్రుల ఆశల్నీ ఆశయాల్నీ ఖాతరు చెయ్యవేఁవిట్రా? ఏమైనా అంటే కాలం మారిపోయింది, మీరెక్కడో రాతియుగంలో వుండిపోయేరంటావ్? ఇలా శాస్త్రాలమీద, చట్టాలమీదా నెపంపెట్టి మా అభిప్రాయాల్ని కాదనే బదులు నా యిష్టంనాది, మీ చావు మీరు చావండీ అని ఒక్కమాట చెప్పెయ్యగూడదా?" నర్సింపంతులు ఆవేశాన్ని తమాయించుకోలేక గబగబా తన గదిలోకి వెళ్లి తలుపులు మూస్కోబోతూ భార్యని ఒక్క కసురుకసుర్తూ పిలిచేడు.

"మన పెద్దరికాలు ఎంత విలువ చేశాయో తెలిశాక యింకా అక్కడెందుకే"

ఆ కేక వినగానే ఆమెగూడా గదిలోకి వెళ్లిపోయింది.

కాస్సేపు అందరూ సీరియస్‌గా వుండిపోయి, ఎవరి గదుల్లోకి వాళ్ళు వెళ్లిపోయేరు. ఆరాత్రి భోజనానికి రమ్మని పిలిస్తే ముసలాళ్ళు రాలేదు. మర్నాడు వుదయ... టిఫినుకీ రాలేదు. ఇద్దరికిద్దరూ బిర్రబిగుసు...క్కూర్చున్నారు.

ఇంట్లోవాళ్లంతా ప్రాధేయపడినమీదట మధ్యాహ్నం భోజనం మాత్రం చేసేరు, అప్పుడుకూడా ఎవరితోనూ మాట్లాడలేదు.

ఆ సాయంత్రం శంకర్‌ఆనంద్ యింటికి రోజూకంటే వేగంగా వచ్చేడు. వాళ ఆఫీసు తాలూకు కల్చరల్ ప్రోగ్రాం సాంబమూర్తి కళామందిరంలో జరుగుతోందని, భార్యా పిల్లల్ని తీసుకువెళ్లడానికి వచ్చాడు. వాళ్లని తొందరపెట్టి హడావిడిగా తయారవుతుంటే వాణీకో ఆలోచన వచ్చింది. నిన్నట్నించి ముసలాళ్లు గదిలోనే వుండిపోయేరు. ఎవర్తోనూ మాట్లాడ్డంలేదు. అసలు వాళ్లలో వాళ్లు కూడా మాట్లాడుకుంటున్నారో లేదో- "పోనీ వాళ్లనీ ఫంక్షన్‌కి తీసుకెళ్తే కాస్త రిలాక్స్ అవుతారేమో" అంది శంకరంతో.

శంకరం ఆలోచించేడు- "యివాళ్టి ఫంక్షన్లో మా స్టాఫ్ వాళ్లు ఓ డేన్సు ప్రోగ్రామ్, ఓ హాస్య నాటిక వేస్తున్నారు. వాటిని వీళ్లు ఎంజాయ్ చెయ్యొచ్చు, కానీ వాళ్లిద్దరి చాదస్తం సంగతీ నీకు తెల్సిందేగా! అక్కడేం గొడవ తెస్తారో అని నా భయం" అన్నాడు.

"ఫర్వాలేదులెండి... ఏదైనా జరిగితే సర్దిచెప్పడానికి మనం వున్నాంగా" అంటూ వాణి భరోసా యిచ్చేక కాదనలేకపోయేడు.

ఇద్దరూ వెళ్లి కాస్సేపు ప్రాధేయపడ్డాకగాని ముసలాళ్లు ఫంక్షనుకి వెళ్లడానికి ఒప్పుకోలేదు.




సాంబమూర్తి కళామందిరం పోర్టు ట్రస్టు ఆధ్వర్యంలో నిర్మించిన థియేటరు. ఆ ప్రాంగణంలో కారుదిగేక నర్సింపంతులు లోపలికి వెళ్లకుండా అక్కడే నిలబడి అడిగేడు-

"దీనిపేరు సాంబమూర్తి కళామందిరమా?"

"ఔను తాతయ్యా"

"సాంబమూర్తి అంటే శివుడిపేరని దీనికా పేరు పెట్టేరా లేక అది ఎవరైనా మనిషి

పేరా?''

''మనిషి పేరే! ఇలారా'' అంటూ ఎడమవై పుకి తీసుకువెళ్లి అక్కడున్న సాంబమూర్తిగారి శిలా విగ్రహాన్ని చూపించేడు.

''సాంబమూర్తిగారంటే యీయనే! ఈయన ఈ పోర్టు ట్రస్టుకి ఛైర్మన్‌గా వున్నప్పుడు లలితకళల్నీ, ఆటల్నీ ఎక్కువగా ప్రోత్సహించేరు. ఈ థియేటరు కూడా ఆయన అభిరుచివల్ల కట్టబడిందే! అందుకే, దీనికి ఈయన పేరు పెట్టేరు''

పంతులుగారు శిలావిగ్రహాన్ని నాలుగైదు క్షణాలపాటు తదేకంగా చూసి- ''బావుంది. ఆయన చేసిన పనీ బాగుంది. యీ శిలావిగ్రహమూ బాగుంది. ఇంతకీ యీ విగ్రహాన్ని చెక్కింది ఎవరో'' అన్నాడు.

ఆ ప్రశ్నతో ఆనంద్ గతుక్కుమన్నాడు. శిల్పి పేరు అక్కడెక్కడైనా వుందేమోనని వెదికేడుగాని కన్పించలేదు. ''ఇక్కడా శిల్పి పేరు రాయలేదు తాతయ్యా'' అన్నాడు.

''తొందర లేదు... రేపు ఎవర్నైనా కనుక్కుని చెప్పు'' అంటూ లోపలకి నడిచేడు.

సభ యింకా ప్రారంభం కాలేదు.

మొదట్నించి నాలుగో వరసలో అందర్నీ కూర్చోబెట్టాడు ఆనంద్. అక్కడనించే పంతులుగారు ముందు వరసల్లో వున్నవార్నీ వెనకవరసల్లో వున్నవార్నీ నిశితంగా చూసేడు. మొదటివరుసలో కూర్చుని, పక్కనున్నవాళ్లతో మాట్లాడుతున్న వ్యక్తి ఎమ్మెల్యే ఆనందరావని సులభంగానే గ్రహించేడు.

''వీడు ఎందుకొచ్చేడ్రా?'' అని అడిగేడు పంతులు. ''ఆయన ఎమ్మెల్యే గదా! మా ఫంక్షనుకి చీఫ్ గెస్టుగా పిలిచేరు. అంటే, ముఖ్యఅతిథిగా ఆహ్వానించేరన్నమాట''

''ఏంవాడు తప్ప మరెవడూ దొరకలేదేంవిట్రా ఆ త్రాష్టుణ్ణి పిలిచేరు'' అన్నాడు చిరాగ్గా.

శంకరానంద్, ఆ మాటలు ఎవరైనా విన్నారేమోనని కాస్త కంగారుగా అటూ యిటూ చూసేడు. ''నువ్వు యిలా మాట్లాడితే బాగోదు తాతయ్యా'' అన్నాడు మెల్లగా హెచ్చరిస్తూ.

''ఇక్కడ కాకపోతే అక్కడకెళ్లే మాట్లాడతాను. వుండు, ఓసారి పలకరించి వస్తాను'' అంటూ ఆనంద్ వద్దంటున్నా వినకుండా ముందుకు నడిచేడు. అక్కడ ఏం గొడవ చేస్తాడేమోనని వాణీ కంగారుపడి, ఆనంద్‌ని కూడా అతని వెంట పంపించింది.

నర్సింపంతుల్ని చూస్తూనే దయ్యాన్ని చూసిన చంటి కుర్రాడిలా భయపడిపోయేడు ఆనందరావు. రెండు క్షణాలపాటు మాటా పలుకూ లేకుండా గుటకలు మింగేక ''నమస్కారమండీ'' అన్నాడు.

''నమస్కారంవేగాని, నువ్వు పదవిలోకెళ్లక ముందు నీకు దేశం గురించి ఎలాగూ తెలియదు. కనీసం యిప్పుడైనా నాలుగు విషయాలు తెల్సుకున్నావా? లేక, యింకా, ఆ మేష్టారెవడి చేతో సమాధానాలు చెప్పిస్తున్నావా?''

అతను ఏంఅడుగుతున్నాడో చుట్టూవున్న వాళ్లెవరికీ అర్థంకాలేదు. ఆ తర్వాత యింకెలాంటి రభస జరిగేదోగాని, అదే సమయంలో ఎవరో వ్యక్తి వేదికమీదనించి మైకులో అతిథుల్ని ఆహ్వానించడం ఆరంభమైంది. 'హమ్మయ్య' అనుకున్నాడు ఆనంద్!

''మన సీట్లోకి వెళ్లి కూర్చుందాం'' అన్నాడుగాని, 'నువ్వెళ్లి కూర్చో, నేనిక్కడ కూర్చుని చూస్తాను'' అంటూ ఆనందరావు ఖాళీ చేసిన సీట్లో కూర్చున్నాడు. ఆ సమయంలో అతన్తో వాదనకి దిగడం సభా మర్యాదకాదని ఆనంద్ వెళ్లి, తన సీట్లో కూర్చున్నాడు.

వేదికమీద కూర్చున్న ఆనందరావుకి మొదటివరసలో కూర్చున్న పంతులుగార్ని చూస్తుంటే భయంగానే వుంది. ఏక్షణంలో తనని ఒరేయ్ అని పిల్చి, ప్రశ్నలు విసిరి తన పరువు తీసేస్తాడోనని కంగారుపడుతున్నాడు.

కల్చరల్ ప్రోగ్రామ్ సెక్రట్రీ మైకు ముందు నిలబడి మాట్లాడబోతూ ''లేడీస్ అండ్ జెంటిల్మేన్'' అంటూ ఆడియన్స్‌ని సంబోధించేడు. ఆ రెండు ఇంగ్లీషు మాటలకి అర్థం తెలియక పక్కనున్న వ్యక్తిని అడిగేడు.

''లేడీస్ అంటే ఆడవాళ్లలారా అని అర్థమండీ, జెంటిల్మెన్ అంటే మర్యాదస్తులైన మగవాళ్లలారా అని అర్థం'' అన్నాడా వ్యక్తి. అంతే, పంతులుగారు చర్రుమంటూ లేచి, ఆ సెక్రటీని బిగ్గరగా పిలిచేడు.





"ఆపరా నీ వుపన్యాసం" అన్నాడు.

"ఏంజరిగిందండి?" సెక్రట్రీ అక్కడనించే అడిగేడు. శంకరానందే గబగబా ముందు కొచ్చి" కూర్చో తాతయ్యా" అని చెప్పినా పంతులుగారు లక్ష్యపెట్టలేదు.

"నువ్వు సభాముఖంగా ఆడవాళ్లని అవ మానిస్తే నేను సహించలేను" పంతులు అరిచే డు.

"నేనేం ఆడవాళ్లని అవమానించలేదే"

"అవమానించలేదా... ఆడవాళ్లని వుత్త లేడీస్ అనేసి వూరుకున్నావు కానీ- మగవాళ్లని మాత్రం జెంటిల్మెన్ అన్నావు, అంటే మగవా ళ్లు మర్యాదస్థులూను, ఆడవాళ్లు మర్యాదస్థు లు కారనీ అర్థమా. ఆడవాళ్లని వుత్త లేడీస్ అన్నావుగదా! నువ్వు ఎంత మగవాడివైనా నీకంత అహంకారం పనికిరాదు. ఆడవాళ్లని అవమానించే హక్కు నీకు లేదు"

అతను తీసిన విపరీతార్థాలకి కొంతమంది నవ్వేరు. ఆనంద్ గబగబా స్టేజి మీదకెళ్లి సెక్రట్రీతో మెల్లగా, తన తాతయ్య గురించి చెప్పి అతన్ని శాంతపరిచేరు. సెక్రట్రీ పంతు లుగారి మాటల్ని స్పోర్టివ్‌గా తీసుకుని మళ్లీ మైకులో మాట్లాడేడు- "లేడీస్ అండ్ జెంటి ల్మెన్ అనే మాటని ఎన్నో శతాబ్దాలనుంచీ వాడుతున్నా యిప్పుడా తాతగారు తీసిన విప రీతార్థాలని ఎవరూ ఎప్పుడూ తీయకపోవ డంవల్ల ఆ మాట అలాగే యిన్నాళ్లూ బతి కింది. ఆ మాటలకి సరైన అర్థం చెప్పి ఆ తాతగార్ని ఒప్పించడం బహుశా నాకు చేత కాని పని. అందుచేత నేను తెలుగులోనే సంబో ధిస్తాను. సోదర సోదరీమణులారా..." అంటూ మిగతా వుపన్యాసాన్ని కొనసాగించేడు.

"ఆ ముక్కేదో ముందే ఏడవొచ్చుగా- యిక్క డే బ్రిటీషు దొరలున్నారని యింగ్లీషులో మాట్లా డబోయేడు?" అని గొణుక్కుంటూనే కూర్చు న్నాడు. ఆనందరావు తన సందేశాన్ని విని పించేటప్పుడు నర్సింపంతులువైపు చూడ కుండానే జేబులోంచి కాగితంతీసి, అందులో రాయించుకొచ్చిన నాలుగు వాక్యాల్ని గబగబా చదివేసి, ఠక్కున కూర్చుండిపోయి 'హమ్మ య్యా... బతికిపోయేను" అనుకున్నాడు. ఉప న్యాసాలు ముగిసి, సాంస్కృతిక కార్యక్రమాలు ఆరంభమయ్యేయి. అవి ఆరంభమైన అయి దు నిమిషాలకే ఆనందరావు థియేటర్లోంచి వెళ్లిపోయేడు.

"వాడు యీ సభకి ముఖ్యఅతిథైవుండి ఎందుకలా మధ్యలో వెళ్లిపోయేడు?" అని ఆనంద్‌ని అడిగేడు.

"ఎమ్మెల్యేకదా... బోలెడన్ని కార్యక్రమా లుంటాయ్"

"వాడి పిండాకూడు వాడికి ఓ అంటే నా రాదు. వాడు దొంగఓట్లు వేయించుకు గెలిచే డు. అలాంటివాడికి సమయంలో వేరే కార్యక్ర మాలేముంటాయ్, సారా తాగడం తప్ప అందు కే పోయివుంటాడు"

స్టేజి మీద జరుగుతున్న డాన్సు శబ్దాల్లో అతని మాటలు కేవలం ఆనంద్‌కే విని పించాయి.

★ ★ ★

మర్నాడు-

సుజాత డాన్స్ స్కూల్‌కు వెళ్ళి తిరిగొ స్తుంటే దారిలో రవీంద్రనాథ్ ఆమె కోసమే నిరీక్షిస్తూ కనిపించాడు.

ఆమె ఆగింది.

"మిమ్మల్ని రోడ్డు మీద ఆపడం నా కిష్టం లేదు. కానీ మా డాడీకి సడన్‌గా హార్ట్‌లో పెయిన్ వచ్చి హాస్పిటల్లో ఎడ్మిట్ అయ్యేరని ఫోన్ వచ్చింది. నేనీరోజు మెయిల్‌కి కలకత్తా వెళ్తున్నాను. ఆ విషయం చెప్పడానికే వచ్చా ను"

అతను అంతే మాట్లాడేడు.

'నేను అడిగిన విషయం గురించి ఏమైనా ఆలోచించేరా?' అని అడగాలనుకున్నాడుకానీ, అడగలేకపోయాడు.

'మీరు చెప్పింది జరగడం అసాధ్యంగానే కనిపిస్తోంది, యింకా విషయం మర్చిపోండి' అని సుజాత చెప్పాలనుకుంది కానీ చెప్పలేక పోయింది.

ఆ మధ్యాహ్నం మెయిల్‌కే అతను కలకత్తా వెళ్లిపోయేడు.

★ ★ ★

నర్సింపంతులు ఆపూరొచ్చి నెల దాటే

సింది.

ఇంక హైదరాబాద్‌లో వున్న కూతురి దగ్గరికి బయలుదేరేడు. తల్లిదండ్రులకి ఫస్ట్‌క్లాస్ టిక్కెట్లు రిజర్వు చేయించేడు చలపతిరావు.

బయలుదేరే ముందురోజే భార్యని తీసుకుని వీధిలోని అన్ని యిళ్లకీ వెళ్లి, తాము వెళ్లిపోతున్న విషయం చెప్పేడు. అందరికీ తన చింతల అగ్రహారం అడ్రెస్ రాసిచ్చి ఓ నెల తర్వాత అప్పుడప్పుడు వుత్తరాలు రాయమన్నాడు.

ఆ మధ్యాహ్నం పనిగట్టుకుని మరీ ఆనందారావు యింటికి వెళ్లేడు.

అతను గేటుదాటి రావడం చూసి ఆనందరావు గబగబా పక్కగదిలోకి వెళ్లిపోయి "నేను లేనని చెప్పేయండి" అన్నాడు సెక్రెట్రీతో.

అయితే అతను పక్కగదిలోకి హడావిడిగా వెళ్లిపోవడం పంతులుగారి కంటపడిపోయింది. అందుకే ఆఫీసుగదిలోకి వస్తూనే సెక్రెట్రీతో "ఆయన పక్కగదిలోకి దూరిపోవడం నేనుచూసేనులే. నీతో ఏంచెప్పివుంటాడోకూడా అర్థంచేసుకోగలను. నేనేం వాడిని తిట్టడానికి రాలేదు. నేనీవూర్నించి వెళ్లిపోతున్నానని చెప్పడానికొచ్చేను... రమ్మను రమ్మను" అన్నాడు.

సెక్రెట్రీ పిలవకుండానే ఆమాటలు విని ఆనందరావు ఆ గదిలోనించి వచ్చేశాడు.

"చూడరా అబ్బాయ్... నేను ఒకేఒక్క విషయం చెప్పడానికొచ్చేను. నువ్వేమిటో నాకు తెలుసు. మనదేశానికి మహాత్మాగాంధీలాంటి పెద్దలెందరో ఎన్నో త్యాగాలుచేసి స్వతంత్రం సంపాదించేరు. మనం ఎలాగూ గాంధీగారంతటి వాళ్లం అవలేం. కనీసం ఆయన వారసుడిగానైనా మిగలడానికి నువ్వు కొంత కృషిచెయ్యాలిగదా. మళ్లీ, మనం కలుస్తామోలేదో నీ కర్తవ్యం ఏవిటో ఒక్కసారి గుర్తుచేసిపోవడానికొచ్చేను వస్తాన్రా" అంటూ మరొక్క క్షణం ఆగకుండా బైటికి వెళ్లిపోయేడు.

ఆ క్షణంలో నర్సింపంతులు ఆనందరావు కంటికి విమర్శకుడిలా కనిపించలేదు. విద్య బోధించే ఉపాధ్యాయుడిలా కనిపించేడు. అతనికి తెలియకుండానే కళ్లల్లో నీళ్లు తిరిగేయి.

ఆ రాత్రి చలపతిరావు హైదరాబాద్ ఫోన్ చేసి తన చెల్లెలితోను, బావతోనూ మాట్లాడి సికింద్రాబాదు స్టేషన్‌కి కారు తీసుకురమ్మని చెప్పేడు. ట్రైన్‌వచ్చే టైముకి కారులో మీరు రాకపోతే తెలియనివూళ్లో తన తల్లిదండ్రులు యిబ్బందిపడిపోతారని మరీమరీ చెప్పేడు. మర్నాడు ట్రైన్‌కి బయలుదేరేటప్పుడు హైదరాబాద్‌కి రెండుస్టేషన్లున్నాయని, వాళ్లు సికింద్రాబాద్ స్టేషన్లో దిగాలనిచెప్పేడు.

"మనదేశంలో చాలావూళ్లకి ఒక్క రైల్వేస్టేషనూ లేదని అఘోరిస్తుంటే, హైదరాబాద్ ఒక్కదానికీ రెండుస్టేషన్లు ఎందుకుకట్టేరు?" అన్నాడు పంతులు.

అందరూ నవ్వేశారు.

ట్రైను కదిలింది.

సెండాఫ్ యిచ్చేటప్పుడు అందరికళ్లూ చెమ్మగిల్లేయి. ఆచారాలు, సిద్ధాంతాలు, వాదనలూ, ప్రతివాదనల సంగతి ఎలావున్నా నర్సింపంతులు, కామేశ్వరమ్మ వున్న నెలరోజులూ మరపురాని వింతసమయంగా అందరూ భావించారు.

★ ★ ★

సికింద్రాబాద్ స్టేషన్లో ట్రైన్ ఆగింది. అంతకు ఓ గంటక్రితంనించి రాజేశ్వరి, ఆమె భర్త నారాయణరావు స్టేషన్లో వెయిట్‌చేస్తున్నారు.

ఎన్నో ఏళ్లతర్వాత తల్లిదండ్రుల్ని చూడగానే రాజేశ్వరి కళ్లల్లో నీళ్లు తిరిగేయి. అది స్టేషన్ అనికూడా చూడకుండా కూతుర్ని కౌగలించుకుని బావురుమంటూ ఏడ్చేసింది కామేశ్వరమ్మ.

నారాయణరావుకి వయసు యాభైమూడు దాటినా అంత వయసువాడిలా కనిపించడు. అందుక్కారణం అతని శరీరదారుఢ్యం మాత్రమేకాదు, కాస్త నెరిసిన జుత్తుకి డై చేయడంవల్ల జుత్తుకూడా నల్లగానే కనబడ్డం మరో కారణం. రాజేశ్వరికూడా పుష్టిగా, తెల్లగావుండి యిరవైఆరేళ్ల కొడుక్కి తల్లిలా కనిపించదు.

పోర్టర్లచేత సామాన్లు మోయించుకొచ్చి బయటనున్న కారులో పెట్టించేడు నారాయణరావు.

"కూర్చోండి" అన్నాడు పంతులుగారితో.





అతను కార్లో కూర్చోకుండా ఓసారి కారుచుట్టూ తిరిగి దాన్ని చేత్తోకొట్టిమరీ పరిశీలించి అడిగేడు.

"బాగుంది కారు... ఎంతఖరీదు చేస్తుందో?"

"రెండులక్షలైందండి"

ముసలాళ్లిద్దరూ ఆశ్చర్యపోయేరు. చలపతిరావు దగ్గరున్న కారు లక్షరూపాయలన్నాడు. ఇది దానికి రెట్టింపు ఖరీదు. కార్లో కూర్చున్నాక "మెల్లగాపోనియ్, వూరుచూస్తూ వెళ్దాం" అన్నాడు.

"మీరింకా ఉంటారుగా. ఊరంతా మీకు నిదానంగా చూపిస్తాను. ఇప్పుడు డైరక్టుగా యింటికి వెళ్లిపోదాం" అంటూ కారు స్టార్ట్‌చేసి ఏసీ ఆన్‌చేసేడు. చల్లగాలి తగిలేసరికి ముసలాళ్లిద్దరికీ కితకితలు పెట్టినట్టయింది.

"దీనికి చల్లగాలి వచ్చే సదుపాయం కూడా ఏర్పాటుచేశారన్నమాట. మా చలపతిగాడి కారుకి గాలి సదుపాయంలేదు" అన్నాడు పంతులు ఆ చల్లదనాన్ని అనుభవిస్తూ.

"ఈ సదుపాయంలేదుకాబట్టే ఆ కారు లక్షరూపాయలకొచ్చింది, దీనికీ సదుపాయం వుండబట్టే రెండులక్షలైంది" అంటూ కామేశ్వరమ్మ రేటు విషయం క్లారిఫైచేసింది.

నారాయణరావు జూబ్లీహిల్స్‌లో ఓ అధునాతనమైన బంగళాలో వుంటున్నాడు. చుట్టుపక్కలనున్న ఇళ్లుకూడా యిటీవల కట్టినవే, అన్నియిళ్లూ ధనవంతులవే కావడంతో, ఆ ప్రాంతమే ఎంతో మనోహరంగా కనిపిస్తోంది. బంగళా పోర్టికోలో కారుదిగి, బంగళా బయటినించి ఎలా కనబడుతుందోనని, గేటుదాటి బయటకెళ్లి చూసేడు.

"భేష్... బాగుంది బాగుంది" అంటూ లోపలకొచ్చేడు.

"గబగబా స్నానాలుచేస్తే వేడివేడి టిఫిను తిందురుగాని" అంటూ రాజేశ్వరి సామాన్లన్నీ సర్దించి కిచెన్‌వైపు నడిచింది. పంతులుగారు మాత్రం స్నానంకోసం తొందరపడకుండా, బంగళాలోని ప్రతీగది పరీక్షగా చూసేడు. గోడలు, గచ్చులు అన్నీ తడిమిచూసేక అల్లుణ్ణి హాల్లోకి పిలిచేడు.

"బంగళా మహాభేషుగ్గావుంది... దీని ఖరీదు ఎంతవుంటుందంటావ్?" అన్నాడు సోఫాలో కాలు మీద కాలు వేసుక్కూర్చుని.

"ఎంతైతేనేంలెండి... యిదేం మన సొంతంకాదుగా- కంపెనీవాళ్లు యిచ్చింది"

"ఎవరు యిచ్చేరనికాదు- ఒకవేళ ఎవడైనా యిలాంటి బంగళా కట్టించాలనుకుంటే ఎన్ని లక్షలవుతుందీ అని? ఓ మూడు నాలుగు లక్షలవుతుందా?"

నారాయణరావు ఫక్కుమంటూ నవ్వేడు. "భలేవారండి... మూడు నాలుగు లక్షలకి యీ బంగళాకాదుగదా దీన్నికట్టిన యీస్థలంకూడా రాదు, ఎంతలేదన్నా ఓ ముప్పైలక్షలుంటుంది"

పంతులుగారికి కాస్సేపటివరకూ నోటంట మాటరాలేదు. అతని మనవడు రాజేష్ తన గదిలోనించి బి.పి. ఏపరేటస్ పట్టుకుని అక్కడికొస్తూనే తాతగార్ని పలకరించేడు. ఎప్పుడో అతని చిన్నతనంలో చూసేడుకాబట్టి పొడవుగా, పుష్టిగా ఎదిగిన మనవణ్ణి చూసి ముందు ఆశ్చర్యపోయేడు, తర్వాత ఆనందంతో పొంగిపోయేడు.

రాజేష్ యమ్మెస్ పాసై ఓ ప్రైవేట్ హాస్పిటల్లో సర్జన్‌గా పనిచేస్తున్నాడు. నారాయణరావు చేతికి క్లాత్‌చుట్టి, బి.పి చూస్తుంటే పంతులుగారికది సరదా అయిన ఆటలా కనిపించింది.

"ఫర్వాలేదు డాడీ... నార్మల్‌కి కాస్త ఎక్కువగా ఉంది. నేనిచ్చిన టాబ్లెట్స్ కంటిన్యూ చెయ్యండి, కాకపోతే మునుపట్లా హండ్రెడ్ యమ్.జి అక్కర్లేదు. ఫిఫ్టీ వేస్కోండి" అన్నాడు రాజేష్ ఏపరేటస్‌ని పేక్‌చేస్తూ.

ఆ మిషను ఏమిటో అడిగి తెల్సుకున్నాక "నీకింత చిన్నవయసులోనే రక్తపోటు వచ్చిందేవిట్రా" అన్నాడు అల్లుడితో. అతను చిన్నగా నవ్వి, జేబులోంచి సిగరెట్ పేకెట్ తీసి సిగరెట్ వెలిగించేడు.

"నీకు సిగరెట్లు కూడా అలవాటయ్యేయా?"

ఈ ప్రశ్నకి జవాబు యివ్వకుండా లేచి, తన గదిలోకి వెళ్ళిపోయేడు.



"ఇంత చిన్నవయసులో మీనాన్నకీ రక్తపోటే విట్రా?" అన్నాడు మనవడితో.

"మా డాడీ మీకంటే చిన్నవాడు కావచ్చు గాని వయసుకి మాత్రం చిన్నవాడుకాదుగా! యాభై నాలుగు నడుస్తోంది. ఆ వయసులో చాలామందికి రక్తపోటు వస్తుంది"

"అలాగా- అయితే నా వయసు డెబ్బై ఎనిమిదిగదా. నా రక్తం ఎంతపోటులో పరుగెడుతుందో ఓసారి చూడరా"

రాజేష్ అతని బి.పి చెకప్ చేశాడు. "క్వయిట్ నార్మల్ తాతయ్యా! మామూలుగా వుండాల్సిన నూట యిరవై బై ఎనభయ్యే వుంది. అంటే నీ ఆరోగ్యం ఉక్కుముక్కన్నమాట" అంటూ నవ్వుతూ తన గదిలోకి వెళ్ళిపోయాడు. పంతులుగారి ఆనందం మరీ ఎక్కువైంది.

స్నానాలు ముగించి, టిఫినుకోసం డైనింగ్ టేబిల్ దగ్గరకొచ్చాడు నేలమీద కూర్చోడమా? లేక కుర్చీమీద కూర్చోవడమా అని ఓ క్షణంపాటు ఆలోచించి, ఏమైతే అయిందని కుర్చీమీదే కూర్చున్నాడు. నారాయణరావు రెండంటే రెండే బ్రెడ్ స్లయిస్ తిని, కాఫీ తాగి, టిఫిను చేశాననిపించేడు. అదేవిటని అడిగితే "ఆరో

గ్యానికింతకంటే తినడం మంచిదికాదని, మీ మనవడే చెప్పేడు. సాధారణంగా నలభై దాటాక కాస్త డైట్ కంట్రోల్ చేస్తే మంచిది కదా'' అంటూ నారాయణరావు ఆఫీసుకెళ్ళిపోయేడు.

ఏభయ్యేళ్ళు దాటేసరికి రెండురొట్టెముక్కలు ఫలహారం చాలనుకుంటే, తనకున్న డెబ్భై ఎనిమిదేళ్ళ వయసుకి ఏమీ తినకూడదంటాడేమో అనుకుంటూనే నాలుగు పెసరట్లు, ఆరుఇడ్లీ, రెండు పూరీ తిని రెండుగ్లాసుల పాలు తాగేడు.

ఆరాత్రి ముసలాళ్ళిద్దరూ భోజనాలు చేసి, వాళ్ళకి కేటాయించిన గదిలోకి వెళ్ళేక రాజేశ్వరి పనులన్నీ ముగించి తన గదిలోకి వెళ్ళింది.

''మీ ఆదిదంపతులు నిద్రపోయేరా?'' చిన్నగా నవ్వుతూ అడిగేడు నారాయణరావు.

''ఏం... వాళ్ళు మీ కంటికి ఆదిదంపతుల్లా కనిపిస్తున్నారా?'' అంటూ చీరవిప్పి నైటీ తొడుక్కుంది.

''వాళ్ళు ఆదిదంపతులు కాదు, నిజం చెప్పాలంటే రాతి దంపతులనాలి! ఈ వయసులో వాళ్ళ ఆరోగ్యం ఏవిటి? వాళ్ల తిండి ఏవిటి? వాళ్ళని చూస్తుంటే ఫలానా వయసులో యిది తినకూడదు, అది తినకూడదని చెప్పే వైద్య గ్రంథాలన్నీ తిరగరాయాలని పిస్తోంది'' అంటూ తలుపు గడియపెట్టి బీరువాలోంచి స్కాచ్‌విస్కీ తీసి గ్లాసులో పోసుకున్నాడు.

''ఏం... మీరు ఇంతవరకూ తీసుకోలేదా?'' అంటూ వాచీ చూసుకుంటూ ఫ్రిజ్‌లోంచి ఐస్‌క్యూబ్స్, సోడా తీసి టీపాయ్‌మీద పెట్టింది.

''ఎలా తీస్కోమంటావ్! నా అలవాటు ప్రకారం నైట్ ఎనిమిది గంటలకి స్టార్ట్ చేసి తొమ్మిది గంటలకల్లా త్రీ రౌండ్సు పూర్తి చేసి టిఫిను చెయ్యాలి. కానీ, మీ నాన్నగారు అడుగుతున్న ప్రశ్నలు వింటుంటే డ్రింక్ తీసుకుని డైనింగ్ టేబిల్ దగ్గరకి రావడానికే భయమేసింది?''

''ఏం అడిగేడు?'' అంటూ ఆమె గ్లాసులో విస్కీ వేసి, ఐస్‌క్యూబ్స్, సోడా పోసి అతనికి గ్లాసు అందించింది.

''ఇందాక నేను సిగరెట్ కాలుస్తుంటే నీకీ అలవాటు ఎప్పట్నుంచీ అని అడిగేడు, అలాంటిదీ డ్రింకు చూస్తే యింకెన్ని ప్రశ్నలడుగుతాడంటావ్? పైగా యింత చిన్నవయసులో రక్తపోటు ఏవిట్రా అని ఆశ్చర్యపోయేడు. ఉదయం రెండు బ్రెడ్ పీసెస్ తినేసరికి నీ తిండి యింతేనట్రా అన్నాడు. ఇప్పుడు మళ్లీ ఆ మాట ఎందుకనిపించుకోవాలని అక్కడకి రాలేదు.''

అతని మాటల్లో పరిహాసంకంటే మావయ్యగారిపట్ల గౌరవమర్యాదలే వ్యక్తమయ్యేయి.

★ ★ ★

నారాయణరావు అమెరికాలో విద్యాభ్యాసం చేసి హైదరాబాదులో ఉద్యోగం చేయడంవల్ల అతని ఆలోచనలు, అలవాట్లు, అభిరుచులన్నీ రిచ్‌గానూ, వర్తమానంకంటే కాస్త ఎడ్వాన్స్‌గానే వుంటాయి. మూఢనమ్మకాల్ని ఆచారం పేరుతో పెంచుకునే మూర్ఖత్వాన్ని అతను ఏనాడో ద్వేషించడం ఆరంభించాడు. అతనికి అన్ని విధాలా తగిన భార్య రాజేశ్వరి. అతను తగు మోతాదులో మందు తాగుతాడు. ఆమెకే అలవాటులేదు. కానీ భర్తకి తనే డ్రింక్ సర్వ్ చేస్తుంది. అతను నాన్‌వెజ్ తింటాడు. ఆమె తినదు. వంట చేతకాకపోయినా అతనికేంకావాలో హొటల్నించి తెప్పిస్తుంది. ఒకరియిష్టాలు మరొకరికి అయిష్టాలు కానంతవరకూ మనలో మనం ఏమైనా చేస్కోవచ్చు అనే సిద్ధాంతాన్ని యిద్దరూ పాటించడంవల్ల ఆహార విహార విషయాల్లో ఎప్పుడూ వారి మధ్య తేడా రాలేదు.

అతను మెడలోంచి గాయత్రిని ఏనాడో తీసి పక్కన పెట్టేశాడు. ''ఇదేం దారుణంరా'' అంటూ వాళ్ళ బాబాయ్ జంధ్యం గురించి లెక్చరివ్వబోతే అతను వినిపించుకోలేదు.

''మెడలో యీ జంధ్యం పోగు లేకపోతే నేను బ్రాహ్మణ్ణి అనిపించుకోనా? బ్రాహ్మణ్ణని చెప్పుకోడానికిదొక్కటే నిదర్శనం అనుకుంటే, యిలాంటి పోగుల్ని మనవేకాదు యింకా చాలా కులాలవాళ్ళు వేస్కుంటున్నారుగా. ఉద్యోగాలు సంపాదించడంలోను, ప్రమోషన్లు సంపాదించడంలోనూ నేను ఫార్వర్డు క్లాస్ వాడినని




రెండుసార్లు వెనక్కి నెట్టేశారు. నేను బ్రాహ్మణ్ణని చెప్పుకోడానికీ అనుభవించాలు'' అంటూ నవ్వుతూ బాబాయ్‌కి జవాబు చెప్పేశాడు.

★ ★ ★

ఆ యింటికొచ్చిన రెండోరోజునాటికే తమ కూతురు, అల్లుడూ తమ కొడుకూ కోడలికంటే చాలా ఎడ్వాన్స్ అయిపోయేరని ముసలాళ్ళు గమనించేరు. అయితే యీ అభిప్రాయాన్ని నారాయణరావుకుండే అలవాట్లని, వాటిని రాజేశ్వరి కూడా ప్రోత్సహిస్తుందన్న విషయాన్నీ తెలుసుకోకుండానే ఏర్పరచుకున్నారు.

మూడోరోజున రాజేశ్వరి వారిద్దర్నీ కారులో గోల్కొండ, ఆ పరిసర ప్రాంతాలకి తీసుకెళ్ళి చూపించింది. రామదాసు బందిఖానా చూస్తూనే నర్సింహపంతులు కళ్ళంట నీళ్ళు పెట్టుకున్నాడు. రామదాసు కీర్తనలుగా చెలామణీ అయ్యే పాటలన్నీ యీ బందిఖానాలో వుండి పాడినవేనన్నమాట అనుకుంటూ అక్కడే బండమీద కూర్చుని, తనకి తెలిసిన రామదాసు కీర్తనలన్నీ తీరిగ్గా పాడి వినిపించేడు.

అతని గానం సంగతీ, గాత్రం సంగతీ ఎలా వున్నా అతనే రామదాసులా మారిపోయి, ఆ బాధననుభవిస్తూ పాడడం కామేశ్వరమ్మకి, రాజేశ్వరికి ఓ వింత అనుభూతిలా తోచింది. కొండ దిగుతూ- ''యిప్పటికే యీ ప్రాంతమంతా శిలామయంగా వుంటే అప్పుడు రామదాసు బందీగా వున్నప్పుడు యింకెంత బీభత్సంగా వుండేదోకదా'' అనుకున్నాడు.

తర్వాత కోట దగ్గరకెళ్ళేరు. కోటంతా తడిమి తడిమి చూశాడు. ''పాపం... కరెంటులేని రోజుల్లో యీ కోటలో ఆ రాజులు, వారి సిబ్బంది ఎంత యిబ్బంది పడి బతికారోగదా'' అనుకుంటూ చాలాసేపు వాళ్ళమీద జాలిపడిపోయేడు. ఆ సాయంకాలం యింటికి తిరిగొచ్చేక అల్లుణ్ణీ, మనవణ్ణి పిల్చి ''మీరు రామదాసు బందిఖానా యిప్పటికో వందసార్లు చూసి ఉంటారు...'' అంటూ ఏవో ప్రశ్నలు అడగబోయేడు, కానీ తండ్రీ కొడుకులిద్దరూ ఫక్కుమంటూ నవ్వేశారు.

''నిజం చెప్పాలంటే తాతయ్యా- నేనుగాని, డాడీగాని ఆ బందిఖానాని ఒక్కసారి కూడా చూడలేదంటే నమ్ము'' అన్నాడు రాజేష్.

''అదేవిట్రా... యిన్ని సంవత్సరాలనుంచీ యీ వూర్లోనే వుంటూ ఒక్కసారి కూడా ఆ బందిఖానాని చూడకపోవడం ఏవిటి? నాతో హాస్యాలాడుతున్నారా?'' అంటూ వారిద్దరిమీద కోపగించుకోబోయి అంతలోనే తమాయించుకున్నాడు.

రాజేశ్వరి అక్కడికొచ్చి కూర్చుంది. తండ్రికి కలిగిన ఆశ్చర్యానికి ఆమె జవాబు చెప్పింది. ''అంతే నాన్నా... వూళ్ళో వున్న ఏ విశేషమైనా బయట్నించి వచ్చేవాళ్ళు చూసినంత ఆసక్తిగా ఆ వూర్లో వున్నవాళ్ళు చూడరు. చూడాలనే అనుకుంటారు. కానీ, అంతలోనే ఎప్పుడైనా చూడొచ్చుకదాన్న బద్ధకం వచ్చేస్తుంది. నేను కూడా ఆ బందిఖానా చూడ్డం యిది రెండోసారి. ఆ మధ్యెప్పుడో నాలుగేళ్ల క్రితం మా లేడీస్ క్లబ్‌వాళ్లం అక్కడికి పిక్నిక్కుకెళ్లినప్పుడు చూసేను, మళ్ళీ మీతోనే వెళ్లడం''

ఆమె చెప్పిన సమాధానం, వాళ్ళు చరిత్రాత్మక స్థలాన్ని చూసే విషయంలో చూపించే అనాసక్తి పంతులుగారికి నచ్చలేదు. ఆ విషయమై కొంత చర్చ జరిగాక నారాయణరావు నవ్వుతూనే మావగారికో చురక అంటించేడు. ''మేం వూర్లో వుండి గోల్కొండ వగైరా వగైరా చూడకపోవడం తప్పే అనుకోండి. కానీ మీరు కాశీవెళ్లి గంగాస్నానం చేద్దామని ఎప్పట్నించి అనుకుంటున్నారు? మీ అమ్మాయి పుట్టక ముందు నించీ అనుకుంటున్నారని ఆవిడే చెప్పింది. మరి ఇన్ని దశాబ్దాలపాటు ఎందుకు మీరు కాశీ వెళ్లలేకపోయేరో చెప్పండి''

పంతులుగారికి పచ్చివెలక్కాయ గొంతులో పడినట్టయింది. జవాబు చెప్పలేక ముసి ముసిగా నవ్వేడు.

''పనుల ఒత్తిడి వల్లనో సావకాశం లేకపోవడంవల్లనో వూరు కదల్లేకపోయేమని మీరు జవాబు చెప్పొచ్చు. కానీ మనసుంటే మార్గం వుంటుందిగా'' నారాయణరావు మావగారితో యిలాగే కాస్సేపు మాట్లాడి, విస్కీ తాగే టైము అయిపోవడంతో తన గదిలో దూరి తలుపులు మూసుకున్నాడు. ఇంకా అక్కడ మాట్లాడ్డానికి మిగిలింది మనవడూ, కూతురే.

''ఇంకా యీవూరి విశేషాలేవిటమ్మా? అన్నా

డు కూతురితో.

"రేపు సాలార్‌జంగ్ మ్యూజియమ్, ఎల్లుండి బిర్లా టెంపుల్ చూసేక తర్వాత మిగతా వివరాలు సావధానంగా చెప్తాను. ముందు భోజనానికి లేవండి" అంటూ వారిని భోజనాలకి లేవదీసింది.

భోజనాలు చేస్తూ విశాఖపట్నంలో కోడల్ని అడిగిన ప్రశ్నే యిక్కడ కూతుర్నీ అడిగేడు "ఈ వీధిలో ఎంతమంది వుంటున్నారు, వాళ్ల వివరాలేవిటి? అందులో మన వర్ణంవాళ్ళు ఎంతమంది?"

రాజేశ్వరి చిన్నగా కాదు పెద్దగా నవ్వింది- "ఆ వివరాలన్నీ తెల్సుకోవాలంటే జనాభా లెక్కల లిస్టు చూడాల్సిందే తప్ప నాకు అంతగా తెలీదు. ఏదో కొద్దిమందితో పరిచయం వున్నా మిగతావాళ్లంతా ఎవరిదారి వాళ్లదే"

పంతులుగారు భోంచేస్తూ తల ఆడించి- "వూఁ...పట్నవాసం అంటే ఒకేచోట వుంటూ ఒకర్నొకరు తెల్సుకోకుండా, కల్సుకోకుండా బతుకుతారని ఇక్కడ నీవూ, అక్కడ మీ వదినా నిర్వచనాలు యిస్తున్నారన్నమాట" అన్నాడు.

"అలాఎందుకనుకోవాలి? మేం తెల్సుకోవాల్సినవాళ్ల గురించి తెల్సుకుంటున్నాం, కల్సుకోవల్సినవాళ్లని కలుసుకుంటున్నాం. కాకపోతే ఈ ఏరియాలోవుండేవాళ్లతో మాకు పెద్ద పరిచయాల్లేవు. అది మానేరంకాదు. మమ్మల్ని కల్సుకోకుండా వుండటం వాళ్లతప్పూకాదు. ఈ పెద్ద పెద్ద నగరాల్లో అందరిదీ చాలా బిజీలైపు నాన్నా! ఎవరి అవసరాలు వాళ్లచేత పరుగులు తీయిస్తూ పనులు చేయిస్తున్నాయి"

ఆ సంభాషణ అంతటితో ఆగిపోయింది. భోజనం చేశాక మేడమీదకెళ్తూ- "మీ ఆయనేం చేస్తున్నాడు గదిలో?" అన్నాడు.

"ఏంనాన్నా... ఏంకావాలి?"

"మరేంలేదు... మీరు వుండడానికింత బంగాళాయిచ్చి, యిన్ని సదుపాయాలు సమకూర్చిన ఆ కంపెనీ యింకెంత గొప్పగా వుంటుందోననిపిస్తోంది. రేపొకసారి అల్లుడితో కలిసివెళ్లి, ఆ వైభవం కూడా చూసొస్తాను! ఆ విషయం మాట్లాడదామనే..." అంటూ ఆ గది వైపు వెళ్లబోతుంటే అతనికి ఏంచెప్పి ఆవడమా అని రాజేశ్వరి కంగారుపడింది. నారాయణరావు ఇప్పటికి తర్డురౌండ్లో వుంటారు. ఇప్పుడేం చెయ్యడం? ఆమె ఆత్రాన్ని రాజేష్ అర్థంచేస్కుని తాతయ్యని ఆపుచేసి, నవ్వుతూ మాట్లాడుతూ తన గదిలోకి తీసుకువెళ్లేడు.

"నాన్నగారి ఆఫీసేం చూస్తావు తాతయ్యా! యిక్కడున్నది బ్రాంచిఆఫీస్‌కదా! అంచేత ఆ ఆఫీసంతా కలిసి మన బంగళా అంతకూడా వుండదు. వాళ్ల హెడ్డాఫీసు బాంబేలోవుంది. దాన్నిచూస్తే, నీ సరదా తీరుతుంది. అంచేత రేపు నువ్వు నాతోపాటు, మా హాస్పిటల్‌కొచ్చేవనుకో నువ్వేనాడూ కనీ వినీఎరగని మిషిన్లు చూపిస్తాను" అంటూ కొన్ని ఆధునికపరికరాలు, వాటితో ఏవేంచెయ్యొచ్చో వివరించేసరికి నర్సింపంతులుకి ఆసుపత్రి చూడాలనే ఆసక్తి పెరిగింది. మర్నాడు,మనవడితోపాటు హాస్పిటల్‌కెళ్లడానికే నిర్ణయించుకున్నాడు.



**హా**స్పిటల్లో అధునాతనమైన ఎలక్ట్రానిక్ మెషినరీ అంతావుండటంవల్ల చాలా హాస్పిటల్స్‌కిలేని డిమాండ్ ఈ హాస్పిటల్‌కి ఏర్పడింది. స్కేనింగ్ ఎలాచేస్తారో, ఈసీజీఎలా తీస్తారో, అన్ని పరికరాల్నీ చూపించి రోగ నిర్ధారణచెయ్యడానికి అవన్నీ ఎలా వుపయోగపడతాయో వివరించేడు రాజేష్. అన్నీ చూసేక, అంతా విన్నాక నర్సింపంతులు పెదవి విరిచేడు.

"అదేఁవిటి తాతయ్యా, అలా పెదవి విరిచేవు? ఏం, నీకు యివన్నీ నచ్చలేదా?"

"నచ్చకపోవడంకాదురా! యింతవరకూ

# గుర్తుంచుకోండి, పోషణనిచ్చే సమపాళ్ళలోని ఆహారాన్నివ్వకపోతే జరిగేదిది-మీ పాప విటమిన్, మినరల్ వీటి లోపానికి గురికావచ్చు.

## "అందుకే నేను మా పాపకు సెరిలాక్ యిస్తాను."

విటమిన్‌లు, మినరల్స్ సమపాళ్ళలో ఉన్నట్లయితే పోషక పదార్థాలను హరించుకొనడంలో తోడ్పడతాయని మీకు తెలుసా. ఇది, మీ పాపాయి కొరతకు గురి కాకుండా చూస్తుంది.

మీ డాక్టర్‌ని అడగండి. ఈ విటమిన్‌లనూ, మినరల్స్‌నూ పొందేందుకు పోషణ రూపేణా సమతూకంలోని ఆహారమే ఉత్తమ మార్గమని మీ డాక్టర్ చెబుతారు. అటువంటి సమతూకమైన పోషకాహారంలో ప్రొటీన్లూ, కార్బొహైడ్రేట్లూ, కొవ్వుపదార్థాలు, ఇనుము, కాల్షియం కూడ సరైన పాళ్ళల్లో ఉంటాయి-ప్రతిసారి ఆహారం యిచ్చినప్పుడు, ప్రతి రోజు క్రమం తప్పకుండా రోజు రోజూ లభించాలి.

చాలా మంది తల్లులకు మామూలుగా పారంపర్యంగా యిచ్చే ఆహారంతో యిలా సమతూక ఆహారం యివ్వడం సాధ్యం కాని పని.

దీనికి పరిష్కారం ?

సెరిలాక్. ఇది పాపాయిలకు యిచ్చేందుకు పోషణ రూపేణా సమతూకమైన ఘన ఆహారం వారికి నాలుగు నెలల నుంచి యిచ్చేందుకు.ఎందు కంటే, పిల్లలకు ఆ వయసు నుంచి పాలు ఒక్కటే చాలవు.

సెరిలాక్ ఎ,డి,సి,బి కాంప్లెక్స్ మరియు 'ఇ' విటమిన్లతో బలవర్థకం చేయబడింది. దీనిలో ప్రొటీన్లూ, కొవ్వు పదార్థలూ, కార్బొహైడ్రేట్లూ, ఇనుము, కాల్షియం కూడా ఉన్నాయి-అన్నీ మంచి సమపాళ్ళలో. దాని రుచి పిల్లలకు చాలా యిష్టం.

కాబట్టి, పోషణ నిచ్చే సమతూకంలోని సెరిలాక్ సమకూర్చే లాభాలన్నింటిని మీ పాపాయికి అందించండి. పాపాయికి 6 నెలలు రాగానే వీట్-ఆపిల్, వీట్-ఆరెంజ్, వీట్-వెజిటబుల్ యొక్క అదనపు ప్రయోజనాన్ని పాపాయికి సమకూర్చండి.

ప్యాక్ మీద యివ్వబడిన సూచనలను దయచేసి పాటించండి.

---

ఉచితం సెరిలాక్ బేబీ కేర్ బుక్

వ్రాయండి : సెరిలాక్, పోస్ట్ బ్యాగ్ నం. 21, న్యూ ఢిల్లీ-110 029

---

నెస్లె వారి నాణ్యమైన ఉత్పాదన




మీ పాపాయికి అందించండి సెరిలాక్ లాభం.

Mudra:D:NES:0019:TEL

ఇంగ్లీషు వైద్యం చదువుకున్న డాక్టర్లు చాలా మేధావులు, గొప్పవాళ్లూ అన్న భ్రమలో వున్నాను, కానీ - మేధావులు మీరుకార్రా! ఇదిగో యీ మిషిన్లుని కనిపెట్టిన వాళ్లున్నారే, వాళ్లు గొప్ప వాళ్లురా! అద్దంలో ముఖం చూస్కున్నట్టు, ఒంట్లో ఎక్కడ ఏ జబ్బున్నాయీ మిషిన్లు స్పష్టంగా చూపించేస్తుంటే, యింకా మీ తెలివి తేటల్తో పనేంవుందిరా నా బొంద''

తనని అంత తేలిగ్గాతీసిపారేసినందుకు రాజేష్‌కి కాస్త బాధకలిగింది.

''అవి చూపిస్తే మాత్రం, దాంతో జబ్బున యమైపోతుందా? దానికి ఏ మందులువాడాలో, లేక ఆపరేషన్ చెయ్యాలో చెప్పవలసిన వాళ్లం, చెయ్యవలసినవాళ్లం మేంవేగా'' అంటూ లోకంలోని డాక్టర్లందరి తరపునా ప్రాధేయపడుతున్నట్టుగా అడిగేడు.

ఇద్దరూ ఓ రూమ్‌లోకొచ్చి కూర్చున్నారు. రాజేష్ చెప్పిందాంతో పంతులుగారు సంతృప్తి పడలేదు. మనవడు వైద్యం విషయంలో తెల్సుకోవలసిన ఇంకొన్ని విషయాల్ని తనే చెప్తున్నట్టుగా పోజుపెట్టి మాట్లాడేడు. ''చూడరా డాక్టరూ! వైద్యంలో ప్రధానంగా రెండుభాగాలున్నాయి. ఒకటి పేషెంటుకొచ్చిన రోగం ఏవిటో నిర్ధారించడం! రెండు, నిర్ధారించిన రోగానికి సరైన మందులిచ్చి బాగుచేయడం- అంతేకదా?''

''అంతేలే''

''అంతేలే అంటూ నీరసంగా చెప్పకు! అంతే అని నాకూ తెల్సు! నేనూ చిన్నచిన్న రోగాలకి ఆయుర్వేదం మందులు ఇస్తుండేవాణ్ని. కావాలంటే, మా చింతలగ్రహారం వెళ్లి వెంకట్రాజుగార్ని అడుగు. ఇంగ్లీషు వైద్యంలో నేకాదు, ఏ వైద్యంలోనైనా ఈ రెండుభాగాలే ముఖ్యమైనవి. మరిప్పుడువచ్చిన మెషిన్లు, మెదళ్లోని నరాల్ని చూపించేస్తోంది, గుండెకి రక్తం ఎలావెళ్తోందో చూపించేస్తున్నాయి, కాలేయం ఎలావుందో చూపించేస్తున్నాడు. ఇలా ప్రతి పార్టునీ అద్దంలో బొమ్మలాగ చూపించేస్తోంటే, ఆ పార్టుకొచ్చిన రోగం ఏవిటో తెల్సుకోవడం కష్టమా? తెల్సుకున్నాక, ఆ రోగానికి తగిన మందు యివ్వడం బ్రహ్మవిద్యా? నువ్వేన్ని చెప్పరా, డాక్టరు తాలూకు సగం పనంతా ఆ మెషిన్లే చేసేస్తున్నాయి. ఒప్పుకుంటారా? లేదా?''

రాజేష్ వెంటనే జవాబు చెప్పలేకపోయేడు.. ఆ మెషిన్లు సగం పనిచేస్తున్నాయని ఆయనంటున్నాడు కాబట్టి, ఔను అని ఒప్పేసుకుంటే కొంత గొడవ వదిలిపోతుందనుకుని, ఒప్పేస్కున్నాడు. అయితే అలా ఒప్పుకోవడంవల్ల రాజేష్‌కేం మేలు జరగలేదు. ''అసలు యీనాటి డాక్టర్లూ ఓ డాక్టర్లేనట్రా'' అంటూ ఏదో లెక్చరు యివ్వబోతుంటే ప్యూను హడావిడిగా వచ్చి ''సి.యమ్.ఒగారు రమ్మంటున్నారుసార్'' అన్నాడు.

తాతయ్యని అక్కడే కూర్చోమని చెప్పి రాజేష్ చీఫ్‌మెడికల్ ఆఫీసర్ రూమ్‌లోకి వెళ్లేడు. ఆయన ఎఫ్.ఆర్.సి.యస్. సర్జను. ఆపరేషన్స్ చేయడంలో ఆయన ప్రవీణుడని మిగతా సర్జన్లే సవినయంగా సంతోషంగా ఒప్పుకుంటారు. ఆయనదో పెర్సనల్ పనిమీద శెలవుపెట్టి వెళ్తూ ఓ ఆపరేషన్ గురించి డిస్కస్ చెయ్యడానికి రాజేష్‌ని పిలిచేడు. ఇద్దరూ డిస్కషన్‌లో పడ్డారు.

పావుగంట గడిచినా రాజేష్ రాకపోయేసరికి హాస్పటలంతా ఓ రౌండుకొట్టి రావడానికి బయలుదేరేడు. కారిడార్‌లోనించి మెల్లగా నడుచుకుంటూ ఒక్కో గదిముందు తగిలించిఉన్న నేమ్ ప్లేటూ చూస్తూ వెళ్తున్నాడు. డాక్టర్ల పేర్లన్నీ ఇంగ్లీషులోనూ, హిందీలోనూ రాసివున్నాయ్‌తప్ప, తెలుగు అక్షరాలు ఎక్కడా కనబడలేదు. కారిడార్లో నడుచుకు వెళ్తున్న వార్డు బోయ్స్, మిగతా వర్కర్సు ఉర్దూలో మాట్లాడుకుంటూ, నవ్వుకుంటూ, మధ్యమధ్యలో అక్కడో తెలుగు ముక్క, అక్కడో తెలుగుముక్క మాట్లాడుతున్నారుగాని, వాళ్ల మాటల్లో ఎక్కడా తెలుగుదనం కనిపించలేదు. వారు మాట్లాడే తెలుగు కూడా నైజామ్‌యాసతో అస్తవ్యస్తంగా వుంది. పంతులుగారికీవ్యవహారం నచ్చలేదు. ఇది తెలుగు వాళ్ల రాజధాని నగరమై వుండికూడా ఇక్కడ కల్తీ తెలుగుతో బతకాలా? అని తనని తనే ప్రశ్నించుకున్నాడు.

అదే కారిడార్‌లో మరో చివర ఎవరో కార్మికుడు ఎవరిమీదో బిగ్గరగా కేకలు వేస్తున్నాడు.




అక్కడున్న ఎటెండర్ ఆ వ్యక్తిని దుర్భాషలాడుతూ, దూరంగా వెళ్లమని చెప్తున్నాడు. పంతులుగారు గబగబా అక్కడకి వెళ్లి విషయం అడిగి తెల్సుకున్నారు.

ఆ కార్మికుడి పేరు యాదగిరి. అతను ఫ్యాక్టరీలో పనిచేస్తున్నాడు. రెండు రోజుల్నించి తీవ్రంగా జ్వరం వస్తుంటే డ్యూటీకి శెలవు పెట్టి ట్రీట్మెంటు కోసం హాస్పటల్ కొచ్చేడు. ప్రస్తుతం డ్యూటీలోవున్న వాళ్ళంతా స్పెషలిస్టులే. అవుట్ పేషంట్సుని చూడ్డానికి యం.బి.బి.యస్ చదివిన మెడికల్ ఆఫీసర్సు నలుగురున్నారు. అందులో ఇద్దరు శెలవులో వుంటే, మిగతా ఇద్దరూ వరద బాధితులకి ఇమీడియట్ ట్రీట్మెంటు ఇవ్వడానికి గవర్నమెంటు డిమేండ్ మీద వరద ప్రాంతానికి వెళ్లడం జరిగింది. అంచేత మామూలు పేషంట్స్‌ని చూడ్డానికి మామూలు మెడికల్ ఆఫీసర్సు ఆరోజు ఎవరూ లేకపోవడం అనుకోకుండా జరిగిందే. యాదగిరి తన మెడికల్ రిజిస్టర్ పట్టుకుని తిన్నగా ఓ లేడీ డాక్టరు దగ్గరకెళ్ళిపోయేడు. ఆవిడ గైనకాలజిస్టు! "మీ ఆవిడకో, నీకూతురికో గర్భం వచ్చినా, గర్భాశయరోగాలు వచ్చినా నేను ట్రీట్‌చేస్తానుగాని మగవాళ్లకి 'జ్వరాలు వచ్చినా, జబ్బులొచ్చినా నేనెంత మాత్రం ట్రీట్ చెయ్యనని చెప్పేసింది.

అదీ అక్కడ జరుగుతున్న గొడవ! ఆమె చెప్పిందాన్ని యాదగిరి సరిగా అర్ధంచేస్కోకుండా, ఆ మాటల్ని వక్రీకరిస్తూ ఆడాక్టరు మీద కేకలు వేశాడు. "రాత్రింబగళ్ళూ రెక్కలు ముక్కలు చేస్కుని ఫ్యాక్టరీలో పనిచేసే మాకంటే, ఇంట్లో వుండే నాపెళ్ళాం, నా కూతురు మీకు ఎక్కువైపోయేరా? ఆడోళ్ళకి చేసే వైద్యం, మా మగోళ్లకెందుకు చెయ్యరు? ఈ లేడీ డాక్టరుమీద యూనియన్‌కి కాగితం తగిలించేస్తాను" అంటూ వరండాలో నిలబడి అరుస్తున్నాడు.

అక్కడున్న ఎటెండరు మాటల్నిబట్టి యాదగిరి మనస్తత్వం గురించి నర్సిం పంతులుకొద్దిగా తెల్సుకున్నాడు. అతన్నంతా అక్కడ యూనియన్ యాదగిరీ అనే పిలుస్తారట. తీరా చూస్తే అతనా యూనియన్లో ఏ చిన్న పోస్టులో నూలేడట. కానీ ఎవరిమీద కోపంవచ్చినా యూనియన్ నుంచి కాగితం తగించిలిచి వాళ్ల అంతు తేలుస్తానని బెదిరిస్తాడట! ఫ్యాక్టరీలోని మనుషులమీదేకాదు- చివరకోసారి చీఫ్ మినిస్టర్ ఏదో పనిమీద అటుగా వస్తే, ఫ్యాక్టరీ యాజమాన్యంమీద ఓ కంప్లయింట్ రాసి, జనాన్ని తప్పించుకుంటూ వెళ్లి ఆయనకి అందించేడట. ఆయన యధాలాపంగా ఆ కాగితాన్ని తన సెక్రెటరీకి అందించేడు. తను చేసిన కంప్లయింట్‌వల్ల చీఫ్ మినిస్టరు వారం తిరక్కముందే ఆ సంస్థ ఛైర్మన్ని దించేసి, ఏవాచ్‌మెన్ పోస్టులోనో నిలబెట్టేస్తాడని భావించిన యాదగిరికి నెలతిరిగినా ఎటువంటి చర్యా ముఖ్యమంత్రినించి కనబడలేదు. అంతే ముఖ్యమంత్రి తలబిరును గురించి మళ్ళీ నాలుగు పేజీల ఉత్తరం రాసి గవర్నరుకి రిజిస్టర్ పోస్టులో పంపించేడట. ఉత్తరం అందిన రెండోరోజుకల్లాపాత, గవర్నమెంటు పడిపోయి కొత్త గవర్నమెంటు రూలింగ్‌లో కొచ్చేస్తుందని ఆశగా ఎదురుచూసేడుగాని అదీ జరక్కపోయేసరికి తన ఫ్యాక్టరీ ఛైర్మన్ దగ్గర్నించి రాష్ట్ర గవర్నరుదాకా అందర్నీ తిట్టడం ఓ పనిగా పెట్టుకున్నాడట.

యాదగిరి గురించి ఆ మాత్రం విన్నాక నర్సింపంతులికి అతనిమీద కోపం రాలేదు. జాలికలిగింది, ఆకాశంమీదకి రాయివిసిరి సూర్య భగవానుడి నెత్తి పగలగొడదామనుకునే వాళ్లంటే ఎవరికైనా జాలికలగడం సహజం! యాదగిరి ఒళ్ళు ముట్టుకుని చూసేడు. వేడిగా నేఉంది.

"మరో డాక్టరు దగ్గరకెళ్లాం రారా వెధవా" అంటూ మరో రూమ్‌లోకి తీసుకువెళ్ళాడు.

అది స్కిన్‌స్పెషలిస్టు రూమ్. అతను చర్మవ్యాధులకి తప్ప మరో వ్యాధికి వైద్యం చెయ్యడు. ఇంటికి తీసుకెళ్ళి ఫీజు ఇచ్చి ట్రీట్మెంటు చెయ్యమంటే చేస్తాడేమోగాని, ఇక్కడ డ్యూటీ చేస్తున్నప్పుడు మాత్రం చర్మవ్యాధులకి మాత్రమే వైద్యం చేస్తాడు. డ్యూటీ రూల్సు ప్రకారమే తను నడుచుకుంటానంటాడు. అతనేకాదు, ఇప్పుడా హాస్పటల్లో పనిచేస్తున్న డాక్టర్లంతా వర్క్‌టురూల్ అన్న సిద్ధాంత ప్రకారం తమ డ్యూటీలు మాత్రమే తాము చేస్తాంతప్ప, అదనపు బాధ్యతల్ని మేం ఒప్పుకోం అని తీర్మానించుకున్నారు. అందుక్కారణం గత

పదిరోజుల్నించి సంస్థ యాజమాన్యానికి డాక్టర్స్‌కి మధ్య జీతాల విషయంలో రగడ జరుగుతుండటమే.

యాదగిరిని కూర్చోమనిచెప్పి- "ఏవిటయ్యా నీజబ్బు" అన్నాడు చాలా యధాలాపంగా.

"రెండురోజుల్నించి జ్వరం దంచేస్తున్నదండి. నా కొచ్చిన జ్వరాన్ని పదిమందికి పంచొచ్చుబాబూ"

"బయటకెళ్లి పంచుకో లేదా నువ్వొక్కడివే వుంచుకో! అంతేగాని జ్వరానికి నేనువైద్యం చెయ్యను"

"ఎందుకు చెయ్యరండి! మీరు డాక్టర్లు కారా? మీకు జీతాలు ఇవ్వరా?"

"ఆర్గ్యుమెంటొద్దు. నేను చర్మవ్యాధుల్ని మాత్రమే చూస్తాను. నీ ఒంటిమీద మచ్చలుంటే చెప్పు చూస్తాను. మరే చర్మవ్యాధి వున్నా చెప్పు చూస్తాను. కనీసం రెండు కురుపులన్నా లేకపోతే నా దగ్గరకి రావడం వేస్టే. నా టైము వేస్టు చెయ్యకుండా వెళ్లవయ్యా" అంటూ స్కిన్‌స్పెషలిస్టు కసురుకున్నాడు.

యాదగిరి లేచి అరుపులు లంకించుకున్నాడు. "మీ మీద యూనియన్‌కి కాగితం తగిలించి, మీ సంగతి తేల్చకపోతే నా పేరు యాదగిరే కాదు" అంటూ శపధాలు పలుకుతుంటే, నర్సింపంతులు అతని భుజం తట్టి అపుచేసి డాక్టరుతో అన్నాడు-

"మీరు చర్మవ్యాధి నిపుణులే, ఒప్పుకుంటాను. కానీ వీడికి జ్వరం వచ్చింది కూడా చర్మానికేగదా! అలాంటప్పుడు వైద్యం చెయ్యడానికేం?"

నర్సింపంతులు తీసిన రీజనింగ్‌కి డాక్టరు చిర్రుబుర్రులాడిపోయేడు. ఒళ్లంతా చీడపట్టేసిన పేషెంటులా బాధపడిపోయి- "ఆర్గ్యుమెంటు అనవసరం. ముందీ పేషెంటుని తీసుకుని బయటకి నడవండి" అంటూ గద్దించాడు.

"నడవండీ అని చెప్పడానికి నేనేం అవ్వాయి తువ్వాయిగాణ్ణికాదురా! నా మనవడూ డాక్టర్! ఈ ఆసుపత్రిలో పనిచేస్తున్న రాజేష్ ఎవడనుకున్నావురా? స్వయాన నా కూతురి కొడుకు" పంతులుగారూ గట్టిగానే అరిచేడు.

"అయితే మీ మనవడి దగ్గరకే తీసుకెళ్లి ఆపరేషన్ చేయించండి"

"అలాగే చేయిస్తాం, అవసరమైతే అలాగే చేయిస్తాం" అంటూ యాదగిరిని తీసుకుని బైటకొచ్చి, రాజేష్ వుండే రూముదగ్గర కొచ్చేడు, అతను రూమ్‌లో లేడు. ప్యూన్‌ని అడిగితే, రాజేష్ ఆపరేషన్ థియేటర్లో వున్నాడని, మరో రెండుగంటల దాకా రాకపోవచ్చని చెప్పేడు.

ఈలోగా మరో డాక్టరు చేత యాదగిరికి వైద్యం చేయించొచ్చుకదాని మరో డాక్టరు రూమ్‌లోకి ప్రవేశించేడు.

అది చిల్డ్రన్స్ స్పెషలిస్టురూం.

"మీ పిల్లలేరీ?" అన్నాడు డాక్టరు యాదగిరిని చూస్తూ.

"పెద్దోడు డ్యూటీకెల్లిపోయేడండి; చిన్నోడి సంగతి తెలీనిదేంవుందండి. వద్దు వద్దంటున్నా వినకుండా ఆ రహీముగాడి చెల్లెల్ని లేపుకుని రాజమండ్రి ఎల్లిపోయేడుగదా" అంటూ కళ్లు ఒత్తుకున్నాడు యాదగిరి.

ఆ డాక్టరు ఎవరో గతంలో పరిచయం లేకపోయినా తన కుటుంబ సమాచారం అడగ్గానే అతని మీద బోలెడంత గౌరవం ఏర్పడిపోయింది. డాక్టర్లంటే యిలా వుండాలి అనుకున్నాడు కానీ, డాక్టరు మాత్రం అలా అనుకోలేదు.

"నీ అబ్బాయి ఎవర్ని లేపుకుపోయి ఎక్కడ కాపురంపెడితే నా కెందుకయ్యా? నువ్వు ఎవరైనా చిన్నపిల్లల్ని ట్రీట్‌మెంటుకు తెచ్చేవా అని అడుగుతున్నాను, నీకింకెవరూ చిన్నపిల్లలు లేరా?" అన్నాడు చిరాగ్గా.

"ఇప్పుడు నా వయసు యాభైఆరుబాబూ. ఇప్పుడేం పిల్లలు పుడతారు. పుట్టినా నలుగుర్లోనూ మా ఆవిడకి సిగ్గుగా వుంటాదండి"

డాక్టరు చర్రుమంటూ లేవబోయి తమాయించుకున్నాడు.

"చూడవయ్యా... నేను చిల్డ్రన్స్ స్పెషలిస్టుని, అంటే చంటిపిల్లలకొచ్చే జబ్బుల్ని మాత్రమే నయంచేస్తాను. నువ్వు ఇక్కడకెందుకొచ్చేవు?"





"నాకు రెండురోజుల్నించి జ్వరవండి. కళ్లు గిర్రున తిరిగిపోతున్నాయి"

"కళ్లేగాదు... నీ ఒళ్ళంతా తిరిగిపోయినా సరే నేను చిన్నపిల్లలకే వైద్యం చేస్తాను తప్ప, పెద్దవాళ్లకొచ్చే జ్వరాలకి కాదు. నా టైము వేస్టు చెయ్యకుండా బయటకి వెళ్లండి" అంటూ డాక్టరు నెక్స్ట్ పేషెంటుని పిలుస్తూ బెల్‌కొట్టేడు.

ఆ డాక్టరు మీద యూనియన్‌కి కాగితం తగిలించేస్తానని బెదిరిస్తూనే యాదగిరి బయటికి నడిచేడు. నర్సింపంతులు ఎందుకో ఇక్కడేం వాదనకి దిగలేదు.

తర్వాత వెళ్లింది ఇ.యన్.టి స్పెషలిస్టు దగ్గరికి, "చెవి, ముక్కు, గొంతు యీ మూడు పార్టులకీ ఏవైనా జబ్బువస్తే చెప్పండి, కళ్లజబ్బులైతే మాత్రం చెప్పకండి. కళ్ల డాక్టరుగారు వేరేవున్నారు" అంటూ పేషెంటుని చూడకుండానే ఆ డాక్టరుగారు కంఠతా పెట్టిన పద్యం అప్పజెప్పినట్టు అప్పగించాడు. అందుక్కారణం వుంది. చాలామంది పేషెంట్సు ఇ.యన్.టి అనగానే 'ఇ' అనే అక్షరానికి ఐస్ (కళ్లు) అనేఅర్థం చెప్పుకుని కళ్లజబ్బుల్తో ఆ డాక్టరు దగ్గరికి రావడం జరిగింది. రావడమేకాదు, నేను కళ్ల డాక్టర్ని కాదు మహాప్రభో అని చెప్పగానే చెవులపక్కనే కళ్లున్నాయి ముక్కుమీదనే కళ్లున్నాయి, మరలాంటప్పుడు చెవులకి, ముక్కుకి వైద్యంచేసి కళ్లని మాత్రం వదిలెయ్యడం న్యాయమా డాక్టరుగారూ అంటూ వాదించిన సందర్భాలున్నాయి.

యాదగిరి జ్వరం అనిచెప్పగానే, "నేనుకాదు నేనుకాదు, బైటకెళ్ళు బైటకెళ్లు"అని పంపించేశాడు.

తర్వాత హార్టు స్పెషలిస్టు, ఆ తర్వాత పళ్లడాక్టరు- ఇలా ఎంతమంది స్పెషలిస్టుల్ని చూసినా ప్రయోజనం లేకపోయింది జెనరల్ పేషెంట్సుని తాము ట్రీట్ చెయ్యమని ఖచ్చితంగా చెప్పేశారు. యాదగిరి వరండాలోకొచ్చేడు. అసలే అతను కోపిష్టి, గర్విష్టి యిప్పుడు రోగిష్టి. డాక్టర్ల సమాధానాల్తో వున్న కాస్త సహనం చచ్చిపోయి అందరిమీద యూనియన్‌కి కాగితాలు తగిలించేస్తానని కాగితాలకోసం అటూయిటూ తిరిగేడు.

నర్సింపంతులు అతని వీపుమీద రెండు చరుపులు చరిచి అతన్ని ఆపుచేశాడు- "ఎందుకురా- అలా పులివేషాలు వేస్తావ్? నువ్వు కాగితాలు తగిలిస్తే మాత్రం తగిలించినంత వేగంగా వాళ్ల మీద చర్యతీసుకుంటారా? దానికీ టైముపడుతుంది. ఈలోగా నువ్వు యిలా గెంతులేస్తే హరీమని చచ్చివూరుకుంటావు. అదిగో ఆ గదిలో ఎవరో పెద్దావిడ వుందట. ఆఖరుగా ఆవిణ్ణిచూద్దాం- ఆవిడా కాదంటే కాస్సేపు ఆగుదాం. ఈలోగా మా మనవడొచ్చేస్తాడు" అంటూ మరోగదిలోకి తీసుకువెళ్లేడు.

ఆమెకు యాభైఏళ్లుంటాయి. తలంతా నెరిసిపోవడం వలన అంతకంటే పెద్దవయసావిళ్లాగే కనిపిస్తోంది. ఆవిడ ఏజబ్బులకి స్పెషలిస్టో తెలీదుగాని, పేషెంట్సుని చూడగానే నవ్వుతూ రిసీవ్ చేసుకుని కూర్చోమని చెప్పింది.

"జబ్బు ఏవిటి?"

యాదగిరి చెప్పేడు. స్టెతస్కోప్‌తో ఓసారి పరీక్షించి, థర్మామీటరు తీసి అతని నోట్లో వుంచి రీడింగ్ చూసింది.

"ఫర్వాలేదు... టెంపరేచర్ మరీ ఎక్కువగా లేదు" అంటూ ప్రిస్క్రిప్షన్ బుక్ తీసింది.

ఆ డాక్టరు యాదగిరి పాలిట దేవతలా కనిపించింది. ఆమె ఎంతచదువుకుందో నర్సింపంతులికి తెలీకపోయినా అక్కడున్న స్పెషలిస్టులందరికంటే ఎక్కువ చదువుకున్నట్టు, అంతకుమించి కష్టసుఖాలు తెల్సిన మహాసంస్కారిగా భావించాడు.

ఆమె కళ్లద్దాలు సవరించుకుంటూ "చెప్పు బాబూ... ఏం మందులు రాయమంటావు?" అంది.

ఇద్దరూ ఆశ్చర్యపోయారు. ఒకర్నొకరు భావరహితంగా చూసుకున్నారు. "ఏంమందులు రాయమంటారని మనల్ని అడుగుతోందేవిటి? కొంగదీసి యీవిడ డాక్టరుకాదా? అసలు డాక్టరు బయటకెళ్తే ఆవిడ కోటు తొడుక్కుని ఏఆయా అయినా ఆ సీట్లో కూర్చుండిపోయిందా? లేకపోతే యింతమంది డాక్టర్లు ఛీఛీ అవతలికిపొమ్మంటే ఈవిడ మాత్రం ఎందుకింత శ్రద్ధగా చూస్తోంది?"




యీ సందేహాలు యాదగిరికీ వచ్చేయి, పంతులుగారికీ వచ్చేయి.

"మీరేం మందులురాయాలో మేంచెప్తే, ఆ మందులేవో మేవే రాసుకుని ఆసుపత్రిలో తీసుకునేవాళ్లంకదమ్మా ఆ మాత్రం దానికి మీరెందుకు? మీకిచ్చే జీతాలెందుకు? మందులు రాస్కునే కెపాసిటీవుంటే, నాకీ క్లాస్‌ఫోర్ బతుకెందుకు?" యాదగిరి సౌమ్యంగానే చెప్పాలనుకున్నాడుగాని అతని జన్మహక్కైన చిరాకు అనుకోకుండానే ఆ మాటల్లో చోటుచేసుకుంది.

ఆ మాటలకామె బాధపడలేదు. కోప్పడలేదు. మరేవిధమైన ఫీలింగ్నూ వ్యక్తం చెయ్యలేదు. ఇలాంటి మాటలు నాకు మామూలే అన్నట్టుగా చిన్నగా నవ్వింది.

"చూడండి... మీ జ్వరానికి ఏ మందులు రాయాలో నాకు తెలియక మిమ్మల్ని అడగలేదు. మన ఫాక్టరీలోని వర్కర్సులో దాదాపు చాలామంది డిగ్రీ లేని డాక్టర్సులాగే మాట్లాడతారు, మా దగ్గరకొచ్చి వాళ్లకేం మందులు కావాలో వాళ్లే చెప్తుంటారు. మేం చచ్చినట్టు అవే రాయాలి, రాయకపోతే, మేం పేషెంట్సుని సరిగా ట్రీట్ చెయ్యడం లేదని యూనియన్స్‌కి కంప్లయింట్ చేస్తుంటారు. ఛైర్మన్‌గారు మమ్మల్నిసంజాయిషీ అడుగుతుంటారు. ఈ బాధలన్నీ పడీపడీ యింక పడలేక ఓ సంవత్సరం నించి యిదే పద్ధతి అలవాటు చేసుకున్నాను. ఇక్కడ మేం పేషెంట్సుకి వైద్యం చేసే డాక్టర్లమో, వుద్యోగస్తులు చెప్పే మందులు రాసిచ్చే గుమస్తాలమో తెలియక నన్నునేను అనేకసార్లు ప్రశ్నించుకున్నాను. మేం పూర్తిగా డాక్టర్లమూ కాదు, పూర్తిగా గుమస్తాలమూ కాదు- మేం కేవలం డాక్టర్ కమ్ క్లర్క్సుము అని తేలిపోయింది. మేం ప్రిస్క్రిప్షన్ రాసివ్వకపోతే హాస్పిటల్లో మీకు మందులివ్వరని మా చేత రాయించుకుంటున్నారు; మీ మెడికల్ బిల్సు రియంబర్స్ కావని మా చేత రాయించుకుంటున్నారు. ఇప్పుడు చెప్పండి... మీరు చెప్పినమందులు నన్ను రాయమంటారా లేక నేను రాసిచ్చిన మందుల్ని మీరు వాడతారా?" డాక్టరుగారి గొంతుచిన్నగా జీరబోయింది.

అంతవరకూ యూనియన్‌కి కాగితం తగిలిస్తాను తగిలిస్తాను అంటూ ఎగిరిన యాదగిరికి గుండెలో ఒక్కసారి కలుక్కుమన్నట్టయింది. నర్సింపంతులుకి ఆమె మీద జాలికలిగింది. ఆవిడ వైద్యంచేసే డాక్టరైనా, ఆవిడా వుద్యోగస్తురాలే ఆవిడకీ యాజమాన్యం నించి బెదిరింపులుంటాయి. స్వతహాగా ఆమె ఆడదికాబట్టి, వుద్యోగభద్రత కోసం మరింత బెదిరిపోయింది.

"మీరే రాయండమ్మా" అన్నాడు యాదగిరి తగ్గుస్వరంతో.

ఆమె మందులు రాసి ప్రిస్క్రిప్షన్ అందించింది. ఇద్దరూ బైటికినడిచేరు. ఇంతవరకు తనకి సాయంగా నిలబడిన పంతులుగార్కి తనకి చేతనైన భాషలో ధన్యవాదాలు చెప్పేడు యాదగిరి.

"నువ్వేం కృతజ్ఞతలు చెప్పనక్కర్లేదుగాని, కాస్సేపుండు మా మనవణ్ణి పరిచయం చేస్తాను. ఎప్పుడైనా నీకు ఆపరేషన్ అవసరమైతే మావాడితో చెప్పి శుభ్రంగా ఆపరేషన్ చేయించుకోవచ్చు" అంటూ పంతులుగారు చెప్తుంటే యాదగిరికి లోలోపల ఎక్కడో వెన్నులో చలిపుట్టినట్టయింది. తన అదృష్టాన్ని గాడిదలు కాసి ఆపరేషన్ చేస్కాక తప్పుదన్న జబ్బే గనకవస్తే అప్పుడు తనకి మత్తుమందిచ్చే ఆపరేషన్ చేస్తారు. ఒంటిమీద స్పృహలేకపోయింతర్వాత తనకి ఏ డాక్టరు ఆపరేషన్ చేసినా ఒక్కటే- ఈ ఆలోచనరాగానే కంగారుపడ్డాడు.

"వద్దులెండి... మీ మనవడిగార్ని తర్వాత కల్సుకుంటాను. నాకు జ్వరం ఎక్కువైపోతోంది" అంటూ మందులిచ్చే కౌంటర్ దగ్గరకి హడావిడిగా వెళ్లిపోయేడు. పంతులుగారు చిన్నగా నవ్వుకుంటూ రాజేష్ వుండే రూము దగ్గరకి వెళ్లేడు. అతనింకా ఆపరేషన్ థియేటర్ నుంచి రాలేదు. అక్కడ కూర్చోడం యిష్టంలేక మెయిన్‌గేటువైపు నడిచేడు.

అక్కడ "ఎంక్వయిరీ కౌంటర్" కనిపించింది. ఓ పెద్ద బోర్డుమీద 'ఎంక్వయిరీ అని ఇంగ్లీషులోనూ, 'విచారించు స్థలము' అని తెలుగులోనూ రాసివుంది. మనుషులు విచారించడానికెక్కడా ఓ స్థలాన్ని ఏర్పాటుచేశార

న్నమాట- బాగానే వుంది. అయితే ఎవరిగురించి విచారించాలి? ఆసుపత్రి అన్నాక రోజూ అనేకమంది రోగులు వస్తుంటారు. అందులో కొంతమంది చనిపోవడం సహజం- అలాంటి వారి గురించి అక్కడికక్కడే విచారించేస్తే గుండెలు కొంచెం తేలికపడతాయన్న వుద్దేశంతో యీ స్థలాన్ని కేటాయించి వుంటారు- అని తనలోతనే స్వగతం పలుక్కుంటూ అక్కడున్న బెంచిమీద ఓ పదినిమిషాలపాటు కూర్చున్నాడు. ఎందుకో అప్రయత్నంగానే తన మనవరాలు సుజాత గుర్తొచ్చింది. ఆవిడ భర్తకి అకాల మరణం సంభవించి ఆమె లేతయవ్వనంలోనే విధవరాలయింది. ఆమె గురించి కాస్సేపు విచారించేడు. రాజేష్ అతన్ని వెదుక్కుంటూ అక్కడకొచ్చేడు.

''నిన్ను నారూమ్‌లో కూర్చోమంటే నువ్విక్కడున్నావేం? నీ కోసం వార్డులన్నీ తిరుగుతున్నాను పద యింటికి వెళ్దాం'' అంటూ తాతని తీసుకుని బైటకొచ్చి తన కారు స్టార్ట్‌చేసేడు.

కార్లో వెళ్తూ యిందాక జరిగిన యాదగిరి కథంతా చెప్పేడు వంతులు. రాజేష్ చిన్నగా నవ్వి వూరుకున్నాడు. ''రేయ్... యీసారి నువ్వు ఆపరేషన్ చేసేటప్పుడు నన్ను తీసుకెళ్లరా! నువ్వు ఆపరేషన్ చేస్తుంటే చూడాలనుంది''

రాజేష్ తాతయ్యవైపు తలతిప్పి, ఓ రెండు క్షణాలు చూసేక ''బహుశా కొంతమందికి లాంటి కోరిక వుంటుందనుకుంటాను, మా ఫ్రెండ్సు కూడా యిద్దరు ముగ్గురు యిలాగే అడిగేరు. కానీ ఆపరేషన్ థియేటర్‌లోకి దానికి సంబంధం లేని వాళ్లను రానివ్వరు'' అన్నాడు.

కారు మెల్లగానే వెళ్తోంది, రాజేష్‌కేదో జ్ఞాపకం వచ్చి అడిగేడు- ''తాతయ్యా... యిందాక నువ్వు మాట్లాడుతూ యిప్పటి డాక్టర్లూ ఓ డాక్టర్లేనా అని అన్నావు గుర్తుందా? ఎందుకలా అన్నావు? ఇప్పుడు వైద్య విజ్ఞానశాస్త్రం ఏ స్థాయికి పెరిగిందో తెలియక అనుంటావు. మునుపటికంటే జబ్బులవల్ల చనిపోయే వారి సంఖ్య ఎంత తగ్గిపోయిందో తెలియక అనుంటావు... అంతేనా?''

కాదంటూ అడ్డంగా తల ఆడించేడు నర్సింవంతులు.

''మరెందుకన్నావ్?''

''ఎందుకేవిట్రా... మా చిన్నతనంలోని డాక్టర్లు మీ అంత ఎక్కువ చదువులు చదవలేదు. రోగాన్ని కనిపెట్టడానికి యిన్నిన్ని మిషిన్లు అప్పుడులేవు. శరీరంలోని ఒక్కో భాగానికి ఒక్కో డాక్టరంటూ వుండేవాళ్ళు కారు. ఒకవేళ వున్నా చాలా తక్కువ. ఇందాక యాదగిరిగాణ్ణి డాక్టర్ల దగ్గరికి తిప్పినప్పుడు గమనించేనుగా- కళ్లు చూసేవాడు పళ్ళకి వైద్యం చేయడట. చిన్న పిల్లలకి వైద్యంచేసేవాడు పెద్దవాళ్లకి చెయ్యడట. దీన్ని వైద్యశాస్త్రం సాధించిన అభివృద్ధంటావూ? ఆ మాటంటే నేనొప్పుకోను. మన చింతలగ్రహారానికి నాలుగుమైళ్ల దూరంలో చోడవరం రంగనాయకులుగారని ఓ డాక్టరుగారుండేవారు. మహానుభావుడిది అమృతహస్తం. ఎలాంటి రోగంతో వెళ్లినాసరే... యిలా చెయ్యి పట్టుకుని నాడిచూసి, కళ్ళు చూసి, నాలికచూసి, ఆరోగ్యం ఏవిటో'ఠక్కు'మని చెప్పేసేవాడు. నాలుగంటే నాలుగే రోజులు మందులిచ్చేవాడు. అంతే... ఎలాంటి మాయరోగమైనా సరే చచ్చినట్టు తగ్గి వూరుకునేది. ఇప్పుడు చెప్పు... ఆ వైద్యుడు గొప్పవాడంటావా యిన్ని మిషన్ల సాయంతో వైద్యం చేస్తున్న యీనాటి మీ డాక్టర్లు గొప్పవారంటావా?''

తాతగారి అభిప్రాయాలు ఆయన వయసు కంటే మరీ పాతవన్న అభిప్రాయానికొచ్చేశాడు రాజేష్. 'ఓల్డ్ ఈజ్ గోల్డ్' అన్న సామెత తన తాతగారికి ఎప్లయ్‌కాదు. ఆయనకి వయసు అయితే పెరిగిందిగాని దానితో సమానంగా ఆయన లోకజ్ఞానం పెరగలేదు. ఎలా పెరుగుతుంది? కళ్ళు మూసుకున్నవాడికి యీ ప్రపంచం యావత్తు కనిపించకుండా పోతుంది. నగరంలో పుట్టిన ఓ వ్యక్తిని వూహ తెలియని పసితనంలో అడివిలో వదిలేస్తే అతని శరీరం మానవాకృతిలో పెరిగినా, అతనిన మేధ అడివిలోని అజ్ఞానాన్ని జంతువుల్లోని పాశవికతనే సంతరించుకుంటుంది.

తన తాతయ్యా అంతే!

చింతల అగ్రహారంలాంటి కుగ్రామంలో




పుట్టి, అక్కడే పెరిగితే అతని ఆలోచన ఆ అగ్రహారపు పొలిమేరలు దాటి బైటకిరాదు. ప్రపంచం ఎంత వేగంతో ప్రగతిపథంలో దూసుకుపోతోందో ఏం అర్ధమవుతుంది? అర్ధంకాకపోగా ప్రస్తుతకాలం కంటే పాతకాలమే గొప్పదనుకునే అజ్ఞానం బాగా వంటబట్టేస్తుంది.

ఓల్డ్ ఈజ్ గోల్డ్ అనేది తాతగారి నమ్మకం. పాత ఒక రోత, కొత్త ఒక వింత అన్నది మనవడిగారి నమ్మకం! వారిద్దరిమధ్య తల ఎత్తిన భావవైరుధ్యం ఒక్కవైద్యశాస్త్రం గురించే కాదు మిగతా అన్ని విషయాలకూ వర్తిస్తుందని యిద్దరికీ స్థిరంగా వున్న అభిప్రాయం. అతన్ని మార్చాలనే కోరికగాని, ఆ అవసరంగాని తనకు లేవుకాక లేవు అనుకున్నాడు రాజేష్. అయినా తాతగారు చేసిన కామెంట్‌తో తన ఒక్కడికేకాదు వైద్యశాస్త్రాన్ని అభ్యసించిన ప్రతిడాక్టరుకి, సైంటిస్టుకి అవమానం జరిగినట్టుగా ఫీలయ్యాడు. కిలుంపట్టిన రాగిచెంబుని చింతపండుతో తోమితే కొంత కాకపోయినా కొంతైనా మెరుగుపడకపోతుందా అనుకుంటూ రాజేష్ చెప్పనారంభించేడు.

"నీకు తెల్సిన రంగనాయకులే చాలా గొప్ప వైద్యుడనుకుంటే ఎన్నో శతాబ్దాల కిందటే వైద్యశాస్త్రంలో అద్భుతాలు చేసిన ధన్వంతరి, చరకుడి గురించి పుస్తకాల్లో చదువుకున్నాం. మరి, వాళ్ళెంతగొప్పవాళ్లు? మీరంగనాయకులు గారు వైద్యం చేసేటప్పటికి ఎట్లీస్ట్ స్టెతస్కోపు అయినా కనిపెట్టబడింది. మరి ధన్వంతరికాలంనాటికి ఆ ఇన్‌స్ట్రుమెంటూ రాలేదుగా. అంచేత వారు మరీగొప్పవాళ్ళు అని ఒప్పుకోవాలిగా.

వాళ్లు గొప్పవాళ్ళూ అని ఒప్పుకుంటూనే మేధావులు, సైంటిస్టులు అంతటితో ఆగిపోలేదు. వైద్యశాస్త్రాన్ని మరింత మరింత పెంచాలనే ఆనాట్నించి యీనాటివరకూ ఎన్నో పరిశోధనలూ, ప్రయోగాలూ చేసేరు. మొన్న మొన్నటివరకూ టీబీ అనేది మందులకు లొంగని వ్యాధి. ఓ మనిషికి టీబీ వచ్చిందంటే అతని అంతిమఘడియలు సమీపించేశాయని అనుకునేవారట. కానీ యిప్పుడు? భయంకరమైన వ్యాధులలిస్టులో ఆ డిసీజ్ లేనే లేదు. మలేరియా వ్యాధినైతే పూర్తిగా నిర్మూలించారనే చెప్పొచ్చు. మునుపు ప్రాణాంతకమైన జబ్బులుగా చెప్పుకునేవాటిల్లో దాదాపు నైన్టీ పెర్సంట్ జబ్బులకి మందులు కనిపెట్టేరు. ఇంక సర్జరీలోకొస్తే అంటే ఆపరేషన్‌ద్వారా జబ్బులు నయంచేసే ప్రక్రియలోకొస్తే- ఒకప్పుడు అసాధ్యం అనుకునే పనులు ఎన్నో యిప్పుడు అతిసునాయాసంగా జరిగిపోతున్నాయి. మునుపు గుండెజబ్బు వస్తే యింకా మనిషి చాప్టర్ క్లోజ్ అయిపోయినట్టే అనుకునేవారు. కానీ ఇవాళ ఓపెన్‌హార్ట్ సర్జరీతో ఎంతోమంది బతికి బయటపడ్డారు. మూత్రపిండాలమార్పిడి యివాళ సాధారణమైన ఆపరేషన్‌గా మారిపోయింది..."

రాజేష్ చెప్తున్న మాటలు పూర్తికాకుండానే బంగళా వచ్చేసింది. కారుదిగి లోపలకెళ్తూ- "నేను చెప్పిందాన్ని నువ్వు ఒప్పుకున్నట్టేనా లేక మీ చోడవరం రంగనాయకులే మాకంటే గొప్పడాక్టరంటావా?" అన్నాడు నవ్వుతూ.

"ఎవరు గొప్పవారని కాదుగాని నువ్వు మాటలు బాగా నేర్చావురా. ఇంక నువ్వు ఆపరేషన్లు ఎలా చేస్తావో చూడాలి" అని నవ్వుతూ భుజంతట్టి తన గదిలోకి వెళ్ళిపోయేడు నర్సింపంతులు. ఆ ఒక్క వాక్యంతో అర్ధమైపోయింది తను చెప్పిందంతా ఏమీ పనిచేయలేదని.



మరో రెండు రోజులపాటు హైదరాబాద్‌లోని విశేషాల్ని తల్లిదండ్రులకు చూపించింది రాజేశ్వరి. చార్మినారు దగ్గరకెళ్లి చూసేక దానిమీదకి వెళ్లి అక్కడనించి నగరమంతా చూడాలని ఉబలాటపడ్డాడు నర్సింపంతులు.

ఆ ప్రాంతంలో చాలామంది ఆడవాళ్లు నల్ల బురఖాలు తొడుక్కుని వుండడం పంతులుగారికి చిత్రంగా కనిపించింది. వారు మహ్మదీయ స్త్రీలు అని, యీ పందొమ్మిది వందల తొంభైలో కూడా యింకా వాళ్లు మతాచారాన్ని పాటిస్తూ బురఖాలు ధరిస్తున్నారనీ చెప్పింది రాజేశ్వరి. అయితే అలా మతాచారాన్ని పాటించేవాళ్లపట్ల ఆమెకు సదభిప్రాయం లేదన్న విషయం ఆమె మాటల్లో కొద్దిగా ధ్వనించింది. కానీ పంతులు మాత్రం మతాచారాన్ని గౌరవిస్తూ మాట్లాడేడు.

''ఎవరి మతాన్ని వారు గౌరవించకపోతే యింక మనుమలకి, మతానికీ మధ్య సంబంధబాంధవ్యాలు ఎలా వుంటాయమ్మా? మనుమలు పుడతారు, చనిపోతారు. కానీ మతానికి పుట్టుకేతప్ప మరణం వుండదు... వుండకూడదు''. పంతులు సిన్సియర్‌గా చెప్పేడు. రాజేశ్వరికి తండ్రి అభిప్రాయాలు రుచించలేదు. ''అంటే ప్రతి మనిషీ మతానికి, కులానికి కంపల్సరీగా లొంగే బతకాలంటావా నాన్నా?'' అంది కారు డ్రైవ్ చేస్తూ.

''మతానికి, కులానికి లొంగి బతకడం కాదమ్మా. ఆ మతాచారాన్ని కులం కట్టుబాట్లని గౌరవిస్తూ, ఆచరిస్తూ బతకాలి. ఏ పద్ధతులూ లేకుండా బతికేసి, ఏదో విధంగా తినేసి, చావడానికి మనం మనుమలంగాని అడవిలోని జంతువులం కాదుగా''

రాజేశ్వరికి తండ్రి వైఖరి నచ్చకపోయినా యింకా విషయం మీద వాదించదలుచుకోలేదు.

కారు టేంక్‌బండ్‌మీదకొచ్చింది. ముగ్గురూ కారు దిగి డోర్సు లాక్‌చేసి, అక్కడ ప్రతిష్టించిన విగ్రహాల్ని చూస్తూ ముందుకు నడిచేరు. ఒక్కో విగ్రహం తాలూకు విశిష్టత గురించి చెప్తూ ముందుకు సాగుతోంది రాజేశ్వరి. కవిత్రయం విగ్రహాన్ని చూస్తూ నర్సింపంతులు వారికి భక్తిగా నమస్కారం పెట్టేడు.

''మహానుభావులు... శ్రద్ధ తీసుకుని మహాభారతాన్ని తెలుగులో రాసి వుండకపోతే తెలుగువాళ్లకి భారతాన్ని చదివే అవకాశం వుండేది కాదు గదా'' అన్నాడు. శ్రీశ్రీ విగ్రహం దగ్గర ఆగి ''ఎవరితను?'' అని అడిగేడు.

''శ్రీరంగం శ్రీనివాసరావు నాన్నా... అందరూ ఆయన్ని శ్రీశ్రీగారంటారు. ఆయనో మహాకవి. మహాప్రస్థానం, ఖడ్గసృష్టి అనే గ్రంథాలు ఆయనకి ఎక్కువపేరు తెచ్చి పెట్టేయి. ఆయన్ని చాలామంది విప్లవకవి అంటారు. చాలా సినిమాలకి పాటలు కూడా రాసేరు'' అంటూ శ్రీశ్రీ గురించి మరికొన్ని విశేషాలు చెప్పింది. అంతా విన్నాక శ్రీశ్రీ పేరు తన వూళ్లోని వెంకటరాజుగారి కొడుకు రామరాజు ద్వారా విన్నట్టు గుర్తొచ్చింది. ''చెప్పేడు చెప్పేడు, మా వెంకటరాజుగారి అబ్బాయి యీయన గురించి చెప్పేడు, ఈయన్దివిశాఖపట్నం అట గదా అదీ చెప్పేడు, సినిమాల్లో పాటలు కూడా రాసేరంటున్నావ్! గుణసుందరి కథలోగాని నాగయ్యగారు నటించిన యోగివేమనలోగాని ఆయన పాటలు రాసేరా?'' అన్నాడు.

రాజేశ్వరికి నవ్వొచ్చింది. తన తండ్రి ఆ రెండు సినిమాలుతప్ప మరో సినిమా చూడలేదన్న విషయం ఆమెకు తెలుసు. ఏ సినిమా గురించి చెప్పినా దాన్ని ఆ రెండు సినిమాలతోనే పోల్చి మాట్లాడ్డం ఆయనకి అలవాటు.

''శ్రీశ్రీగారు ఆ సినిమాలు విడుదలయ్యేనాటికి సినిమా ఫీల్డుకెళ్లలేదనే నా అనుమానం'' అంటూ వాళ్లని మరోవైపు తీసుకెళ్లి బుద్ధుడి విగ్రహం మునిగిపోయిన స్థలాన్ని చేత్తో చూపించింది. ''విగ్రహం మునిగిపోవడం ఏవిటే?'' అంటూ కామేశ్వరమ్మ ఆశ్చర్యపోయింది. ఆవిడమీద పంతులుగారు చిరాకుపడ్డారు. ''వెంకట్రాజుగారు పేపరు చదివి చెప్పేర్లేవే'' అంటూ కూతుర్ని అడిగేడు. ''విగ్రహాన్ని ఎప్పుడు బైటకి తీస్తారట?'' అని.

''ఏమో... నాకు తెలీదు. పదండి వెళ్దాం'' అంటూ మళ్లీ కారు ఎక్కింది. కారు రోడ్డుమీద వస్తుంటే నాలుగైదు చోట్ల చాలామంది జనం గుంపుగా నిలబడి హడావిడిగా తిరగడం, బిగ్గరగా కేకలు వినిపించడం గమనించేడు నర్సింపంతులు.

''ఏవిటమ్మా జనం ఆ లైట్లు ఆ హడావిడి?''

''ఊళ్లో సినిమా షూటింగులు యీమధ్య బాగా ఎక్కువైపోయేయి నాన్నా!''

''షూటింగా... అంటే ఏమిటి?''





''మాటింగంటే సినిమాలు తీయడం అన్న మాట''

''ఓహో... సినిమాల్ని రోడ్లమీదే తీస్తారన్న మాట. మరి గుణసుందరికథలో యిలాంటి రోడ్లెక్కడా కనిపించినట్టు గుర్తులేదే''

''అది జానపదం సినిమాకదా! దాన్ని రోడ్లు మీద తీయరు. స్టూడియోలో సెట్టింగ్సు వేసి మాట్‌చేస్తారు. ఇవి సోషల్ పిక్చర్సు అంటే సాంఘికచిత్రాలు. వీటిని సహజమైన ఇళ్లల్లో నూ, రోడ్లమీద వాళ్ల కథనిబట్టి ఎక్కడైనా తియ్యొచ్చు''

ఆమె సినిమాల గురించి చెప్పేక అతనికి మాటింగు చూడాలనే సరదా పుట్టి, ఓ మాటింగు దగ్గర కారు ఆపమన్నాడు.

''వద్దునాన్నా... మనం ఇలా జనంలో నిలబ డి మాటింగ్సు చూడాల్సిన అవసరం లేదు. మీ అల్లుడుగారికి చాలామంది సినిమా ప్రొడ్యూస ర్లు, యాక్టర్లు, డైరక్టర్లు తెలును. ఎప్పుడైనా ఓ ఆదివారంనాడు మిమ్మల్ని స్టూడియోకి తీసుకె ళ్లమని ఆయనకి చెప్తాన్లే''

కారు యిల్లు సమీపించింది. కారు దిగుతూ ''స్టూడియో అంటే, అదెవరిదో?'' అన్నాడు పంతులు.

''అక్కినేని నాగేశ్వరరావుగారిది''.

''తెలును తెలును ఆయన నటించిన బాల రాజు సినిమాచూద్దాం అని మీ అమ్మని తీస్కుని వెళ్తే దానికే టిక్కెట్లు దొరక్క తిరిగి వచ్చేశాం- ఆయనే కదా''

''ఔను''

భోజనాలు ముగిసేయి. నారాయణరావు వచ్చేక తన తండ్రిని, తల్లిని స్టూడియోకి తీసుకెళ్లమని చెప్పింది. కామేశ్వరమ్మ మాత్రం ''నేను వెళ్లలేనే తల్లీ... నాకు సిగ్గు'' అంది.

''నాకు సిగ్గులేదు నేను వెళ్తాను, నువ్వా ఏర్పాట్లు చూడరా'' అన్నాడు అల్లుడితో.

నారాయణరావు అలాగే అనబోయి ఠక్కు మని ఆగిపోయేడు ''ఏవిటి మీ అభ్యంతరం?'' అడిగింది రాజేశ్వరి.

''ఏం లేదు మీ నాన్నగారికి ప్రెసిడెంటాఫ్ అమెరికాని కూడా ఒరేయ్ అని పిలవడం అలవాటుగదా? రేపు అక్కడ స్టూడియోలో అందరూ పెద్దపెద్దవాళ్లే వుంటారు. వాళ్లకి పరిచయం చేసినప్పుడు వాళ్లని కూడా ఒరేయ్ గిరేయ్ అనిపిలిస్తే వాళ్లు గొడవపెడ తారు నాకూ బేడ్ నేమ్ వస్తుంది. ఆ విషయమే ఆలోచిస్తున్నాను'' అన్నాడు నారాయణరావు ధైర్యంగానే.

పంతులుగారు పకపక నవ్వేరు. నేను ఒరేయ్ అని పిలవడంవల్ల మంచిజరిగినా, చెడుజరిగినా, అది నావరకే తప్ప, నా పిలు పుతో నీకు అపఖ్యాతి ఎందుకు తెస్తారా? నువ్విలాంటి అనుమానాలేం పెట్టుకోకు'' అన్నాడు.

మర్నాడు ఉదయం కార్లో స్టూడియోకి బయ లుదేరారు. నారాయణరావుకి నిజంగానే చాలా మంది సినిమా ప్రముఖులతో పరిచయాలు న్నాయి. అందులో కొంతమంది మద్రాసు నుంచి హైదరాబాద్ వచ్చినప్పుడు నారాయణ రావుకి ఫోన్‌చేసి మరీ పలకరించడం, వాళ్ళకి తనయింట్లో పార్టీలు యివ్వడం ఎన్నోసార్లు జరిగింది. ఆ బంగళాలో రెండుమూడు సిని మాల మాటింగు కూడా జరిగింది.

''మొన్నటివరకు మద్రాసులోనే తెలుగు సినిమాల మాటింగు జరిగేది మావయ్యగారూ! అడపాదడపా హైదరాబాద్‌లోను, విశాఖపట్నం తదితర ప్రాంతాల్లో కూడా జరిగేవి. ఆంధ్ర రాష్ట్రానికి తెలుగు సినిమాఫీల్డుని తరలించా లని ఎన్నాళ్లగానో ప్రయత్నాలు జరిగేయి. కానీ మొన్న మొన్న అవకాశం లభించింది. దాంతో ముప్పయి నలభై సినిమాలు యిక్కడ, మిగతా వూళ్లల్లోనూ స్టార్ట్ అయేయి. మొన్నటివరకూ ఓ మాదిరి బిజీతో డల్‌గా వుండే స్టూడియోలు యిప్పుడు కిటకిటలాడుతున్నాయి'' నారాయ ణరావు చెప్పినదంతా పంతులుగారు శ్రద్ధగా వింటున్నారు.

''మంచిదేగదా... ఎన్ని సినిమాలు తయా రైతే అంతమంది బతుకుతారు గదరా! ఇలాంటి స్టూడియోలు యీ వూర్లో ఎన్నివు న్నాయి?''

ఎన్నివున్నాయో మనసులోనే లెక్కపెట్టు కుంటూ జవాబు చెప్పేడు నారాయణరావు.

''అన్నపూర్ణా స్టూడియో, రామకృష్ణాస్టూ






డియో, సారథ స్టూడియో, పద్మాలయ, భాగ్యనగర్ స్టూడియో, యింకో రెండుమూడున్నట్టు గుర్తు''

''అన్నింట్లోకి ఏది పెద్ద స్టూడియో?''

''ఇప్పుడు మనం వెళ్తున్న అన్నపూర్ణా స్టూడియోనే పెద్దది''

''అది బాలరాజు సినిమాలో నటించిన అక్కినేని నాగేశ్వరరావుదా?''

''ఔను''

''మరి యన్టీరామారావు ముఖ్యమంత్రిగా పనిచేసికూడా నాగేశ్వరరావు కంటే ఎందుకు పెద్దస్టూడియో కట్టించలేకపోయేడు''

నారాయణరావు ఆ ప్రశ్నతో కాస్త యిరకాటంలో పడ్డాడు. అయినా జవాబు చెప్పక తప్పదు; చెప్పకపోతే వూరుకోడు.

''ఆయన ముఖ్యమంత్రి అవడానికి, స్టూడియో కట్టడానికి ఏమీ సంబంధం లేదు మావయ్యగారు. ఎంచేతంటే ఆయన చీఫ్ మినిస్టరైంది ఎనిమిదేళ్ళక్రితం. కానీ స్టూడియో అంతకుముందే కట్టించేశాడు''

కార్లో యిద్దరూ కాస్సేపు మౌనంగానే ప్రయాణం చేసేరు. వున్నట్టుండి పంతులుగారు- ''యన్టీరామారావు ప్రభుత్వం ఢపీమని ఎందుకు పడిపోయిందంటావ్?'' అన్నాడు.

అది నారాయణరావు ఎంతమాత్రం వూహించని ప్రశ్న. మావయ్యగారికి రాజకీయ పరిజ్ఞానం ఏమాత్రంవుందో తనకి తెలియదు. అసలు వుందో లేదో కూడా తెలియదు. ఏం చెప్పినా "మావూళ్లో వెంకటరాజుగారు చెప్పే ర్లే" అంటుంటాడు. మరి ఆ వెంకటరాజు మహానుభావుడు ఎంత రాజకీయమేధావో, అతను ఏ పార్టీని అభిమానించే మనిషో తనకి తెలీదు. ఎన్టీ రామారావు పరాజయానికి ఏ కారణం చెబ్తే ఈ ముసలాడికి నచ్చుతుందో, ఏం చెప్తే ఈయన తనమీద కస్సుమంటూ వస్తాడో తెలీదు. నాకా కారణం తెలియదు అని ఒక్కమాట చెప్పేస్తే ఏ గొడవా వుండదుకదా అని అనుకున్నాడు.

"నాకావిషయం తెలియదు మావయ్యగారు"

"నాకు తెలుసు... మావూరి రాజుగారు చెప్పేరు"

"ఏం చెప్పేరు" అని అడిగేలోగా కారు స్టూడియో గేట్లోకి ప్రవేశించింది. గేటుముందు రెండు బస్సుల్లోంచి దిగిన జనం స్టూడియోలో పలకి వెళ్లడానికి అనుమతికోసం నిరీక్షిస్తూ కనిపించారు. అందులో చాలామంది బోడిగుళ్లతో కనిపించేరు.

"వీళ్లంతా ఎవర్రా?" అన్నాడు అందర్నీ పరికించి చూస్తూ.

"వీళ్లు బస్సులమీద తీర్థయాత్రలకి బయలుదేరినవాళ్లు మావయ్యా! పదో ఇరవయ్యో తీర్థాలకి వెళ్లి ఆఖరుగా హైదరాబాదు వచ్చి సినిమా యాక్టర్లని చూడ్డం, షూటింగులు చూడ్డం ప్రధాన కార్యక్రమంగా పెట్టుకుంటారు. వీళ్లు రావడం పోవడం ఈ హడావిడి అంతా, మునుపట్లో ఇక్కడికంటే మద్రాసులో ఎక్కువగా ఉండేది. కానీ ఇప్పుడు ఎక్కువమంది సినిమా ఆర్టిస్టులు ఇక్కడే ఉండటంతో మునుపటి కంటే ఎక్కువగా ఇక్కడికే వస్తున్నారు. పైగా వీళ్లు ఒక్కో ఆర్టిస్టు ఇంటికి వెళ్లడంకంటే ఇలాంటి స్టూడియోకొచ్చి ఓ షూటింగు చూసేరనుకో- చాలామంది ఆర్టిస్టుల్ని ఒకేసారి చూసేసినట్టూ అవుతుంది; సినిమా షూటింగు కూడా చూసినట్టవుతుందిగదా"

కారు గేట్లోంచి లోపలకొచ్చింది. గేటుదగ్గరున్న గూర్ఖా కారుని ఆపి "ఎవరికోసం? పర్మిషనుందా?" అని అడిగేడు. నారాయణరావు జవాబుచెప్పేలోగా అతన్ని గుర్తుపట్టి, గూర్ఖా శెల్యూట్ కొట్టి కారుని లోపలకి పంపించాడు.

"నీకు సినిమా స్టూడియోల్లో పరపతి బాగానే వుందిరా" అంటూ మెచ్చుకున్నాడు.

"దాందేంవుంది... నేను చాలాసార్లు మా ఫ్రెండ్సుతో కలిసి ఈ స్టూడియోకి రావడం వాడు చూసివుంటాడు. పైగా అక్కినేనిగారితో నాకు చాలా మంచి ఫ్రెండ్‌షిప్ వుంది. ఇద్దరం కలిసివుండడం వాడు చూసుంటాడు"

కారుని పార్కింగ్ ప్లేస్‌లో ఆపి, కారు దిగుతుండగా స్టూడియో మేనేజరు అటుగా రావడం గమనించి నారాయణరావు పలకరించేడు. "హల్లో సార్... గుడ్‌మార్నింగ్"

"మోణింగ్ మోణింగ్... ఏఁవిటి నారాయణరావుగారూ- స్టూడియో చూడ్డానికి వచ్చారా లేక ఏదైనా పిక్చర్లో వేషం వెయ్యడానికొచ్చేరా?" మేనేజరు చాలాచనువు ప్రదర్శిస్తూ మాట్లాడేడు.

"మా మావయ్యగారికి మీ స్టూడియో చూపించడానికి తీసుకొచ్చేను. ఔనూ... నేను సినిమాల్లో వేషాలు వెయ్యడం ఏవిటి? సినిమాలు ఈ మాత్రం బతకడం కూడా మీకు ఇష్టంలేదా?" నారాయణరావు నవ్వుతూ తనో సిగరెట్ వెలిగించి అతనికొకటి ఆఫర్‌చేసేడు.

"ఏం... మీరు వేషం వెయ్యడానికి పనికి రారా? భలేవారే... మీరు చాలా డ్రామాల్లో నటించేరుగా! ఎప్పుడూ ఏ నాటకాలు వెయ్యని వాళ్లు, ఏ ఇనిస్టిట్యూట్‌లోనూ ట్రైనింగు అవని వాళ్లు కూడా డైరెక్టుగా సినిమాలకి ఎగబడిపోయి డబ్బింగ్ వాయిసుల్తో బతికేస్తున్నారు- అలాంటిది మీకేం?"

నారాయణరావు చిన్నగా నవ్వేసి "వాళ్లెలా బతికేస్తే నాకెందుకు? నన్నిలా బతకనివ్వండి. ఇప్పుడు మీ స్టూడియోలో ఏ షూటింగులు జరుగుతున్నాయి" అన్నాడు.

మేనేజరు చెప్పేడు. మూడు పిక్చర్సు షూటింగు, ఓ పిక్చరు డబ్బింగు జరుగుతున్నా




యన్నాడు.

"డబ్బింగు అంటే ఏవిట్రా?" వాళ్ల సంభాషణంతా శ్రద్ధగా వింటున్న పంతులుగారు ఆసక్తిగా అడిగేరు.

"మాటింగు అయిపోయేక అప్పుడు మాట్లాడిన మాటలన్నీ మళ్లీ మాట్లాడించి ఫిలిమ్ మీద రికార్డు చేస్తారు. దాన్నే డబ్బింగ్ అంటారు మావయ్యా. మునుపు సెట్‌లో మాట్ చేసినప్పుడే ఆ మాటలు పక్కాగా రికార్డయిపోయేది. స్టూడియోలో కాకుండా బయటెక్కడైనా తీసివుంటే ఆ పార్టుని మాత్రమే డబ్‌చేసేవారు లేకపోతే బయటినుంచి వచ్చే శబ్దాలు కూడా రికార్డైపోయి మాటలకి స్పష్టతపోతుందిగదా- ఇప్పుడైతే స్టూడియోలో తీసినా మరెక్కడ తీసినా మొత్తం పిక్చరంతా డబ్‌చేస్తున్నారండి"

నారాయణరావు అంత వివరంగా చెప్పినా పంతులుగారికి ఒకేఒక్కవిషయం అర్థమైంది. అదేంవిటంటే- సినిమా యాక్టర్లు ఒకసారి నటిస్తారు, నటించేక మాట్లాడతారు. మరి యోగి వేమనలో నటించిన నాగయ్యగారు కూడా యిలాగే చేసుంటారా?- గుణసుందరికథ సిన్మాలో నటించిన శ్రీరంజని, రేలంగి కూడా యిలాగే చేసుంటారా?- అనే ఆలోచిస్తూ "నాకు డబ్బింగ్స్ చూపెట్టరా" అన్నాడు చంటిబిడ్డ తన తండ్రిని సినిమాకి తీసుకెళ్లవా అని అడిగినట్టుగా.

మేనేజర్ని పర్మిషన్ అడిగేడు- "ఓయస్... ఆపిక్చరు మాఫ్రెండు తీసిందే, నో ప్రాబ్లమ్... రండి" అంటూ డబ్బింగ్ థియేటర్లోకి తీసుకువెళ్లేడు. అక్కడ ఓ హీరో ఏక్టచేసిన లూప్సవేస్తూ మరో డబ్బింగ్ ఆర్టిస్టు చేత డైలాగులు చెప్పిస్తున్నారు. మూడునాలుగు లూప్స్ చూసేక పంతులుగారికో సందేహం వచ్చింది. సినిమా నటులు ఒకసారి నటిస్తారు, మరోసారి డబ్బింగ్ చేస్తారని యిందాక నారాయణరావు, మేనేజరు చెప్పేరు. కానీ యిక్కడ తెరమీద ఒక హీరో కనిపిస్తున్నాడు. అతనికి మాటలు మరొకడు చెప్తున్నాడు. ఇలా ఎందుకు చేస్తున్నారు చెప్మా?

తన సందేహాన్ని అడక్కుండా వుండలేకపోయేడు. అదీ చాలా బిగ్గరగా అడిగేడు. అక్కడ జవాబు చెప్పడానికి మేనేజరు కాస్త యిబ్బంది పడ్డాడు. పంతులుగార్ని నారాయణరావుని బైటకి తీసుకెళ్లి వరండాలో నిలబెట్టి చెప్పేడు.

"ఆ హీరో మన భాషవాడు కాదండి, అంచేత, అతని సొంతగొంతుతో మాట్లాడిస్తే తెలుగుదనం దెబ్బతింటుందన్న భయంతో మరొకర్తో మాట్లాడిస్తున్నారండి"

"తెలుగురాని నటుణ్ణి పెట్టుకుని యిన్ని తంటాలుపడేబదులు చక్కగా తెలుగువచ్చిన వాణ్ణే పెట్టుకోవచ్చుగా! ఏం... అంతపాటి నటులు మన తెలుగువాళ్లలో లేరంటావేంట్రా?"

పంతులుగారు తనని ఒరేయ్ అన్నా ఆ మేనేజరు ఎందుకో కోప్పడలేదు పైగా, "మీరు నన్ను ఒరేయ్ అని పిలుస్తుంటే మానాన్నగారు గుర్తుకొచ్చే"రంటూ సంతోషించేడు.

"నీ సంతోషంబాగానేవుంది గాని, నేను అడిగిన ప్రశ్నకి జవాబు చెప్పలేదురా" పంతులుగారు మేనేజరు భుజంమీద చిన్నగా తడుతూ అన్నాడు.

"చెప్పడానికేంవుందండి. ఇప్పుడు మీరు తెరమీద చూసిన హీరో మరోభాషవాడు. భాషా సమస్యవల్ల అలాంటివాళ్లకి డబ్బింగ్‌పెట్టినా కొంతఅర్థంవుంది కానీ తెలుగువాళ్లైన హీరో హీరోయిన్లక్కూడా డబ్బింగ్ చెప్పించాల్సివస్తోందండి ఖర్మ! పైగా, వాళ్లకి మరొకరు గొంతు ఎరువివ్వడాన్ని వాళ్లు తమ టాలెంట్‌కి మైనస్ పాయింట్‌గా భావించడంలేదు. డబ్బింగ్ చెప్పుకోవలసిన బెడద తప్పిపోయిందికదాని సంతోషిస్తున్నారు. మరో బాధాకరమైన విషయం ఏవిటంటే- అలాంటివాళ్లకి ఉత్తమ నటులు, ఉత్తమనటీమణుల అవార్డులుకూడా యిచ్చేస్తున్నారు. దాంతో వాళ్లకీ పద్ధతే చాలా సులభంగానూ, మంచిదిగానూ కనిపిస్తోంది. ఉత్తమనటుడు, ఉత్తమనటి అంటే ఎవరండి? ఉత్తమ-అనేమాట వదిలేయండి. అసలు నటన అంటే ఏవిటండి? వాచికం, అభినయం- ఈ రెండూ కలిస్తేనే అది సంపూర్ణమైన నటన అనిపించుకుంటుంది. మాటద్వారా ముఖంలో హావభావ ప్రకటనద్వారా నటుడు తను ధరించే పాత్రకి జీవంపోయాలి. మిగతావన్నీ ఆ పాత్రలో జీవించడానికి ఆ

నటుడికి చేసిన సహాయాలే అవుతాయి. అంటే మేకప్‌కానివ్వండి, వాళ్లు వేసుకునే దుస్తులేకానివ్వండి ఇవన్నీ ఆ పాత్రకి ఓ రూపం కలిగించడానికి చేసే హంగులేకదా. మరి నటీనటులుగా వీళ్లు చెయ్యాల్సిన పనిని వీళ్లు సగం నిర్వర్తించి, మేం చాలాచాలా గొప్పవాళ్లం అనేసుకుంటున్నారు. ఆ తరంనుంచి ఈతరందాకా అందర్నీ గమనించుకుంటూ వస్తున్న నాబోటివాళ్లకి యీ పరిస్థితి చాలా బాధగానే వుంటోంది.

మేనేజరు తన బాధని సిన్సియర్‌గా వ్యక్తంచేశాడు. అతనిమాటలు పంతులుగారికిన చ్చేయో లేదో నారాయణరావుకి స్పష్టంగా తెలీదు. ఎందుకంటే, మేనేజరు నాలుగు జెనరేషన్స్‌నించి సినిమారంగాన్ని అంటిపెట్టుకున్న మనిషి. అప్పుడేంజరిగిందో ఆయనకి తెలును; ఇప్పుడేం జరుగుతుందో తెల్సు. రెండింటికి మధ్యనున్న తేడా ఆయనకి తెలుసు. ఆ తేడాలో మంచి చచ్చిపోయి చెడుబతుకుతుందో, చెడు చచ్చిపోయి మంచి బతగ్గలుగుతోందో ఆయనకితెల్సు.

కానీ, తన మామగారికి గతంతప్ప వర్తమానం తెలీదు.

మరీ పాతరోజుల్లో అయితే ఎవరిగొంతుతో వాళ్లు మాట్లాడ్డమేకాదు ఎవరి పాటలూ, పద్యాలు కూడా వాళ్లే సొంతంగా పాడుకోవాలి. అప్పట్లో అన్నీ పౌరాణికాలు, తర్వాత జానపదాలు వచ్చేవి కాబట్టి అలా పాడగలగడం ప్రధానమైన అర్హతగా భావించేవాళ్లు.

నర్సింపంతులికి ఆ విషయమే తెల్సు. ఇప్పుడు పాటలూ, పద్యాల సంగతలాగుంచి చాలామంది నటీనటుల విషయంలో వాళ్లు మాట్లాడే మాటలక్కూడా మరొకరు గొంతు ఎదురివ్వాల్సి వస్తోంది.

ఈ విషయం పంతులుగారికి తెలీదు. తెల్సింతర్వాత సినిమాలపట్ల మరింత తేలికభావాన్ని ఏర్పర్చుకున్నాడు. నేను యిన్నాళ్లూ సినిమాలు చూడకపోవడమే మంచిదైంది అనుకున్నాడు. మేనేజరు దగ్గర శెలవుతీసుకుని నారాయణరావు పంతులుగార్ని స్టూడియో ఆవరణంతా తిప్పి చూపించేడు. అంతా చూసేక పంతులుగారికో సందేహం వచ్చింది.

"ఇంతబాగా కట్టేరుకదా- దీనికి మొత్తం ఎంత ఖర్చయి వుంటుందంటావ్రా?"

"కోట్లల్లోనే అయివుంటుంది"

"ఆ డబ్బంతా ఆయనొక్కడే పెట్టుకున్నాడా లేక ఎవరిదగ్గరైనా అప్పుతీసుకున్నాడంటావా?"

"బహుశా గవర్నమెంటుదగ్గర తీసుకునుండొచ్చు"

"ఎంత తీస్కున్నాడో?"

"నాకు తెలీదు"

"తొందరలేదు. నేను యీ వూర్నించి వెళ్లేలోగా కనుక్కుని చెప్పు"

"అలాగే"

ఇద్దరూ ఫస్ట్‌ఫ్లోరు దగ్గరకి వెళ్లేరు. ఫ్లోర్‌బయట గుమ్మడి వెంకటేశ్వరరావు మేకప్‌వేసుకుని పేకాడుతున్నారు. నారాయణరావుని చూస్తూనే చేతిలోని ముక్కలు పడేసి ఆప్యాయంగా పలకరించేరు. వారి పలకరింపుల్లో ఎంతో చనువు, స్నేహం కనిపించేయి. పంతులుగారికి గుమ్మడిని పరిచయం చేశాడు నారాయణరావు.

"ఈయన గుమ్మడి వెంకటేశ్వర్రావుగారు మావయ్యా! బ్రహ్మాండమైన కేరక్టర్ ఏక్టర్. వీరు నటించిన సినిమాలు అయిదువందలు దాటే వుంటాయి. అక్కినేని, యన్టీ రామారావుల తర్వాత వీరే సీనియర్ నటులు" అంటూ ఓ రెండు నిమిషాలపాటు పరిచయవాక్యాలు చెప్పేడు. నర్సింపంతులుగార్ని కూడా గుమ్మడిగారికి పరిచయం చేసేడు. ముగ్గురూ కుర్చీల్లో కూర్చున్నారు. గుమ్మడిగార్ని ఓ నిమిషంపాటు తదేకంగా చూసేక పంతులుగారు అడిగేరు.

"తమరు గుణసుందరికథ సినిమాలో నటించారేవిటి?" ఆయన చిన్నగానవ్వి "లేదండి. అప్పటికి నేనింకా సినిమాల్లోకి రాలేదు. బహుశా కాలేజీలో చదువుకుంటుండేవాణ్ణనుకుంటాను" అన్నారు.

"పోనీ, నాగయ్యగారు నటించిన యోగివేమనలో నటించేరా?"




# ఏరిన ముత్యాలు

★ యవ్వనంలో కన్నీరు కార్చనివాడు, వార్ధక్యంలో నవ్వనివాడు పాషాణహృదయులే. కన్నీరు కార్చగల హృదయం ఎప్పుడూ మంచిది. చిన్నారిని చూసి నవ్వగల వృద్ధుడు నిజమైన మానవుడు.

--జూశాన్‌తాయర్షి

★ ప్రతి మనిషి కన్నీటిని తుడవాలని నా ప్రబలమైనవాంఛ.

--గాంధీజీ

★ ఫలాపేక్ష లేకపోతే పాపకార్యాలు చేయడానికి ప్రోత్సాహమే లేదు.

--ఉన్నవ లక్ష్మీనారాయణ

★ నీ కర్మకు నీవే కర్తవు. కనుక నీ భవితవ్యాన్ని నీవే నిర్మించుకో.

--వివేకానంద

★ సమస్త కర్తలకు లక్ష్యం ఆనందం.

--రవీంద్రనాథ్ ఠాగూర్

★ తన భావాన్ని చెప్పినవాడు ప్రచారకుడు. తన భావాన్ని ఇతరులలో కలిగించిన వాడు కవి.

--గొర్రెపాటి వెంకటసుబ్బయ్య

★ మానసికంగా అందరూ కవులే

--ఎమర్సన్

★ పద్యాలు రాసినవాడే కవిగాడు. పద్యాలు రాయనంతమాత్రాన కవికాకపోడు. పద్యాలు రాసినా, రాయకపోయినా కవితాత్మ కలవాడే కవి.

--షెల్లీ

★ మర్రివిత్తంత చిన్న పద్యంలో మహావృక్షమంత అనుభవం ఇవ్వగలవాడే మహా కవి.

--బైరన్

★ ప్రేమలోపడ్డ ప్రతివాడూ కవే అవుతాడు.

--ప్లేటో

★ మన నిండునున్నా కవులు అరసున్నాలను పట్టుకొని వేళ్లాడటం మానరు.

--శ్రీశ్రీ

★ తత్వవేత్త కాకుండా ఏ వ్యక్తీ మహాకవి కాలేడు.

--కాలెరిడ్జి

★ ఓ చిన్నకవి 'నాకొక కథావస్తువునిస్తే నా విధిని నిర్వహిస్తాను' అని మొరపెట్టుకున్నాడట. దానికి 'నీకు కావలసింది వస్తువు కాదు, హృదయం' అని జవాబొచ్చింది.

--ఆర్.డబ్ల్యు. గిల్లర్

★ మనలోని భావాల్ని మేల్కొలిపే శక్తిసామర్థ్యాలు గలవాడే కవి.

--గాంధీజీ

సేకరణ: నల్లబెల్లి శ్రీమన్నారాయణ

"అహ్హహ్హ... అది మరీ పాత సినిమా కదండి. అప్పటికి నేను ఏ ఆరవతరగతిలోనో వుండుంటాను. ఏం... మీరు ఆ రెండు సినిమాలు తప్ప మరేసినిమాలూ చూడలేదా?"

"చూడలేదు"

"ఎంచేత?"

"ఎంచేతంటే ఏం చెప్పమంటారు? మా చింతల అగ్రహారంలో సినిమాహాలు లేదు. వెళ్తే రంగాపురంవెళ్లి చూడాలి. మరీ అంత పనిగట్టుకు వెళ్లాల్సినంత మంచి సినిమాలు రావడంలేదని మావూరి రాజుగారు చెప్పేరు"

"అయితే నేను మీకు తెలియదంటారు"

"మీరు గుణసుందరి కథలోను, యోగివేమనలోనూ నటించినప్పుడు మీరు నాకెలా తెలుస్తారు?"

అతని అమాయకత్వానికి గుమ్మడిగారు నవ్వేశారుగాని, నారాయణరావుకి మాత్రం ఆ సంభాషణ యిబ్బందిగానే వుంది. మావగారు యిప్పటి వరకు మర్యాదగానే మాట్లాడుతున్నా, ఏక్షణంలో ఆయన్ని తన అలవాటుప్రకారం ఒరేయ్ అనేస్తారోనని లోలోపల భయపడుతూనే వున్నాడు.

గుమ్మడిగారు నవ్వు ఆపి "నేను తెలియకపోతేపోయింది. కనీసం రామారావు నాగేశ్వర్రావు అయినా తెలుసా లేక వాళ్లూ తెలియదంటారా?" అన్నారు ఆసక్తిగా.

"నాగేశ్వర్రావు నటించిన బాలరాజు సినిమా చూద్దాం అనుకుంటూనే చూడలేకపోయేను. యన్.టి. రామారావు సినిమాలు కూడా చూడలేదు గాని, ఆయన ముఖ్యమంత్రి అయేక, ఆయన గురించి చాలా విషయాలు మా రాజుగారి ద్వారా తెలుసుకున్నానండి"

ప్రొడక్షన్‌బోయ్ కాఫీలు పట్టుకొచ్చేడు. ముగ్గురూ కప్పులు అందుకున్నారు. ఓ రెండు సిప్‌లు చేశాక సడన్‌గా ఓ ప్రశ్న వేశాడు.

"ఇంతకీ మీరు పాటలూ పద్యాలు మీ గొంతుతో మీరే పాడుకుంటారా లేక మీబదులు మీకు ఎవరైనా పాడిపెడతారా?"

గుమ్మడిగారు వస్తున్న నవ్వుని ఆపుకుంటూ జవాబు చెప్పాడు.

"ఇప్పుడు నూటికి నూరొంతులూ సాంఘిక చిత్రాలే వస్తున్నాయండి. వీటిల్లో పాటలున్నా పద్యాలు మాత్రం వుండవు. అవి పౌరాణికాల్లోనే వుంటాయి. ఆ పాటలూ పద్యాల్ని కూడా మేంపాడం. దానికి వేరే గాయకులున్నారు. మేం వాటికి తగ్గట్టుగా పెదవులు కదుపుతాం. గతంలో దాదాపు అందరు నటులూ పాటలుపాడేవాళ్లు కానీ యిప్పుడలాక్కాదు"

గుమ్మడిగారు ప్రస్తుత పరిస్థితి గురించి ఓపిగ్గా వివరించేక పంతులుగారు అసంతృప్తిగా తలఆడించి, పెదవి విరిచేశారు- "అయితే మీకంటే పాతకాలపు వాళ్లేనయం అన్నమాట. మాటలు, పాటలు పద్యాలు అన్నీ చక్కగా రాగాలుతీసిపాడేవాళ్లు. ఇప్పుడు కొంతమందికి మాటలూ డబ్బింగేనట. యింక అందరికీ పాటలూ డబ్బింగ్ అంటున్నారు"

అతని వీపుమీద నారాయణరావు చెయ్యివేసి "యింక చాల్లే మావయ్యా" అన్నట్టుగా చిన్నగా నొక్కేడుగాని లాభంలేకపోయింది. అతను తన అసంతృప్తిని నిర్మొహమాటంగా చెప్పింతర్వాతగాని తన మాటలు ఆపలేదు.

"అయామ్‌సారీ సార్... మా మావయ్యగారికి కొంచెం చాదస్తం ఎక్కువ. మీరేం అనుకోకండి" అన్నాడు నారాయణరావు ఎపాలజిటిక్‌గా.

"భలేవారే... ఆయనేం తప్పుఅన్నారని. ప్రస్తుత పరిస్థితి ఆయన చెప్పినట్టుగానే వుంది గదా" అంటుండగా అసోసియేట్ డైరక్టరు వచ్చి "షాట్‌రెడీసార్" అన్నాడు. గుమ్మడిగారితోపాటు వీరిద్దరూ కూడా లోపలకెళ్లేరు.

అక్కడో ఏడుపుసీన్ జరుగుతోంది. గుమ్మడిగార్ని పోలీసులు అరెస్టుచేస్తే అతని భార్య హృదయవిదారకంగా ఏడుస్తూ నాలుగు డైలాగులు చెప్పడం షాట్‌చేస్తున్నారు. ఆవిడకి తెలుగు రాకపోవడంవల్ల ఆవిడ చెప్పాల్సిన డైలాగుని ఓ నల్లబోర్డుమీదరాసి కెమేరా వెనక నిలబెట్టేరు.

రెండు రిహార్సల్సు అయేక టేక్‌చేశారు. టేక్‌లో ఆవిడ సీసాలోంచి గ్లిజరిన్ తీసి కళ్లల్లో పెట్టుకుని కన్నీళ్లు తెచ్చుకుంది. అదంతా పంతులుగారు గమనిస్తూనే వున్నారు.

రెండో టేక్ ఓకే అయింది. ఆవిడ చాలా





అద్భుతంగా నటించిందని డైరెక్టర్ దగ్గర్నించి అందరూ ఆవిణ్ణి అద్భుతంగా పొగిడేరు. పంతులుగారు మాత్రం చిరాగ్గా బయటకి వెళ్లిపోయేరు. ఆయన వెంట నారాయణరావూ, గుమ్మడిగారూ కూడా బైటకి వచ్చేరు.

''ఏం మావయ్యా... వచ్చేసారు- మాటింగు చూస్తానన్నారుగా?'' అన్నాడు నారాయణరావు కుర్చీలో కూర్చుంటూ.

''నాకిదేం నచ్చలేదురా. ఆవిడ బోర్డుచూసి సంభాషణలు అప్పగించడం ఏవిటి? ఏదో మందు కళ్లల్లో వేసుకుని కన్నీళ్లు కృత్రిమంగా తెచ్చుకోవడం ఏవిటి? ఇంతకీ ఆవిడకి ఎంతి స్తారు?'' అంటూ పంతులుగారు గుమ్మడినడిగే రు.

''లక్షరూపాయలు యిస్తారు''

''లక్షే'' అంటూ నాలుగు క్షణాలపాటు ఆశ్చ ర్యాన్ని అనుభవించేక మరో ప్రశ్నవేసాడు.

''ఆ లెక్కన నాగయ్యగారికెంతిచ్చేవారో''

''ఆయన అప్పట్లోనే దాదాపు లక్షతీసుకు నేవారని చెప్తుంటారు''

''ఇవ్వాలియివ్వాలి... ఈవిడకే లక్షయిస్తున ప్పుడు ఆయన కెందుకివ్వకూడదు? మాటలూ ఆయనే మాట్లాడి, పాటలూ ఆయనే పాడి, ఆయన కన్నీళ్లూ ఆయనే తెచ్చుకునేటప్పుడు ఆయనకి లక్షేవిటి... పదిలక్షలు యివ్వొచ్చు''

ఆయన మాటలకి గుమ్మడిగారు నవ్వుతూనే వున్నారు. మరో పదినిమిషాల తర్వాత ఆయన దగ్గర సెలవుతీస్కుని సెకెండ్ ఫ్లోర్‌కి వెళ్లేరు.

అక్కడ ఫైట్‌సీన్ తీస్తున్నారు. హీరో చుట్టూ ఎనిమిదిమంది రౌడీలు వికటంగా నవ్వుతూ నిలబడ్డారు. అందరూ తమ తమచేతుల్లోని ఆయుధాల్ని కెమేరాకి కనిపించేలా పైకిఎత్తి పట్టుకుని చూపించేరు. తర్వాత ఫైట్ ఆరంభ మైంది. ఒక రౌడీతోనే హీరో ఫైట్‌చేస్తున్నారు. మిగతావారు ఫ్లోర్‌బైటకి వెళ్లిపోయేరు. ఆ షాట్ తర్వాత మరో రౌడీ హీరోమీద కలియబడ్డాడు. అలా ఓ రెండుగంటలపాటు పంతులుగారు ఫైట్‌సీన్‌ని ఆసక్తిగా చూసేరు.

హీరో ఒక్కదెబ్బకొట్టేసరికి అంతంత బలా ఢ్యులైన రౌడీలు కూడా పెద్దగా రంకెలువేస్తూ ఎగిరి ఎగిరి పడిపోవడం కృత్రిమంగా తోచినా సరదాగానే అనిపించిందాయనకి.

తర్వాత ఫ్లోర్‌నుంచి బైటికి వస్తూ ''ఈ కాలం సినిమాలు చెడిపోయేయనుకున్నాను గాని యుద్ధాలు మాత్రం యింకా శాస్త్రబ ద్ధంగానే చూపిస్తున్నారు'' అన్నాడు.

''శాస్త్రబద్ధంగా అంటే... ఏ శాస్త్రానికి బద్ధులై చూపిస్తున్నారంటారు?'' నారాయణరావు ఆశ్చ ర్యంగా అడిగేడు.

''ఇంకే శాస్త్రంరా... యుద్ధశాస్త్రం. మహాభార తంలో భీష్ముడు వీరులందరికి యుద్ధనియ మాలు గురించి చెప్పేటప్పుడు ఏం అన్నారు- ఒక యోధుడిమీదకి ఒక్కయోధుడే ఒకసారి కలియబడాలి తప్ప పదిమంది కలిసి ఒకడి మీద కలియబడకూడదు అన్నాడా లేదా?''

ఆమధ్య వచ్చిన టీవీ 'మహాభారతం'లో అలా అన్నట్టే గుర్తు. కానీ యిక్కడ ఆ నీతి ఎవరు పాటించేరట?

''యిప్పుడు నువ్వు ఏంచూసేవురా? ఆ కథానాయకుడి ఎదుట ఎనమండుగురు రౌడీ లు కత్తులూ కటార్లు పట్టుకు నిలబడ్డా. పోట్లాట ఆరంభమయ్యేసరికి ఒక్కొక్కడే వచ్చి అతన్తో యుద్ధంచేసారు. మిగతావాళ్లు బైటకి పోయి సిగరెట్లు కాల్చుకోవడమో, పేకాట ఆడు కోవడమో చేసేరుగదా అది ధర్మయుద్ధంకాక దొమ్మీ దెబ్బలాటవుతుందా? ఒకటి రెండుసార్లు మా చింతల అగ్రహారంలో కూడా కొట్లాటలు జరిగేయి. ఒక్కడిమీద నలుగురైదుగురు ఒక సారి కలబడి, చేతికొచ్చిన దెబ్బ, కాలికొచ్చిన తన్నూ తన్నేసి అవతలవాడికి సున్నంలోకి ఎముకలేకుండా చావగొట్టేరు- కానీ సినిమాల్లో అలాక్కాదే''

పంతులుగారు సినిమా ఫైట్‌ని ప్ర శంసిస్తూనే కారు ఎక్కేరు.

అతని కామెంట్‌కి నారాయణరావు లోలోపల నవ్వుకున్నా పంతులుగారి కామెంట్‌ని మరో వైపు నించి పరిశీలిస్తే సినిమా ఫైట్స్ ఎంత అసహజంగా వున్నాయో అర్థమయింది. పది మంది కలిసి ఒక్కణ్ణి కొట్టాలనుకోవడమే దు ర్మార్గం. మరీ దుర్మార్గానికి దిగినవాళ్లు హీరోతో ఒకరి తర్వాత ఒకరొచ్చి ధర్మయుద్ధం ఎందుకు చేస్తారు? ఈ విషయాన్నే గతంలో

ఓసారి ఓ స్టంట్ మాస్టర్ని అడిగితే అతను చిన్నగా నవ్వేసి "సినిమాయే అసహజం అయినప్పుడు అందులో ఫైట్సు, పాటలూ కూడా అసహజంగానే వుంటాయి కదండీ" అని జవాబు చెప్పడం నారాయణరావుకి గుర్తొచ్చింది.

అన్నపూర్ణా స్టూడియో తర్వాత పద్మాలయా స్టూడియో చూసి మధ్యాహ్నాం భోజనం టైముకి యింటికి చేరుకున్నారు. భోజనం చేస్తూ తాను చూసిన షూటింగు విశేషాల్ని కామేశ్వరమ్మకి వివరించేడు.



కలకత్తా వెళ్లిన రవీంద్రనాథ్ చటోపాధ్యాయ తీవ్రమైన అశాంతికి గురయ్యాడు.

అతని తండ్రి వీరేంద్రనాథ్‌కి గుండెపోటు రావడం ఇది రెండోసారి. హాస్పటల్లో ఇంటెన్సివ్ కేర్‌లో నాలుగు రోజులు ఉంచితేగాని హార్ట్ బీట్ నార్మల్‌కి రాదు. ముగ్గురు స్పెషలిస్టులు రాత్రింబగళ్లు అతన్ని అబ్జర్వ్ చేస్తూ ట్రీట్మెంటుఇచ్చేరు. హార్ట్ ఆపరేషన్ చేయక తప్పదన్నారు. కానీ వీరేంద్రనాథ్ ఆపరేషన్‌కి అంగీకరించలేదు.

"మరేం ఫర్వాలేదు నాన్నా... ఇప్పుడు ఓపెన్ హార్ట్ సర్జరీ చాలా సులభం అయిపోయింది. పైగా యీ హాస్పటల్లోని సర్జన్సుకి చాలా మంచి అనుభవం, సామర్థ్యం ఉన్నాయి" అంటూ తండ్రికి ధైర్యం చెప్పేడు రవీంద్రనాథ్.

"నేను వాళ్ల అనుభవాన్నీ సామర్థ్యాన్నీ శంకించడం లేదు. నా ఆయుర్దాయాన్నే నేను అనుమానిస్తున్నాను. నాకున్నది నువ్వొక్కడివే. నీ పెళ్లి కళ్లారా చూడాలన్నదే నా ఆశయం. మీ అమ్మ ఆశయంకూడా అదే"

"నాపెళ్లి సంగతి తర్వాత ఆలోచిద్దాం. మీకు ఎంత వేగంగా ఆపరేషన్ జరిగితే అంత మంచిదని డాక్టర్లంటున్నారు"

"అందుకేరా... నీపెళ్లి ఎంత వేగం అయితే అంత మంచిదని నేనూ అనుకుంటున్నాను. నీ పెళ్లయిన మరుక్షణం నేను ఆపరేషన్ థియేటర్‌కి వెళ్లిపోతాను. పెళ్లి కాకుండా నేను ఆపరేషన్‌కి సిద్ధపడితే దాని రిజల్టు ఎలా ఉంటుందో ఎవరు చెప్పగలరు?" వీరేంద్రనాథ్ కళ్లల్లో నీరు తిరిగింది. ఆ మాటలకి రవీంద్ర కూడా చలించేడు. అతని తల్లి సంగతి సరేసరి. భర్తకి గుండెపోటు వచ్చిందగ్గర్నించి ఆమె కళ్లు వర్షిస్తూనే ఉన్నాయి. వీరేంద్రనాథ్ తన ఆపరేషన్ని వాయిదా వేసి హాస్పటల్ నించి డిశ్చార్జ్ అయి ఇంటికి వచ్చేశాడు. బెడ్ రెస్టు అవసరమని డాక్టర్లు గట్టిగా చెప్పడం వల్ల మంచంమీదనుంచి కదలకుండానే తన స్నేహితులకి ఫోన్‌చేసి తన కొడుక్కి అర్జంటుగా పెళ్లిచెయ్యాలని, వెంటనే ఓ సంబంధం చూడమని చెప్పేడు. రవీంద్ర ఓ రోజంతా ఆలోచించేక సుజాత విషయం తల్లిదండ్రులకి చెప్పేడు.

వాళ్లకీ మతాభిమానం, భాషాభిమానం ఉంది. అంతకుమించి తమ ఒక్కగానొక్క కొడుకు మంచి అమ్మాయిని పెళ్లిచేసుకుని సుఖంగా బతకాలనే కోరిక మరింత ఉంది. సుజాత తెలుగు అమ్మాయి అయినా ఫర్వాలేదు రాజీ పడొచ్చనుకున్నారు. కానీ విధవరాలు అనేసరికి వాళ్లు ఆలోచనలో పడ్డారు. తమకున్నది ఒక్కగానొక్క కొడుకు. పదితరాల వరకూ సరిపడే ఆస్తిపాస్తులు లేక పోయినా రవీంద్రనాథ్ తన జీవితమంతా సుఖసంతోషాల్తో గడపగలిగే సిరిసంపదలు సంపాదించేరు. అలాంటప్పుడు ఓ విధవరాల్ని పెళ్లిచేసుకోవడమన్న విషయం వారికి ఏ కోణం నుంచి చూసినా సబబు అనిపించలేదు. కానీ రవీంద్రనాథ్ సుజాతని తప్ప మరెవ్వర్నీ చేస్కోనని తెగించి చెప్పడంతో వాళ్ల అభ్యంతరం కాస్తా మంచు ముక్కలా కరిగిపోయింది. వాళ్లు అంగీకరించిన తర్వాత తానింకా సుజాత తల్లి

దండ్రుల్ని కలిసి మాట్లాడలేదని చెప్పేడు.

"ఏం... ఎందుకు మాట్లాడలేదు? మేం ఒప్పుకోమనా?" తల్లి అడిగింది.

"మీరు ఒప్పుకుంటారని నాకు తెలుసు. కానీ సుజాత ఒప్పుకున్నాక కానీ వాళ్ల పెద్దవాళ్లనడగడం భావ్యం కాదని ఊరుకున్నాను."

"అంటే ఆ అమ్మాయి ఇంకా ఒప్పుకోలేదా?"

"లేదు... కానీ ఒప్పుకుంటుందనే నా నమ్మకం"

"ఒప్పుకోకేం చేస్తుంది... విధవరాల్ని పెళ్లి చేస్కోడానికి అభ్యంతరం అంటూ ఉంటే మన కుండాలిగాని ఆ అమ్మాయికి ఎందుకుంటుంది?"

"ఆ అమ్మాయికి ఎటువంటి అభ్యంతరమూ ఉండదనే నావూహ. కానీ వాళ్లది చాలా సాంప్రదాయమైన కుటుంబం"

"అంటే మన కుటుంబానికి సాంప్రదాయం లేదా?"

"అదికాదు నాన్నా... వాళ్లది ఎంత సాంప్రదాయబద్ధ కుటుంబమైనా సుజాత అభిప్రాయం తెల్సుకున్నాక వాళ్ల పెద్దవాళ్ళని ఒప్పించగలననే నమ్మకం నాకుంది"

"నువ్వు ఎప్పుడు ఒప్పిస్తావో, దానికెంత టైము పడుతుందో, నా ఆపరేషన్ ఎంత వేగంగా జరిగితే అంత మంచిదని డాక్టర్లు నీతోనే చెప్పేరు. నన్ను ఆపరేషన్ చేయించుకోమని నువ్వే ఒత్తిడి చేస్తున్నావు. నీ పెళ్లయితే తప్ప ఆపరేషన్ చేయించుకోకూడదని నా నిర్ణయం. ఈ పరిస్థితుల్లో ఏంచేస్తే బాగుంటుంనో నువ్వే ఆలోచించి, ఓ నిర్ణయం తీస్కో".

రవీంద్రనాథ్ తీవ్రమైన ఆలోచనలో పడ్డాడు. సుజాత ఈ రోజు లేకపోతే, కొంతకాలం తర్వాతైనా వివాహానికి అంగీకరిస్తుందని తనకి తెలుసు. కాకపోతే తన తండ్రి అనారోగ్య పరిస్థితిని వూహించకపోవడంచేత ఆవిడ తన నిర్ణయాన్ని ఎప్పుడు చెప్పినా ఫర్వాలేదని భరోసా యిచ్చేడు. అంచేత ఆమె యీ విషయంలో తొందరపడే అవకాశం లేదు. ఇక్కడ పరిస్థితిని వివరిస్తూ వుత్తరం రాయాలనుకున్నాడు. కానీ ఎక్కడికి రాయాలి? వాళ్లయింటికిరాస్తే ఆ వుత్తరాన్ని వాళ్ల పెద్దవాళ్లు చూడొచ్చు. చూస్తే చాలా రభస అవుతుంది. డాన్స్ కాలేజికిరాస్తే, అది మిగతా స్టూడెంట్స్ ఎవరికైనా అందితే వూరువూరంతా గేలచేస్తారు. అది మరీ ప్రమాదం. సుజాతతో ఫోన్‌లో మాట్లాడినా యిదే ప్రమాదం కలగొచ్చు. పైగా యిలాంటి విషయాలు ఫోన్లు మీద, వుత్తరాల ద్వారా కాకుండా, పెర్సనల్‌గా మాట్లాడి తెల్సుకుంటేనే బాగుంటుంది.

ఇప్పుడేం చెయ్యాలి?

తను ఆఫీసుకి పెట్టిన లీవ్ కూడా అయిపోతోంది. తను ఆ కంపెనీకి కొత్తగా వెళ్లేడు, పైగా తనది బాధ్యతాయుతమైన ఆఫీసరు వుద్యోగం! లాంగ్ లీవ్ యివ్వరు. ఈ పరిస్థితుల్లో నాన్నగారిని విశాఖపట్నం తీసుకువెళ్లి, అక్కడేదైనా హాస్పటల్లో ఇన్‌పేషెంట్‌గా జాయిన్ చేయిస్తే అతనికీ మంచిది, సుజాత విషయంలో తను సిన్సియర్‌గా, క్విక్‌గా పనిచేయడానికీ వీలవుతుంది.

కాని, అతని అభిప్రాయానికి రవీంద్రనాథ్ అతని భార్య ఎంతమాత్రం ఒప్పుకోలేదు. వీరేంద్ర ఎంతో కన్విన్స్ చేసిన మీద సరేనన్నాడు. మర్నాడే బయలుదేరి విశాఖపట్నం చేరుకున్నారు.

హాస్పటల్లో తండ్రిని ఎడ్మిట్ చేశాక, డేన్స్ స్కూల్లో సుజాతని కల్సుకుని తన పరిస్థితి వివరించేడు. "మీ నిర్ణయాన్ని ఎప్పుడు చెప్పినా ఫర్వాలేదు, ఎందుకంటే, అప్పటికీ నేను బేచలర్‌గానే వుంటానని నేనే చెప్పేను. కానీ, ఆ భగవంతుడు నా వివాహానికి, మానాన్నగారి జీవన్మరణ సమస్యకి చిత్రమైన లంకెపెట్టేడు" అంటూ ఆమె నిర్ణయం గురించి తను ఎందుకింత ఆతృతపడుతున్నదీ చెప్పలేక చెప్పేడు.

ఇప్పుడు ఆందోళనపడడం సుజాత వంతు అయింది. ఏంచెప్పాలి? తన వివాహం గురించి తనో నిర్ణయం తీసుకోలేదని చెప్తే అది ఆత్మవంచనే అవుతుంది. అయితే తన నిర్ణయాన్ని బహిర్గతం చేయడానికే ధైర్యం చాలడం లేదు.

రవీంద్రని పెళ్లి చేస్కోవడం తనకిష్టమేనని

చెప్తే, అతనో అతని తల్లిదండ్రులో తన యింటికొచ్చి పెళ్లి విషయం మాట్లాడతారు. అక్కడితో యింట్లో యుద్ధం ఆరంభం అవుతుంది. ఆ సంఘర్షణని వూహించుకోడానికే భయమేస్తోంది.

ఆత్మవంచన చేసుకుని, యీ పెళ్లి తనకిష్టం లేదని చెప్పేస్తే? రవీంద్ర మరో అమ్మాయిని పెళ్లి చేస్కోడు. అతనికి పెళ్లికాకపోతే వాళ్ల నాన్నగారు ఆపరేషన్ చేయించుకోరు. చేయించుకోకపోతే అతని ప్రాణాలకే ప్రమాదం కలుగుతుంది.

ఉదయం రవీంద్రతో మాట్లాడేక, సాయంకాలం వరకూ ఆలోచించి భగవంతుని మీద భారం వేసి తన అంగీకారాన్ని రవీంద్రనాథ్‌కి చెప్పింది.

"రేపు వుదయమే మీనాన్నగారిని కలిసి మాట్లాడతాను. ఎందుకంటే మీపాలిట విలన్ అయిన మీ తాతగారు హైదరాబాద్ నించి వచ్చేలోగా యీ కార్యక్రమం జరిగిపోవాలి" అంటూ నవ్వుతూ చెప్పి సంతోషంగా వెళ్లిపోయేడు.

సుజాత డేన్స్ స్కూల్ నించి వచ్చి యింట్లోకి అడుగుపెడుతూ, హాల్లో వున్న వ్యక్తిని చూసి ఠక్కుమని ఆగిపోయింది.

అతను సుబ్రహ్మణ్యం!

సుబ్రహ్మణ్యం సుజాత మామగారు. అంటే సుజాత భర్త వరప్రసాద్‌కి సాక్షాత్తు తండ్రిగారు. వరప్రసాద్ యాక్సిడెంట్‌లో చనిపోయే, దానికి సంబంధించిన తతంగాలన్నీ పూర్తయేక సుబ్రహ్మణ్యంగారు యీ యింటికి రావడం యిదే ప్రథమం. ఆయనేకాదు ఆ యింటికి సంబంధించిన ఏ ఒక్కరూ యింతవరకూ యీ యింటి గుమ్మం తొక్కలేదు; తనని ఎవరూ పలకరించలేదు. మరిప్పుడీయన ఎందుకొచ్చినట్టు?

అతన్తో చలపతి, సుభద్ర మాట్లాడుతున్నారు. ఓ గోడకి ఆనుకుని వాణీ నిలబడింది. అంతవరకూ ఏం సంభాషణ జరిగిందో తెలియదుగాని, అందరూ సీరియస్‌గా, గంభీరవదనాలతోనే కనిపించేరు. కొన్ని క్షణాలపాటు తటపటాయిస్తూనే సుజాత హాల్లోకి అడుగుపెట్టింది. మేడమీద కెళ్లాలంటే హాల్లో నించే వెళ్లాలి. మరోదారి లేదు.

"ఏమ్మా, బాగున్నావా?" సుబ్రహ్మణ్యం చాలా యథాలాపంగా పలకరించేడు, అందులో అభిమానమూ కనిపించలేదు, అధికారమూ కనిపించలేదు.

"బాగున్నానండి" అంటూ అక్కడే వాణీ పక్కన నిలబడింది. నిజానికి అక్కడ వుండాలని లేదు. కానీ, వుండకపోతే బాగోదేమోనని నిలబడింది. ఆమె యిబ్బందిని చలపతి గమనించి - "ఫర్వాలేదు వెళ్లమ్మా" అన్నాడు. సుజాత తన గదిలోకి వెళ్లిపోయి తడారిపోయిన గొంతులో ఓ గ్లాసుడు నీళ్లుపోసుకుని మంచంమీద కూర్చుని, హాల్లోని మాటలు వినిపిస్తాయేమోనని చెవులు రిక్కించింది.

సుబ్రహ్మణ్యం వచ్చింది ఓ ముఖ్యమైన పనిమీదే. అతనికి ముగ్గురు కొడుకులు. మూడో అబ్బాయి భార్య సుజాత. అతను చనిపోయేక సుజాతని చలపతి తీసుకొచ్చి తన యింట్లోనే వుంచేడు. ఆ తర్వాత "అత్తారింటికి పంపరేం" అని వాళ్లూ అనలేదు. "మా అమ్మాయిగా సుజాత మా యింట్లోనే వుంటుందని చలపతీ అనలేదు. ఈమధ్యకాలంలో వుభయ కుటుంబాల మధ్య వుత్తరాలూ లేవు, రాకపోకలూ లేవు. ఇప్పుడు సుబ్రహ్మణ్యంగారి ఆస్తి పంపకాలకొచ్చింది. పద్ధతి ప్రకారం ముగ్గురు కొడుకులకీ మూడువాటాలు సమానంగా వెయ్యాలి. అయితే, మూడో కొడుకు చనిపోయేడు. కోడలు బతికున్నా తమ యింట్లో, తమ కోడలిగా వుండడం లేదు. పుట్టింట్లో తల్లిదండ్రులతో వుంటోంది. అలాంటప్పుడు ఆవిడ భర్త వాటా ఆవిడకివ్వాలా? వద్దా? ఆవిడకి పిల్లలుంటే, అదో పద్ధతి! వాళ్ల సంరక్షణార్థం వాటా యివ్వకతప్పదు. కానీ యిప్పుడు సుజాత ఆ యింటితో తెగతెంపులు చేసుకున్నట్టా లేక ఆ యింటికోడలిగా అక్కడ వుందామనుకున్నట్టా?

ఈ విషయాలు నిష్కర్షగా, నిర్మొహమాటంగా తేల్చుకోవాలనే సుబ్రహ్మణ్యం ఇప్పుడొచ్చేడు. ఔను, కాదు, యీ రెండు సమాధానాలకి మధ్య ఆమెకు రాబోయే పదిలక్షల రూపాయల వాటా వుంది. "నేను ఆ యింటి కోడల్నే" అని ఆమె చెప్తే పదిలక్షల ఆస్తి వస్తుంది కానీ,

ఆమె అత్తవారింట్లో వుండాలి.

"చూడండి చలపతిరావుగారూ! నేను ప్రాక్టికల్‌గా ఆలోచించే మనిషిని కాబట్టే, యీ ముసుగులో గుద్దులాట యిష్టంలేక, మీతో యీ విషయం డిస్కస్ చేద్దామని వచ్చేను. నేను మరీ పాతకాలం మనిషినీకాదు, అలాగని కొత్తదనం పేరిట సాంప్రదాయాల్తో ఆడుకునేటంత బరితెగింపూ లేదు నాకు. అమ్మాయి విషయం ఆలోచించడంలో రెండంటే రెండే పద్ధతులున్నాయండి" అంటూ ఆగి చుట్ట వెలిగించేడు.

సుజాతకి అక్కడ జరుగుతున్న మాటలన్నీ స్పష్టంగానే వినబడుతున్నాయి. మరింత స్పష్టంగా వింటానికి గదిలోనించి వరండాలోకి వచ్చింది.

"ఆ రెండుపద్ధతులూ ఏవిటని అడుగుతాను. ఎంతైనా మీరు మోడర్న్ కల్చర్‌ని అకళింపు చేస్కుని, పాతలోనించి కొత్తలోకి చాలా దూరం నడుచుకొచ్చేశారు. కాబట్టి నా ఆలోచనకీ, మీ ఆలోచనకీ మధ్య చాలా తేడా కనిపించొచ్చు"

"ఇంతకీ మీరు చెప్పదల్చిన ఆ రెండు విషయాలేవిటో చెప్పనే లేదు" చలపతి కాస్త అసహనంగానే అన్నాడు.

"ఆ పాయింటుకే వస్తున్నాను. మా కోడలికి మేం ఆస్తిలో వాటా యివ్వడం మా ధర్మం, మా బాధ్యతా కాబట్టి, సంతోషంగానే యిస్తాం కానీ, ఎప్పుడు? సుజాత మా కోడలిగా జీవితాంతం మా యింట్లో వుండిపోయినప్పుడిస్తాం. అందుకు మీరు అంగీకరిస్తే రేపే సుజాతని మా యింటికి తీసుకువెళ్తాను- ఏవంటారు?"

అందరూ వూపిరి బిగపట్టి వింటున్నారు. సుజాత అయితే వూపిరి తీయడం మర్చిపోయింది.

సుజాత మళ్లీ అత్తవారింటికి వెళ్లాలా? వద్దా? అని యింతవరకూ ఎవరూ ఆలోచించలేదు.

తన మామగారు అడిగిన ప్రశ్నకి తన తండ్రి ఏంసమాధానం చెప్తాడా అని సుజాత ఒళ్లంతా చెవులు చేసుకుని వినసాగింది. కానీ చలపతి జవాబు చెప్పకుండా ఓ నిమిషం తర్వాత అన్నాడు-

"మీరన్న రెండో పద్ధతి ఏఁవిటండి?"

"ఒకవేళ మీ అమ్మాయిని మీ యింట్లో మీ కూతురిగానే వుంచేసుకుని, ఆవిడ భవిష్యత్ నిర్ణయం మీరే చేస్తానంటే నాకుగాని, నా కుటుంబంలో ఏ ఒక్కరికిగాని అభ్యంతరం లేదు. కాకపోతే యిరవై ఏళ్లపాటు మీ అమ్మాయిగా పెరిగి, ఎనిమిదినెలలు, మా కోడలిగా మారి, మళ్లీ మిగతా డబ్భై తొమ్మిది సంవత్సరాల నాలుగునెలలూ మీ కుమార్తెగా మీ యిష్టాయిష్టాలకి లొంగి బతికే సుజాతకి మేం మా ఆస్తిలో ఎటువంటి వాటా యివ్వనక్కర్లేదని మా అందరి అభిప్రాయం"

సుబ్రహ్మణ్యం చెప్పడం పూర్తయింది. సమాధానం కోసం తొందరపెట్టేడు. కానీ, ఇది నిల్చున్నఫళాన జవాబు చెప్పెయ్యగల సమస్య కాదు.

ఓ ఆడదాని నిండు జీవితానికి సంబంధించిన సమస్య.

సాంప్రదాయాలు, ఆచారాల్తో పెనవేసుకున్న సమస్య.

"ఓ వారం పదిరోజులు గడువివ్వండి. ఏ విషయమూ ఆలోచించి జవాబు చెప్తాను" అన్నాడు చలపతిరావు.

ఈ విషయాన్ని అటోయిటో తేల్చేసుకుని బండి ఎక్కుదామని బాపట్లనుంచి వచ్చిన సుబ్రహ్మణ్యం చలపతి సమాధానంతో అసంతృప్తి ఫీలయ్యాడు. ఆ రాత్రి భోంచేసి వెళ్లమన్నా వినకుండా వెళ్లిపోయేడు. సమాధానం చెప్పడానికి పదిరోజులు టైము యిచ్చేడు.

అతను వెళ్లిపోయిన ఓ గంటా గంటన్నరవరకూ ఎవరూ మాట్లాడలేదు. అందరూ అక్కడే వున్నారు. కానీ ఒకర్తోఒకరు మాట్లాడుకోలేదు.

సుజాత మనస్థితి విచిత్రంగా తయారైంది. గతాన్ని మర్చిపోయి, భవిష్యత్తుకి పునాదివేసుకోవాలని యిప్పుడిప్పుడే అనుకుంటోంది. రవీంద్రనాథ్‌తో యిప్పుడే ఓ గంట క్రితం తన ఆమోదం తెలిపింది. కానీ యింటికొచ్చేసరికి గతాన్ని తవ్వడానికి సుబ్రహ్మణ్యం గునపం, పలుగూ పట్టుకొచ్చేడు. "నా భవిష్యత్తు గురించి ఏం ఆలోచించేవు డాడీ" అని తనకుతానుగా అడగకుండానే, యిప్పుడు తన తండ్రికి





ఆలోచించవలసిన అవసరం ఏర్పడింది.

అతను ఆలోచిస్తాడు.

తన భవిష్యత్తు నిర్ణయిస్తాడు.

అయితే అతని నిర్ణయం ఎలావుంటుందో ఆమె వూహకి అందలేదు. తన తల్లిదండ్రులు తమకు తామే ఆలోచించరు. తనతో సంప్రదిస్తారు. ఆ సంస్కారం వాళ్లకుంది. కానీ వాళ్లు అడిగినప్పుడు తనేం చెప్పాలి. రవీంద్ర గురించి చెప్పాలి... చెప్తే ఏమవుతుంది? ఒకవేళ తన తల్లిదండ్రులు తనతో ఏ కారణంవల్లనైనా సంప్రదించకపోతే? రవీంద్ర, రేపువచ్చి తన తండ్రితో మాట్లాడతానన్నాడు. అతన్ని రేపురావద్దని చెప్పాలి. నాలుగైదురోజులు ఆగితే తప్ప తనతండ్రి ఓ నిర్ణయానికి రాడు... రాలేడు. ఈలోగా రవీంద్ర విషయం తెలియడం మంచిది కాదేమో.

★ ★ ★

చలపతికి ఆలోచనల్తో నిద్రపట్టడంలేదు. సుభద్ర పరిస్థితీ అలాగే వుంది. సుబ్రహ్మణ్యం వచ్చేడు, సుజాతని పంపడం గురించి అడిగేడు. కానీ అతను చెప్పిన రెండు పద్ధతుల్లో ఏ పద్ధతిని అతను మనస్ఫూర్తిగా కోరుకుంటున్నట్టు?

బాగా ఆలోచించిచూస్తే "మా అబ్బాయి మరణంతో మీకూ మాకూ తెగతెంపులు అయిపోయినట్టే- మీ అమ్మాయిని మీ యిష్టంవచ్చినట్టు చేస్కోండి, మాకేం అభ్యంతరంలేదు..." ఈ పాయింటుని సుబ్రహ్మణ్యం కావాలని నొక్కి నొక్కి చెప్పేడు. అంటే సుజాతని పుట్టింట్లో వుంచి, చేతులు దులిపేసుకోవడమే అతనికీ యిష్టంలా కనిపిస్తోంది. అలాచేయడంవల్ల అమ్మాయిని వాళ్లు జీవితాంతం పోషించక్కర్లేదు; పైగా పదిలక్షల ఆస్తీ యివ్వక్కర్లేదు.

పదిలక్షలు!

చలపతి ఆలోచనలు తెగడంలేదు. నిర్ణయం చెప్పడానికి యింకా పదిరోజులుంది కదాన్నధీమా అతని కళ్లకి కాస్త నిద్రపట్టించింది.

శంకరానంద్ ఆఫీసునుంచి యింటికిరాగానే సుబ్రహ్మణ్యంగారు వచ్చినసంగతి, అతను చెప్పినవిషయాలూ వాణీ వివరించడంవల్ల మంచంమీద పడుకుని ఆ దంపతులూ సుజాత విషయమే ఆలోచిస్తున్నారు.

"సుజాతని యిక్కడేవుంచి ఆ పదిలక్షలు యిస్తే బాగుంటుందికదా" వాణీ తిరుగుతున్న సీలింగ్‌ఫాన్‌వైపు చూస్తూ అంది.

"బాగుంటుంది, కానీ ఆయనయివ్వడు"

"ఎందుకివ్వడు?"

"ఇచ్చేవాడే అయితే రెండుక్లాజులు పెట్టి ఏదోఒకటి ఎంచుకోండి అనేవాడుకాదు"

"అతను అలా అన్నాడే అనుకోండి. మావయ్యగారు లాయరుకదా, లా ప్రకారం కోర్టులో కేసువేస్తే పదిలక్షలు రావంటారా?"

"రావచ్చు రాకపోవచ్చు... కానీ యీ విషయంలో మానాన్న ఓ ఆడపిల్ల తండ్రిగానే ఆలోచిస్తాడుగాని కోర్టులో సమస్యని పరిష్కరించేలాయరుగా ఆలోచించకపోవచ్చుని - నా నమ్మకం"

"అలా ఆలోచించకపోడానికి వాళ్లు యివ్వవలసింది రూపాయిరెండు రూపాయలూ కాదుగా - పదిలక్షలు"

"నువ్వాడబ్బుగురించే ఎక్కువ ఆలోచిస్తున్నావు"

"ఔనండి... నేనుడబ్బు గురించే ఆలోచిస్తున్నాను. మనంకాస్త వున్నవాళ్లంకాబట్టి సుజాతని పోషించడం మనకి సమస్యకాకపోవచ్చు. కానీ అదే మనం లేనివాళ్లమైవుంటే ఆ పదిలక్షలు సుజాత జీవితానికి ఎంత వుపయోగపడతాయో ఆలోచించండి"

శంకరానంద్ జవాబు చెప్పలేదు. ఆ తర్వాత వారిద్దరి మధ్య మాటలు జరక్కపోయినా యిద్దరూ సుజాత గురించి, పదిలక్షల గురించే మౌనంగా ఆలోచించసాగారు.

★ ★ ★

హైదరాబాద్‌లో...

అసెంబ్లీ సమావేశాలు జరుగుతున్నాయి. నారాయణరావు పేపరుచదివి యీ విషయం చెప్పినప్పట్నుంచి నర్సింపంతులికి ఆ సమావేశాలు ఎలాజరుగుతాయో చూడాలనిపించింది. ఆ సమావేశాల గురించి తనకున్న సందేహాన్ని బయటపెట్టేడు. వాటిగురించి నారాయణరావు తనకు తెలిసినమేరకు చెప్పి

అతనికి సంతృప్తి కలిగించడానికి ప్రయత్నించేడు.

"గతంలో" రాచరికంతప్ప ప్రజాస్వామికం వుండేదికాదు. రాజులు కొలువుతీరికూర్చున్నప్పుడు రాజ్యంలోని విషయాలు చర్చకువచ్చేవి. అదే చక్రవర్తి తన కొలువులో తన సామంతులతో చర్చలు జరిపేవాడు. అంటే యిప్పుడు ఓ రాష్ట్రప్రభుత్వం తన రాష్ట్రంలోని సమస్యలగురించి, అభివృద్ధికార్యక్రమాల గురించి చర్చలు జరిపితే, దేశంలోవున్న అన్నిరాష్ట్రాల ప్రతినిధులతో కేంద్రంలో చర్చలు జరుగుతున్నాయికదా- ఆ పద్ధతిలోనే అప్పుడూ జరిగేవి.

కాకపోతే రాచరికంలో రాజు చెప్పడం, ప్రజలు వినడం తప్ప రాజుగారి అభిప్రాయాన్ని దాటి ఏదీ జరిగేది కాదు. అంటే, రాజుగారి అభిప్రాయం మంచిదైనా, చెడ్డదైన అదే శాసనంగా చెలామణీ అయ్యేది. రాచరికంలో వుండే ఓ ప్రత్యేక లక్షణం ఏవిటంటే, ప్రతిపక్షం అంటూ ఏదీ వుండకపోవడం. కాబట్టి రాజుగారు చెప్పిందే వేదం, చేసిందే న్యాయం. కానీ ప్రజా ప్రభుత్వంలో అలాక్కాదు. ఎన్నికలు పెట్టి, ప్రజాప్రతినిధులను ఎన్నుకుంటారు. వాళ్లలో ఏ పార్టీకిఎక్కువ బలం ఉంటే అదే ప్రభుత్వంగామారి పరిపాలిస్తుంది. మిగతా పార్టీలు ప్రతిపక్షంగా ఏర్పడతాయి. ప్రభుత్వం ఏ విషయంలో ఏ నిర్ణయం తీస్కున్నా దాన్ని ప్రతిపక్షం కూడా అంగీకరించాలి, అంతమందీ అంగీకరించకపోయినా, మెజార్టీ అంగీకరించక తప్పదు. ఇప్పుడు ఒక్కో విభాగానికీ ఒక్కోమంత్రిని నియమించి, ఆ విభాగానికి సంబంధించిన బాధ్యతలు, అధికారాలు అప్పగిస్తారు. ఓవరాల్‌గా అన్ని విభాగాలమీద ముఖ్యమంత్రికి అధికారం వుంటుంది. ఉదాహరణకి న్యాయం, చట్టం అనే విభాగంలో న్యాయస్థానాలదే అధికారం తప్ప, దానిమీద ప్రభుత్వానికి అధికారం లేదు.

పూర్వం రోజుల్లో ఓ నేరస్థుణ్ణి రాజుగారు విచారించి, అతనికి శిక్ష విధించేవారు. ఆయన్ని అడిగేవారు వుండేవారు కాదు. ధర్మాసనం పేరుతో కొందరు పెద్దలు, ఓ సలహాసంఘంగా నియమించబడి రాజుగారికి సలహాఇచ్చినా, నిర్ణయం మాత్రం రాజుగారిదే. ఇప్పుడు న్యాయవ్యవస్థ మొత్తం ప్రభుత్వం నుంచి వేరుచేయబడింది. అవినీతికి పాల్పడ్డాడన్న ఆరోపణలు కోర్టుకివచ్చినప్పుడు, మామూలు మంత్రులనే కాదు చివరికి ముఖ్యమంత్రిని కూడా కోర్టుకి పిలిచి, విచారణ జరిపిన సందర్భాలు అనేకం ఉన్నాయి. అయితే నేను చెప్పిందంతా యిప్పుడు వాస్తవంగా జరుగుతున్నదనికాదు, ఇలా జరగాలీ అని మనం మన రాజ్యాంగంలో రాసుకున్న విషయాలు చెప్పాను.

రాచరికం పోయిందని థియరిటికల్‌గా అనుకోవడమేతప్ప ప్రజాప్రభుత్వం పేరిట ఇప్పుడు కూడా ఒకడు శాసించడం దాన్ని మిగతావాళ్లు పాటించడమే జరుగుతోంది. ముఖ్యమంత్రి అంటే యిప్పుడు కిరీటంలేని మహారాజు అనే అర్థం చెప్పుకోవాల్సి వస్తుంది. గతంలో ఓ చక్రవర్తిగారు పోయేక, అతని కొడుకు సింహాసనాన్ని అధిష్టించేవాడు. అతని తరవాత అతని కొడుకు తర్వాతవాడి కొడుకు, యిలా వారసత్వం కొనసాగేది. అదిప్పుడు పోయిందా అంటే పూర్తిగా పోలేదు. ఎవరి కొడుకుల్ని వాళ్లు అధికారాల్లోకి తీసుకురావడానికి నానా రకాల అడ్డదారులూ తొక్కుతున్నారు.

నారాయణరావు ఓ గంటన్నరసేపు ఏకధాటిగా చెప్పేక, మావయ్యగారు సంతృప్తి పడిపోయి, అసెంబ్లీకి రానంటాడనుకున్నాడు. కానీ అలా జరగలేదు. పంతులుగారి ఇంట్రెస్టు మరీ పెరిగిపోయింది. ఇంక తప్పదని నిశ్చయించుకుని, ఎసెంబ్లీకి వెళ్ళడానికి చాలాకష్టంమీద పాస్‌లు సంపాదించి, పంతులుగార్ని తీసుకువెళ్లేడు. ఆనందరావు ఎమ్మెల్యే కాబట్టి అతనూ అసెంబ్లీ కొస్తాడు. దేశం గురించి ఓనమాలు కూడా తెల్సుకోకుండా ఎవరు ఏం అడిగినా జవాబులు చెప్పడానికి ఓ హిస్టరీ లెక్చరర్ని వెంటబెట్టుకుని తిరిగేవాడు అసెంబ్లీలో ఎలామాట్లాడుతాడో చూడాలనిపించడమే పంతులుగారి ఇంట్రెస్టుని ఎక్కువ చేసింది.

అసెంబ్లీలో ఆడియన్సు కూర్చోవడానికి మేడమీద ఓ ప్రత్యేకమైన స్థలం వుంది.




పత్రికా విలేఖరులు మరోచోట కూర్చున్నారు. స్పీకరుని చూపిస్తూ అతను ఎవరో, అతని అధికారాలు ఏవిటో నారాయణరావు వివరించేడు. పంతులుగారు, ఆనందరావుకోసం అక్కడ నుంచే కళ్లతో వెదికేడు. కానీ, అన్ని వందల మందిలో అతను కనబడలేదు. ఏదైనా మాట్లాడ్డానికిలేవకపోతాడా, అప్పుడు కనిపించకపోతాడా అని సరిపెట్టుకున్నాడు.

ఎలక్షన్లు ఈ మధ్యనే జరిగి, ప్రమాణస్వీకారం చేసి, యిప్పుడిప్పుడే అసెంబ్లీలోకి అడుగుపెట్టేరు కాబట్టి, పెద్దగా అరుచుకోవడాలు, కాగితాలు విసురుకోవడాలు వుండవనుకున్నాడు నారాయణరావు. కానీ, అతని వూహదెబ్బ తింది. ఎవరు, మొట్టమొదటిసారిగా లేవనెత్తారోగాని బిగ్గరగా వినిపించింది.

ప్రజాస్వామ్యం అనే మాటకి భ్రష్టుపట్టిస్తూ, రిగ్గింగ్‌చేసి గెలవడం కూడా ఓ గెలుపేనా? అది మీ పార్టీ నీచసంస్కృతికి నిదర్శనమని మరోసారి నిరూపించేరు... అని.

అంతే! యింకకేకలు అరుపులూ ఆరంభమయ్యాయి.

"రిగ్గింగ్ చేసింది ఎవరు? మీరు? మా కాండిడేటుని కిడ్నాప్ చేసింది ఎవరు? మీరు? మా ఇద్దరు కార్యకర్తల్ని హత్యచేయించింది ఎవరు? మీరు? పద్ధెనిమిది పోలింగ్ బూత్స్‌ని కేప్చర్ చేసిందెవరు? మీరు? దొంగఓట్లు వేయించింది మీరు. బూత్ నుంచి బాక్సుల్ని దొంగిలించింది మీరు? అర్థంపర్థంలేని వాగ్దానాలతో ప్రజల్ని మభ్యపెట్టింది మీరు? గురివింద గింజవాటంలా మీలో లక్షాతొంభై బొక్కలుంచుకుని మీరు మమ్మల్ని విమర్శించడం ఏమిటి? నాన్సెన్స్."

మళ్లీ కేకలు, అరుపులు వినిపించేయి.

"అసభ్యపదజాలంతో నిందించడం మేం సహించం, వెంటనే ఆ మాటల్ని ఉపసంహరించుకోవాలి" అంటూ ఒకాయన అరిచేడు.

"ఔను... విత్‌డ్రా చేసుకోవాలి, విత్‌డ్రా చేసుకోవాలి" అంటూ ఆ పార్టీ ఎమ్మెల్యేలు నినాదాలు చేశారు.

"మీ అవినీతి పద్ధతుల్ని మీరు వుపసంహరించుకుంటే మేం మా మాటల్ని ఉపసంహరించుకుంటాం"

"అవినీతి పద్ధతులు మీవా? మావా?"

"మీవే మీవే మీవే"

"మావి అవినీతి పద్ధతులైతే ప్రజలెందుకు, యీ ఎలక్షన్లో మీ మాడుపగలగొట్టి మమ్మల్ని గెలిపించేరు?"

"ప్రజల్ని మీరు డబ్బులో ముంచేసి, సారా మత్తులో ముంచేస్తే, వాళ్లు సింహానికీ, గ్రామసింహానికి తేడా తెల్సుకోకుండా ఓట్లుపడేశారు. మీదీ ఓ గెలుపేనా... షేమ్ షేమ్"

"షేమ్ షేమ్" అంటూ మిగతావాళ్ల వంతపాట.

సభాధ్యక్షుడు ఏదోవేదో చెప్తున్నాడు, కానీ ఎవరూ వినడంలేదు. అందరూ అరుస్తున్నారు. వాళ్లేం అరుస్తున్నారో మైకుల్లో వినబడ్డంలేదు. ఎవరోగానీ గాలిలోకి ఓ బైండుబుక్కు విసిరారు.

పంతులుగారు గుర్తించేరు - ఆ విసిరింది మరెవరో కాదు. ఆనందరావు.

"ఒరి వీడి అమ్మకడుప్మాడా... వీడికిదేంపోయేకాలం, యిదేమైనా అసెంబ్లీ సమావేశమనుకున్నాడా లేక వాడి సారాకొట్లో జరిగే కుమ్ములాటనుకున్నాడా?" ఈ మాటలు పంతులుగారు లోపల అనుకున్నాడుగాని ఆవేశంలో అది బైటకే అనేశాడు.

"అతనొక్కణ్ణీ తప్పుపట్టేం లాభం మావయ్యా! అందరూ అలాగే వున్నారుగా" అన్నాడు నారాయణరావు. పంతులుగార్ని తీసుకుని నారాయణరావు బైటకొచ్చేశాడు. ఆరోజు ముఖ్యమంత్రికి, సభాధ్యక్షుడికి ఎంత కోపం వచ్చిందో తెలియదుగాని పంతులుగారికి మాత్రం ఒళ్లు మండిపోయింది.

"యింక వెళ్దాం పద" అన్నాడు నారాయణరావు కారు పార్కింగ్‌వైపు నడుస్తూ.

"ఉండుండు... ఒక్కసారి ఆ వెధవతో మాట్లాడి వెళ్లిపోదాం"

"ఏవెధవ?"

"అదే... ఆనందరావు"

"దేనికి? ఏం మాట్లాడతావ్?"

"వాడు తన బాధ్యతమర్చిపోయి తన నియో

జకవర్గం ప్రజలందరికి అవమానం కలిగించే దుగదా! వాడికి నాలుగు చీవాట్లు వేస్తాను" అంటూ పంతులుగారు ఆనందరావు కోసం అటూయిటూ కలియజూశాడు.

"అందరూ అలాగే వున్నప్పుడు అతణ్ణి ఒక్కణ్ణే ఎందుకు తిట్టడం?"

"వాడొక్కడే నాకు తెల్సు, మిగతావాళ్లు తెలీదు గనుక"

"వద్దు మావయ్యా... అతన్ని మీరు నాలుగు చీవాట్లు వేసినంత మాత్రంచేత అతను మారిపోతాడా? పైగా అతను 'నేను మీ చింతల అగ్రహారం ఎమ్మెల్యేనికాదు మీరు నాకు ఓటు వెయ్యలేదు. అలాంటప్పుడు నన్ను కోప్పడే హక్కు మీకెలా వుంటుంది?' అని అంటే ఏంచెప్తావు?"

నారాయణరావు మాటలు అతను వినడంలేదు. ఆనందరావు కోసం రెండు కళ్లనీ వేయికళ్ళగా చేస్కొని వెదుకుతున్నాడు. దూరంగా ఓ పదిమంది జనంతో ఆనందరావు వెళ్లడం గమనించి పంతులుగారు పరుగు నడకన అక్కడికి వెళ్లేడు. అతన్ని ఆపుచేయడానికి నారాయణరావు చేసిన ప్రయత్నం ఫలించలేదు.

"రేయ్ ఆనందరావ్"

ఆనందరావు ఠక్కున ఆగేడు తనని యిక్కడ ఒరేయ్ అని పిలిచేవాళ్లెవరూ అని ఆశ్చర్యంగా చూశాడు.

నర్సింపంతులు కనిపించేడు.

"మీరా పంతులుగారూ... మీరు ఇక్కడా తగుల్కొన్నారా? యిక్కడ నన్ను అమర్యాదగా పిలిస్తే బాగోదు... ఇంతకీ ఎందుకు పిలిచేరు?"

"అసెంబ్లీలో నీ వ్యవహారం ఏవిటో మేడ మీద కూర్చుని అంతా గమనించాన్లే"

ఆ ముసలాయన తమ నాయకుణ్ణి ఒరేయ్ అని పిల్చి, నిలబెట్టి మాట్లాడ్డం ఆనందరావు అనుచరులకి ఆశ్చర్యంగాను, చిరాగ్గానూ ఉంది.

"గమనిస్తే ఏంటట?"





"ప్రజానీకం నీకు ఓట్లు వేసి గెలిపించింది అసెంబ్లీలో మైకులు విరిచేసి, రౌడీ పనులు చెయ్యడానికా?"

"ఏం... మా పార్టీ ఎమ్మెల్యే కందువాని ఆ పార్టీవాడు లాగేసి అవమానించగాలేంది నేను మైకు విరిచేయడం తప్పొచ్చిందా?"

"అవతలవాడు గడ్డితింటే మీరూ తింటారా?"

"తింటామండి, తింటాం- ఇది ప్రజా ప్రభుత్వం, నలుగురూ ఏ గడ్డి తింటే మేవూ ఆగడ్డే తింటాం... తినాలి కూడా"

"నువ్వు గాంధీగారి జీవితచరిత్ర కాస్తచదివేడిస్తే ఆయన చెప్పిన మాటలు కాస్తయినా ఒంటబట్టి ఉండేవి"

"నేను ఆయన చరిత్ర చదవలేదు, మీరు చదివేరుగా ఆయనగారేం చెప్పేడట?"

"ఎవరైనా నీ ఎడమ చెంపమీద కొడితే వాళ్లకి నీ కుడి చెంపచూపించు, అప్పుడు వాళ్ల తప్పువాళ్లే తెలుసుకుంటారు అని చెప్పేరు"

"అహ్హహ్హ... అది మనదేశానికి స్వతంత్రం రాకముందు ఉండే పోలసీ అయి ఉంటాది. ఇప్పుడు ఎడం చెంపమీద కొట్టినోడికి కుడి చెంపచూపిస్తే ఆ చెంపా ఈ చెంపా రెండూ వాయించేస్తాడు. అప్పుడు మనం డాక్టరుకి చూపించుకోవాలి"

"అంటే ఎదుటివాడుతప్పుగా ప్రవర్తిస్తే నువ్వూ తప్పుగానే ప్రవర్తిస్తావు తప్ప నిన్నీ పదవిలోకి పంపించిన ప్రజల గురించి పట్టించుకోవా?"

వాదన తీవ్రంగా సాగుతోంది అక్కడ మరి కొంతమంది గుమిగూడేరు, పంతులుగార్ని తీసుకుని వెళ్లడానికి నారాయణరావు ఎంత ప్రయత్నించినా లాభం లేకపోయింది. పైగా పంతులుగారు అతని మీద కస్సుమంటూ లేచిచిరాకుపడ్డాడు.

ఆనందరావు సిగరెట్టు నోట్లో పెట్టుకుని, అగ్గిపుల్ల గీసి వెలిగించాడు. "చూడండి పంతులుగారూ... మీరు నన్ను ఒరేయ్ అని పిల్చి ఇలా నిలదీసి అడుగుతున్నందుకు నేనేం ఫీలింగు అయిపోవడంలేదు. ఎంచేతంటే ఇందాక మీకు వినబడ్డాదో లేదో తెలీదు

గాని మా ప్రతిపక్షంవోళ్లు మమ్మల్ని అమ్మా ఆలీ అంటూ మా చెడ్డబూతులు తిట్టేరు. మీరు నాకు తండ్రిలాంటోళ్లు కాబట్టి ఈ మాటల్ని నేను రికార్డులోకి ఎక్కించుకోడంలేదు.

మీరు నాకు ఓట్లేసిన ప్రెజానీకం కోసం వర్రీమీద వర్రీ అయిపోయి అడుగుతున్నారు కాబట్టి చెప్తున్నాను ఇప్పుడు నేను అగ్గిపుల్లతో సిగరెట్టు వెలిగించుకున్నాను. సిగరెట్టు వెలిగేక అగ్గిపుల్లనేంచేసేను... ఆర్పి అవతల పారేశాను. నా నియోజకవర్గం ప్రజలూ అంతేనండి. నన్ను ఓ జ్యోతిలా వెలిగించేరు. వెలిగించిన వెంటనే అగ్గిపుల్లల్లా వాళ్లు ఆరిపోయేరు. మళ్లా అయిదేళ్ల తర్వాత కదా అప్పుడు చూస్కుందాం''

ప్రజలని అంత నిర్లక్ష్యంగా మాట్లాడేసరికి పంతులుగారికి అరికాలి మంట నెత్తికెక్కింది. ''నిన్ను గెలిపించిన ప్రజల్నే అంతహీనంగా మాట్లాడుతున్నావ్! నీకేవైనా పుట్టగతులుంటాయిరా? వచ్చే ఎలక్షన్లో మళ్లీ వాళ్ళ గుమ్మంఎక్కి ఓట్లు అడిగితే నీ ముఖం మీద పేడనీళ్లు జల్లరట్రా?'' అన్నాడు ఆవేశంగా.

ఆనందరావు అనుచరులు పంతులుగారి మీదకి రాబోతే అతనే ఓ చూపుతో వాళ్లని ఆపుచేశాడు.

''పంతులుగారూ... మీరు నాకంటే వయసులో చాలా పెద్దవాళ్లు కావచ్చుగాని, మీకు బొత్తిగా రాజకీయానుభవం లేదండి. ఈ ప్రజల సంగతి మీకేం తెలుసు... నాకు బాగా తెలుసు... వాళ్లకి ఎప్పటికప్పుడే పరగడుపు. ఇవాళ నన్ను తిట్టినోళ్లే రేపు నన్ను పొగుడుతారు, గెలిపిస్తారు. ఎంచేతంటే, మన ప్రెజానీకం ఉత్త అమాయికపు మనుషులు. వాళ్లలా అమాయకంగా ఉన్నంతకాలమే నాలాంటి వాళ్లు పదవుల్లోకొస్తుంటారు. ఇవాల్టి పరిస్థితుల్ని గ్రహించిన మనిషిగా చెప్తున్నాను. ప్రజానీకంచేత 'ఛీ' అనిపించుకున్నవాడు చీఫ్‌మినిస్టర్ అయిపోతున్నాడు. 'ఛో' అనిపించుకున్నవాడు ప్రైమ్ మినిస్టరు అయిపోతున్నాడు. ఇంక మేం తిట్టుకోడాలు, కొట్టుకోడాలంటారా? మేవందరం మహాభారతాన్ని శ్రీకృష్ణుడి ఫిలాసఫీని ఫాలోయింగ్ అయిపోతున్నవాళ్లం''

''భారతంలోని శ్రీకృష్ణుడు అధికారదుర్వినియోగం చెయ్యమని బోధించేడట్రా?''

''అధికారాల గురించికాదండి భారతంలోని కౌరవులు దుర్మార్గపు ఎదవలు, పాండవులు ఉత్తమమైన పత్తిగింజలూ అనుకుంటే పొరపాటండి. అన్యాయాలు వీళ్లూ చేశారు; వాళ్లూ చేశారు. కాకపోతే కౌరవులు ఎక్కువ చేశారు, పాండవులు తక్కువ చేశారు. మాటవర్సకి దుర్యోధనుణ్ణి ఎలా చంపేరు? భీముడిచేత ఫేల్ గేమ్ ఆడించి రూల్సుకి విరుద్ధంగా, కొట్టకూడనిచోట కొట్టించి అతగాడి జీవితానికి ఫినిషింగ్ టచ్ ఇప్పించేడు శ్రీకృష్ణుడు. ఇది అన్యాయం అంటూ అరిచేడు బలరాముడు. 'ఏం... మొన్న అభిమన్యుణ్ణి రూల్సుకి విరుద్ధంగా వాళ్లు చంపించలేదా? లక్కమందిరంలో పాండవుల్ని చంపించాలని దుర్యోధనుడు ప్రయత్నించలేదా?' అంటూ కొన్ని రీజనింగులు తీశాడు శ్రీకృష్ణుడు. వాళ్లు అన్యాయం చేశారు కాబట్టి మేవూ ఆ రూట్లోనే నడిచేం అంటూ సమర్థించేడు. అంటే దేవుడంతటి శ్రీకృష్ణుడు గూడా చేసిందేవిటి? అన్యాయాన్ని అన్యాయంతోనే ఎదుర్కోవాలి తప్ప ఎదుటివాడు హింసకి పూనుకున్నప్పుడు, మనం అహింసా సిద్ధాంతంతో నిరాహారదీక్ష చేస్తే చచ్చివూరుకుంటాం అనేగదా శ్రీకృష్ణుడు మనకి బోధించింది. ఇప్పటికీ కోర్టుల్లో సాక్షులచేత భగవద్గీత మీద ప్రమాణం చేయించే సాక్ష్యం చెప్పిస్తున్నారు. అంటే మన గవర్నమెంటుకి కృష్ణుడి మీద, అతను చెప్పిన గీత మీద అంతనమ్మకం ఉందన్నమాట. అందుకే నాలాంటి వాళ్లు ఆ గీత. చెప్పిన శ్రీకృష్ణుడి పోలసీలోనే హింసకి హింస, దెబ్బకి దెబ్బ కొట్టుకుంటూ వస్తున్నాం. ఇంక నన్ను సతాయించకండి'' అంటూ ఆనందరావు తన అనుచరుల్తో వెళ్లిపోయేడు.

అతని మనస్తత్వాన్ని పూర్తిగా అవగాహన చేస్కున్న పంతులుగారు తెల్లబోయి అలాగే అక్కడే నిలబడి తిట్లు, శాపనార్థాలు పెడుతుంటే, బలవంతాన కారు ఎక్కించి, ఇంటికి తీసుకొచ్చేడు నారాయణరావు. ఇంటికి వచ్చేక కూడా పంతులుగారు తన సణుగుడు మానలేదు. భోజనంచేసినా, తాంబూలం నమిలినా, అతను చెప్తున్నది ఒక్కటే! ''దేశం నాశనం



అయిపోతోంది. ప్రజాప్రతినిధిగా నిలబడే ప్రతీఒక్కడికి గాంధీగారి జీవిత చరిత్ర, నెహ్రూగారి జీవిత చరిత్ర యింకా అలాంటి మహానుభావుల జీవిత చరిత్రల్ని పాఠ్యగ్రంథాలుగా పెట్టి, చదివించి, ఆ సబ్జెక్టులో పరీక్షలు పెట్టి, అందులో మంచి మార్కులతో పాసైనవాడికే ఎలక్షన్లో నిలబడే అర్హత కలిగించాలి. ఇంటికి కాపలాకాచే వాచ్‌మెన్‌కే ఫలానా అర్హతలుండాలి అని ఆలోచించే మనం, దేశానికి కావలాకాసే మనందరి ప్రతినిధికి, నీతీ నిజాయితీల విషయంలో, ఫలానా ఫలానా కనీసార్హతలుండాలని ఎందుకు ఆలోచించడంలేదు? ఇలాంటి ఆనందరావులే ప్రభుత్వంలోకొచ్చి, శాసనకర్తలైతే యికమీదట దేశం ఏం అవుతుంది?'' అంటూ పంతులుగారు అరుస్తూనే వున్నారు.

ఆయన ఆవేశం కాస్త చాదస్తంగానే అనిపించినా, చేసిన సూచనలు మాత్రం బాగానే వున్నట్టనిపించేయి నారాయణరావుకి.



మర్నాడు నారాయణరావు ఆఫీసుకి వెళ్ళగానే ఓ విషయం తెలిసింది. తన కంపెనీ జనరల్ మేనేజర్ కపాడియాకి సడన్‌గా ట్రాన్స్‌ఫర్ అయింది, ఎల్లుండే ఆయన డ్యూటీనించి రిలీవ్‌అయి బాంబేవెళ్ళిపోతాడని.

కపాడియా చాలా తెలివైనవాడు, అంతకు మించి మంచి వ్యక్తి! సమర్థతని గుర్తించి, తన కిందివారిని ప్రోత్సహిస్తాడు. నారాయణరావులోని సిన్సియార్టీని, ఎఫిషియన్సీని గుర్తించి, అతన్ని బ్రాంచ్ మేనేజర్ పోస్టుకి ప్రమోట్ చేసింది ఆయనే! ఆయన ఫేమిలీతో కూడా నారాయణరావుకి, రాజేశ్వరికి స్నేహం వుంది.

రేపు ఆఫీసు స్టాఫంతా హొటల్ కృష్ణా ఒబెరాయ్‌లో పార్టీ యిస్తున్నారని సెక్షన్ ఇన్‌ఛార్జ్ చెప్పేడు. పద్ధతి ప్రకారం ఆ పార్టీకి తనూ వెళ్ళాలి, వెళ్తాడు! కానీ, అతను తనకి చేసిన మహోపకారానికి, నలుగురితోపాటు నారాయణ అంటూ ఆ పార్టీకి ఎంతో కొంత కంట్రిబ్యూట్‌చేసి, అందులో పాల్గొంటే చాలదు అనిపించింది.

తను కపాడియాని, అతని భార్యనీ తన ఇంటికి పార్టీకి పిలవాలి. పిలిస్తే వస్తాడా? గతంలో కపాడియా ఎప్పుడూ ఏ ప్రైవేట్ పార్టీ పిలిచినా పార్టీలకి వెళ్ళినట్టు గుర్తులేదు. అయినా ఆహ్వానించిచూద్దాం అనుకుంటూ అతని గదిలోకి వెళ్ళేడు. ఎర్రగా, పుష్టిగా, ఎత్తుగా హాలీవుడ్ ఆర్టిస్టులా కనిపించే కపాడియా, నారాయణరావు ఆహ్వానాన్ని వినగానే చిన్నగా నవ్వాడు. అతను ఎక్కువగా ఇంగ్లీషులోనే మాట్లాడతాడు. మధ్యమధ్యలో తనకి తెలిసిన కొద్దిపాటి తెలుగు మాటల్ని కలపాలని ప్రయత్నిస్తుంటాడు. అతను మాట్లాడే కలగాపులగం తెలుగు వినేవాళ్ళకి నవ్వు పుట్టిస్తుంది.

''నేనెప్పుడూ ఎవరి పార్టీలకి వెళ్ళను మిస్టర్ నారాయణరావ్'' అన్నాడు ఇంగ్లీషులో.

''ఔననుకోండి! కానీ... మీరు నాకెంతో ఉపకారం చేశారు. నా సామర్థ్యాన్ని గుర్తించి ప్రోత్సహించేరు. మీ ఋణం తీర్చుకోలేనిదని నాకు తెలుసు! మీరు నా యింటికి రావడం, నాకు దక్కిన అదృష్టంగానే భావిస్తానుతప్ప, మిమ్మల్ని ఆహ్వానించేటంత అర్హత నాకుందని భావించను. మళ్ళీ మనం ఎప్పుడు కలుస్తామో! అసలు కలుస్తామో లేదోనని కూడా అనుమానిస్తున్నాను. ఎందుకంటే మీరు ఈ సంవత్సరాంతంలో అమెరికా వెళ్ళిపోతారని కూడా విన్నాను. కాబట్టి మీరు నాకీ మహదవకాశాన్ని కలిగించాలని ప్రార్థిస్తున్నాను'' అంటూ నారాయణరావు ఎంతో సిన్సియర్‌గా ఆహ్వానించేటప్పటికి కపాడియా కాదనలేకపోయేడు. ఓ పదినిమిషాలు ఆలోచించేక ''ఎల్లుండి వస్తాను'' అన్నాడు. నారాయణరావు సంతోషానికి అవధులు లేకపోయేయి.

ఆరోజు

కపాడియా, అతని భార్య నారాయణరావు ఇంటికి వస్తున్నారు. ఈ సంగతి తెల్సి కామేశ్వరమ్మ వంటలు చేయడానికి నడుము బిగించింది.

''చక్కగా ఇంగువపెట్టి పులిహోర, చక్ర పొంగలిచేసి కొబ్బరి పచ్చడి, కంది పచ్చడి, ములక్కాడ, వంకాయ వేసి పప్పుచారు, ఆవకాయ, కందిపొడి, గడ్డపెరుగు, అప్పడాలు...'' అంటూ తాను చేయబోయే వంటకాల లిస్టుని గబగబా వల్లించింది.

అయితే ఆవిడ మాటలకి సంతోషించింది ఒక్క నర్సింపంతులు మాత్రమే! నారాయణరావు, రాజేశ్వరి ఒకర్నొకరు చూసుకుని ముసిముసిగా నవ్వుతున్నారు.

''ఎందుకా నవ్వు? ఇప్పుడు నేను చెప్పినవి చాలకపోతే మరేం చెయ్యాలో చెప్పండి. ఇంటి కొచ్చిన అతిథిని అసంతృప్తిగా పంపుతామా, ఏంవన్నానా?'' అంటూ కాస్త చిరాకు వ్యక్తం చేసింది కామేశ్వరమ్మ.

ఆ మాటలు వింటున్న రాజేష్ చిన్నగా నవ్వుతూ- ''పులిహోర, చక్రపొంగలి, కందిపచ్చడి చేయడానికి, ఆ కపాడియా గారేమైనా చింతలగ్రహారంనించొచ్చిన పంతులుగారను కున్నారా అమ్మమ్మా!''

''మరైతే వాళ్లేం తింటారట?'' నర్సింపంతులు అడిగేడు.

రాజేష్ జవాబు చెప్పబోతుంటే రాజేశ్వరి ''వద్దన్నట్టు''గా కళ్లతోనే సౌంజ్ఞచేసి వారించింది.

''ఏంతింటారూ అని అడిగితే మాట్లాడకుండా ముంగిసపిట్టల్లా చూస్తారేంవిటే?'' అంటూ గద్దించేడు నర్సింపంతులు.

పార్టీకి తాను ఏంఏర్పాట్లు చేస్తాడో అతనికి చెప్పడం నారాయణరావుకిష్టంలేదు. చెప్పకపోతే ఆ దంపతులు వూరుకునేటట్టులేదు. ఆ విషయాన్ని దాటవేయడానికి, నారాయణరావు ఓ వుపాయం ఆలోచించి, కావాలనే ఆనందరావు విషయం ప్రస్తావించేడు.

అంతే! పంతులుగారు ఆనందరావుని తిట్టడంలో నిమగ్నమైపోయేడు. అలాంటివాళ్లు ప్రభుత్వంలో వుంటే దేశం ఎలా కుక్కలు చింపిన విస్తరిలా తయారవుతుందో కామేశ్వరమ్మకి వివరించడం ఓ పనిగా పెట్టుకున్నాడు.

ఆ సాయంత్రం రాజేష్ కార్లో వెళ్లి ఓ అధునాతనమైన హొటల్నించి చికెన్ సిక్స్టీ ఫైవ్, చిల్లీ చికెన్, జింజర్ చికెన్, ప్రాన్స్ పకోడా, ఫిష్ కట్‌లెట్సు, చికెన్ బిర్యానీ, మటన్ కైమాబాల్స్, చిప్సు, మిక్చర్‌లతోపాటు, రాయల్ శెల్యూట్ రెండు బోటిల్సూ తీసుకొచ్చేడు. ఇంట్లోనే సోడాలు, అయిస్ క్యూబ్స్ వుంటాయి. పార్టీ సమయంలో ముసలాళ్లువుంటే ఏం గొడవ చేస్తారోనని భయపడి, వారిద్దర్ని ఫస్ట్‌షో సినిమాకి వెళ్లమంది రాజేశ్వరి. వాళ్లు వెళ్లమన్నారు.

''అంత పెద్ద ఆఫీసరుగారూ, పనిగట్టుకుని మనింటికి భోజనానికి వస్తున్నప్పుడు, పెద్దవాళ్లం మేం సినిమాలకి, షికార్లకి వెళ్లిపోవడం ఏం మర్యాదగా వుంటుందిరా? దగ్గరుండి ఆహ్వానించి, వాళ్ళకి సంతృప్తికలిగేలా భోజనంపెట్టి, తాంబూలం యిచ్చి పంపించాలి గాని'' అన్నాడు నర్సింపంతులు.

దగ్గరుండి ఆహ్వానించడం, అతిథులకి సంతృప్తి కలిగేలా ఆతిథ్యం యివ్వడం వరకూ బాగానే వుందిగాని, యిప్పుడు పార్టీలో తీస్కునే డ్రింకులు, నాన్‌వెజిటేరియన్ పదార్థాలకి వాళ్ల రియాక్షన్ ఎలా వుంటుందోనన్న భయం నారాయణరావుకి దూరం కావడంలేదు.

''మీరేం వర్రీ అవకండి డేడీ! ఆ టైములో వాళ్లని నా గదిలో కూర్చోబెట్టి, ఏదో వీడియో కేసెట్‌వేసి, వాళ్ళని మీ దగ్గరకి రాకుండా ఎంగేజ్‌చేసే పూచీ నాది'' అని రాజేష్ తండ్రికి భరోసా ఇచ్చేడు.

రాత్రి ఎనిమిది గంటలప్పుడు కపాడియా, అతని భార్య చందావర్కర్ వచ్చేరు. సాదరంగా రిసీవ్ చేస్కున్నాక, నారాయణరావు తన యిల్లంతా చూపెంచేడు. నర్సింపంతుల్ని, కామేశ్వరమ్మనీ పరిచయం చేశాడు. కపాడియా పంతులుగారికి షేక్‌హేండ్ యిచ్చి పలకరించేసరికి పంతులుగారు సిగ్గు, సంతోషాలతో మెలికలు తిరిగిపోయేడు. కామేశ్వరమ్మ అయితే టీనేజ్డ్ గర్ల్‌లా సిగ్గుతో లోపలకి వెళ్లిపోయింది.

హాల్లోనే డైనింగ్ టేబుల్‌వేసి పార్టీకి కావ





ల్సిన ఏర్పాట్లు చేసింది రాజేశ్వరి. గెస్టులిద్దర్ని అక్కడకి తీసుకువెళ్లేడు నారాయణరావు.

"నేనూ వెళ్తాను" అన్నాడు నర్సింపంతులు.

"వద్దు తాతయ్యా బాగోదు" అంటూ రాజేష్ వారించేడు.

"బాగోకపోవడం ఏవిట్రా? ఇంటికి అతిథులొచ్చేక వాళ్ల మానాన వాళ్లనొదిలెయ్యడం సభ్యతకాదు"

"వాళ్లని ఎంటర్‌టైన్ చేయడానికి మా అమ్మా నాన్న వున్నారుగా"

"ఉంటేమాత్రం, వాళ్లకంటే పెద్దవాళ్లం మేం ఇక్కడున్నప్పుడు మేం గూడా వెళ్లి మాట్లాడకపోతే ఏంబాగుంటుంది? మేం యిక్కడలేకపోతే ఏ బాధాలేదు. వున్నప్పుడు గూడా వాళ్లతో మాట్లాడకపోతే, మాకు పెడసరం అనుకోరట్రా" అంటూ పంతులుగారు కామేశ్వరమ్మని తీస్కుని అక్కడికి వెళ్లబోయేడు.

"అదికాదు తాతయ్యా! ఆ కపాడియా గారికి, ఆయన భార్యకీ ఇంగ్లీషు, గుజరాతీతప్ప మరో భాషరాదు. నీకు తెలుగుతప్ప మరే భాషారాదు. నువ్వు వాళ్లతో ఏం మాట్లాడతావు? నీకు నాగయ్యగారంటే చాలా యిష్టంకదా. ఆయన ఏక్ట్ చేసిన యోగి వేమన చూశావ్. కానీ, ఆయన సొంతంగా తీసిన భక్తరామదాసు సినిమా నువ్వు చూడలేదు. నీ కోసమనే వూరంతా ఒకటికి పదిసార్లు తిరిగి, కాస్సెట్ సంపాదించేను చూద్దాంపదా" అంటూ తన గదిలోకి తీసుకెళ్లి వీడియో కేస్సెట్ వేశాడు.

నాగయ్య, భక్తరామదాసు అనగానే నర్సింపంతులు కొంత తగ్గిపోయేడు. పైగా కపాడియాగారితో మాట్లాడ్డానికి తనకి ఇంగ్లీషు రాదు. కేస్సెట్ చూడ్డంలోనే నిమగ్నమయ్యేడు.

పార్టీ జరుగుతోంది. మందు రెండో రౌండులోకి వచ్చింది. రాజేశ్వరి వాళ్లతో మాట్లాడుతూనే, మధ్యమధ్యలో లేచివెళ్లి వంటగదిలో ఆమ్లెట్స్ వేస్తోంది. నారాయణరావు, కపాడియా దంపతుల్తో డ్రింకు తీస్కుంటూనే, మంచింగ్ అయిటెమ్స్‌గా చికెన్ వగైరా పదార్థాల్ని తింటున్నాడు. రాజేశ్వరి వేడివేడి ఆమ్లెట్స్‌ని ప్లేటుల్లో పెట్టి తీసుకొచ్చింది. ఆమ్లెట్సు కపాడియా దంపతులకి నచ్చేయి.

"మేం యింట్లో ఆమ్లెట్సు వేస్తున్నా, హొటల్నించి తెప్పించుకున్నా అవేవీ, మీరు చేసినట్టుండవు. మీరు యిందులో వుల్లిపాయలు, మిరపకాయిలూ వేసి, పెసరట్టు స్టైపులో వేశారు. ఇది చాలా రుచిగా వుంది" అంటూ కపాడియా భార్య చందావర్కర్ రాజేశ్వరి వంటల్ని అభినందించింది.

వీడియోలో వేసిన భక్త రామదాస్ ప్రింట్ చాలా పాతది కావటంతో, సరిగా రికార్డ్ కాలేదు. అలాంటి భక్తిరసమైన కేస్సెట్ అయితేతప్ప తన తాతగారు, మామ్మగారు టీ.వీ ముందు కూర్చోడానికి యిష్టపడరని రాజేష్, వూరంతా వెదతిరిగి, ఆ కేస్సెట్ సంపాదించేడు. కానీ, అది అనేకసార్లు ఆగిపోయి, వాళ్లని అసంతృప్తి పరచడంతో ముసలాళ్లిద్దరూ చిరాకుపడుతూ లేచిపోయేరు.

"ఈ సినిమా రేపైనా చూడొచ్చు. కానీ, మధ్యలో ఒకసారైనా అతిథుల్ని పలకరించకపోతే మర్యాదగా వుండదు" అంటూ పంతులుగారు కామేశ్వరమ్మతోనహా హాల్లోకి బయలుదేరారు. వాళ్లని ఎలా ఆపుచేయాలో రాజేష్‌కి అర్థంకాలేదు.

పార్టీ, ఫోర్త్ రౌండ్‌లోకొచ్చింది. ముసలాళ్లు వచ్చిచూసేసరికి, నారాయణరావు విస్కీ తాగుతూ, చికెన్ తింటూ కనిపించేడు. రాజేశ్వరి, అతిథుల్తో ఇంగ్లీషులో మాట్లాడుతూ ఆమ్లెట్ తింటోంది.. చూడకూడని దృశ్యాన్ని చూసినట్టుగా, జరగకూడని దారుణం తమ యింట్లో జరిగిపోతున్నట్టుగా నర్సింపంతులు, కామేశ్వరమ్మ ఫీలయ్యేరు. అదుపులో పెట్టుకోలేని ఆవేశంతో కోపంతో కుతకుతలాడిపోయేరు.

"రాజేశ్వరీ! ఏవిటే ఈ దారుణం?"

పంతులుగారు అరిచిన అరుపుకి నారాయణరావు, రాజేశ్వరి అదిరిపడ్డారు. మెట్లమీద నిలబడ్డ రాజేష్ "వాళ్లని కంట్రోల్ చేయడంలో నేను అశక్తుడైపోయేను" అన్నట్టుగా చూసేడు. పంతులుగారు, ఆ తర్వాత ఏం మాట్లాడతారో వాళ్లు వూహించేరు.

"వస్తున్నాను నాన్నా" అంటూ అక్కణ్ణించి లేచి వారివైపు వెళ్లబోతూ, భర్తతో "ఒక్క

నిమిషం మీరూ రండి" అంది.

నారాయణరావుకి వెళ్లకతప్పలేదు. "ఎక్స్క్యూజ్‌మీ సార్! మా మామయ్యగారు బీ.పీ పేషెంటు. ఆయనకేం జరిగిందో ఓసారి చూసొస్తాను. జస్ట్, ఒన్ ఆర్ టూ మినిట్స్‌లో వచ్చేస్తాను" అని కపాడియా దంపతులకి వినయంగా చెప్పి అటువైపు నడిచేడు.

ముసలాళ్లని హాల్లో నిలబడి మాట్లాడే అవకాశం యివ్వకుండా, వాళ్లని ఓ గదిలోకి బలవంతంగా తీసుకెళ్లి మాట్లాడేడు నారాయణరావు. రాజేష్‌గూడా వాళ్లని అనుసరించేరు.

"ఎందుకలా అరిచేరు?" నారాయణరావు మామయ్యగార్ని సీరియస్‌గా అడిగేడు.

"నేను అరవలేదురా... మన సాంప్రదాయం అరిచింది. మీరు చేసిన అకృత్యాలే మాచేత అరిపించింది"

"ఏమిటా అకృత్యం?"

"మనం ఎవరం? మీ కుటుంబసాంప్రదాయం ఎలాంటిది? మా కుటుంబ సాంప్రదాయం ఎలాంటిది?"

"రెండూ నాకు తెల్సు"

"తెల్సినవాడివైతే, ఇంట్లో యీ మద్యపానం ఏవిటి? ఆ మాంసాహారం ఏవిటి? ఎంతకి బరితెగించేవురా?"

"ఇందులో బరితెగించడం ఏంవుంది? ఆ కపాడియాగారు నాకు పూజనీయులు, ఆయనకి ఆతిథ్యమిస్తున్నాం"

"ఆతిథ్యం అంటే, మన సాంప్రదాయానికి విరుద్ధమైన మద్యపానం, మాంసాహారాల్తో యివ్వాలా?"

"అవి యిస్తే ఆయన సంతృప్తిపడతారు కాబట్టి, అవేయిస్తున్నాను"

"ఆయనకిచ్చేవుసరే నువ్వూ ఆయన్తోపాటు మద్యపానంచేసి, మాంసాహారం తినాలా?"

"ఆయనేకాధు నాన్నా... నేనూ ఆమ్లెట్ తింటున్నాను" అంది రాజేశ్వరి ధైర్యంగా.

"అదే... ఏవిటీ దారుణం అని అడుగుతున్నాను. మీకు మనకులం, ఆచారం, సాంప్రదాయం, కట్టుబాట్లు, యివేవీ గుర్తులేకుండాపోయేయా అని అడుగుతున్నాను" అంటూ నర్సింహులు వంశం, కులం గురించి అయిదునిమిషాలపాటు ఆగకుండా మాట్లాడేడు.

నారాయణరావుకి సహనం చచ్చిపోయింది. రాజేశ్వరీ, రాజేష్‌ల పరిస్థితీ అలాగేవుంది.

"ఏవిటి మావయ్యా! మీరు కులం గురించి, సాంప్రదాయం గురించి మాట్లాడుతున్నారు. అసలు మనం ఎవరం? బ్రాహ్మణులం! అయితే ఏటిటట? మనం మిగతా వారి కంటే ఎందులో గొప్పవాళ్లమట? మనంపుట్టకతో బ్రాహ్మణులం కావొచ్చు కానీ, ఎవడు బ్రాహ్మణుడు? అనే ప్రశ్నకి మీరేం జవాబు చెప్తారు?

పుట్టుకవలనగాక చేసేపనులవల్లనే ఎవరైనా బ్రాహ్మణుడవుతాడు అంటూ బుద్ధుడు బోధించేడు! దాన్ని మీరు కాదనగలరా? ఖండించగలరా?

అసలు, బ్రాహ్మణుడంటే ఎవరు? త్రికాలములయందు, త్రికరణశుద్ధిగా సర్వేజనాంసుఖినోభవంతూ అని కోరుకునేవాడు బ్రాహ్మణుడు. తన జ్ఞానాన్ని తనవుణ్యాన్ని పదిమంది శ్రేయస్సుకి ఖర్చుచేసేవాడు బ్రాహ్మణుడు. అంతేగాని ఓ బ్రాహ్మణుడి ఇంద్రియాన్నించి పుట్టినవాడు బ్రాహ్మణుడు కాడు! బ్రాహ్మజ్ఞానం కలిగి వాడు బ్రాహ్మణుడు! మీ గుండెలమీద చెయ్యివేసుకు చెప్పండి. మనకి బ్రహ్మజ్ఞానంవుందా? మనం బ్రాహ్మణులకోసం కేటాయించబడ్డ వృత్తులనే మనం చేస్తున్నామా? వృత్తుల్నిబట్టే కులాలు ఏర్పడ్డాయి? మొదట్లో అవి వర్ణాలుకావు. వర్గాలు మాత్రమే

ఆదిలో మనిషి జంతువుతో సమానంగానే జీవించేడు. ఆకలివేస్తే తనకు చేతనైన జంతువుని చంపి, దాని మాంసంతో పొట్ట పోషించుకున్నాడు. తర్వాత తర్వాత, మానవుడు అభివృద్ధి చెందేడు. వ్యవసాయం ఆరంభించేడు. అక్కడితో సాంఘిక జీవనం ఆరంభించేడు. తన అవసరాలు తీర్చుకోడానికి ఇతరులమీద కూడా ఆధారపడ్డాడు. వండుకోడానికి కుండలు కావాలి. వాటిని మరో మనిషి చేయనారంభించేడు. ఆ పనిచేసేవాణ్ని కుమ్మరివాళ్లూ అన్నారు. కట్టుకోడానికి బట్టలు కావాలి. ఆ బట్టలు నేసేవాళ్లని సాలెవాళ్లూ అన్నాం. మాసిపోయిన బట్టల్ని వుతకడానికో మనిషి కావాలి! ఆ మనిషిని చాకలీ అన్నాం. ఇలా,




వారుచేసే వృత్తుల్ని బట్టే వర్గాలుగా విభజించేం. ఆ వర్గాలే, వర్ణాలుగా మారేయి. ఓ సాలెవాడు తనకి భార్యగా వచ్చే వ్యక్తి సాలెపనికి సంబంధించిన పనులు తెల్సిన వ్యక్తి అయితే తన వృత్తికి సహాయకారిగా వుంటుందని, ఆ వర్గంలోని అమ్మాయినే పెళ్లి చేసుకోడానికి యిష్టపడేవాడు; ఆ యిష్టపడడాన్నే ఓ ఆచారంగా మార్చుకున్నారు. ఓ సాంప్రదాయంగా చేసుకున్నాం.

కానీ, యివాళ, ఏ కులస్తులు, ఆ కులానికి నిర్దేశించిన పనులేచేస్తున్నారా? బ్రాహ్మణులంతా పౌరోహిత్యం చేస్తున్నారా? కోమట్లంతా వ్యాపారాలే చేస్తున్నారా? సాలెవాళ్లంతా బట్టలే నేస్తున్నారా? లేదే! ఇవాళ, ఎవడి ప్రతిభనిబట్టి వాడు, ఎవడి తెలివితేటల్నిబట్టివాడు, తన జీవనోపాధిని చూస్కుంటున్నాడు. మీ దృష్టిలో అధమజాతివాడైన ఓ వ్యక్తి దగ్గర, అగ్రకులస్తులుగా పేర్గాంచిన మేమందరం సబార్డినేట్స్‌గా పనిచేయడంలేదా? ఆయనకి నమస్కారాలు చేసి, ఆయన ఆజ్ఞన్ని మేం శిరసావహించడంలేదా?

మనం బ్రాహ్మణులంకాబట్టి, మనం మత్స్య మాసాలు తినకూడదనే నియమం ఉండొచ్చు. కానీ, ఈ ఆహారం విషయంలో తప్ప, మిగతా ఏ విషయంలోనూ మేం బ్రాహ్మణ సాంప్రదాయాన్ని పాటించనప్పుడు ఇవి తింటేమాత్ర మేంనష్టం వచ్చిందట? మద్యపానం చేయకూడదనేది, అన్ని మతాల వారికీ చెందిన నియమం, కాదూకూడదని చేస్తున్నాం అంటే, అది మా బలహీనత అనండి లేదా యీనాటి సొసైటీలో, మా పరిచయాలు పెంచుకోవడానికి మేం ఎన్నుకున్న మార్గం అనండి లేదా మా రెగ్యులర్, రొటీన్ వర్కు నుంచి కాస్త రిలాక్స్ అవడానికి మేం ఆశ్రయించే పద్ధతి అనండి, మరింకేమైనా అనండి. మా అలవాట్లని, మా బలహీనతల్ని సమర్థించుకోడానికి చెప్తున్న సంజాయిషీకాదిది. కానీ, మేం తింటున్న తిండికి, తాగుతున్న డ్రింకుకి, మన బ్రాహ్మణీకానికి ముడిపెట్టొద్దని మాత్రమే కోరుతున్నాను. మీరు అమితంగా గౌరవించే కులాన్ని, సాంప్రదాయాన్ని మేం భ్రష్టువట్టిస్తున్నామని నిందించొద్దు.

మీరు గమనించినా, గమనించకపోయినా, మీరు ఒప్పుకున్నా ఒప్పుకోకపోయినా కాలం మారుతోంది. మనిషి జీవనవిధానంలో ఎన్నో మార్పులు వాటంతటవే చోటు చేసుకుంటున్నాయి. కొత్తని ఆహ్వానించడానికి మా చేతులు చాచక తప్పడంలేదు. మారుతున్న కాలంతోపాటు మేఁవుమారకుండా, మేం బ్రాహ్మణులం, మా సాంప్రదాయంమాదీ అంటూ మడి కట్టుక్కూర్చుంటే, మేం బ్రాహ్మణులుగానే మిగిలిపోతాం తప్ప, ఈ ఆధునికసమాజంలో మేం వెనుకబడిపోతాం''

నారాయణరావు ఎప్పుడూ ఇంత అనర్గళంగా మాట్లాడలేదు. ఆచార వ్యవహారాల గురించి అతని తిరస్కారం ఏవిటో, అతని కోరిక ఏవిటో, ఇలా తెగేసి చెప్పే అవసరంగాని, అవకాశంగాని యింతవరకూ రాలేదు. అతని అభిప్రాయాలకి డిటో డిటో అయిన రాజేశ్వరికి కూడా భర్త ఆవేశం వింతగానే కనిపించింది. అతను యింకా ఎంతసేపు అలా మాట్లాడేవాడో గాని అవతల కపాడియా దంపతులు నిరీక్షిస్తున్నారన్న విషయం గుర్తుంచుకుని, తనని తాను తమాయించుకున్నాడు.

మిమ్మల్ని మాలో కలిపి మీ పద్ధతుల్ని భ్రష్టు పట్టించను. కానీ, నా దారికి అడ్డురావద్దని మాత్రం కోరుతున్నాను'' అంటూ రాజేశ్వరిని, రాజేష్‌ని తీసుకుని బైటికి నడిచి గది తలుపులు మూసి, గడియపెట్టేడు.

నర్సింపంతులు కుతకుతలాడిపోతూనే అక్కడున్న కుర్చీలో కూలబడిపోయేడు, కామేశ్వరమ్మ మాత్రం రుసరుసలాడుతూ తలుపులు తట్టబోయింది. కానీ పంతులుగారు ఆమెను వారించేడు.

''వాడిచ్చిన లెక్చరు సంగతి వదిలేయ్. అమ్మాయిప్పుడు నర్సింపంతులి కూతురుకాదే, నారాయణరావు పెళ్లాం. మనం వాళ్లింటికి చుట్టపుచూపుగా వచ్చేం... అంతే! కూర్చో'' పంతులుగారి గొంతు గద్గదమైంది. అతిథులు వెళ్ళి, రాజేశ్వరి తలుపులు తీసేవరకూ యిద్దరూ తలుపులు తియ్యమనలేదు. మరోమాట మాట్లాడుకోలేదు.

''భోంచెయ్యండి నాన్నా'' అని రాజేశ్వరి అన్నప్పుడు మాత్రం ఆ ముసలి దంపతులు

అలిగినట్టుగా- "మేం భోంచెయ్యం" అని ముక్తకంఠంతో అన్నారు.

★ ★ ★

సుజాతని అత్తవారింటికి పంపడమా లేక తమతోనే వుంచుకోవాలా? అనే విషయంలో చలపతిరావు యింకా ఓ నిర్ణయానికి రాలేదు. అలాంటి పరిస్థిలోనే రవీంద్రనాథ్, తన తల్లిని తీసుకుని ఆ యింటికొచ్చేడు.

సుజాత అభ్యర్థన మేరకి రవీంద్రనాథ్ నాలుగు రోజులపాటు చలపతిరావుని కల్సుకుని మాట్లాడే కోరికని వాయిదా వేసుకున్నాడు. కానీ, తండ్రి అనారోగ్యం మరింత విషమించి, డాక్టరు సైతం ఆందోళనపడినప్పుడు, యింక రాకతప్పలేదు.

వాళ్లరాక చలపతిరావుతోపాటు అందరికీ ఆశ్చర్యం కలిగించింది. అటుపైన రవీంద్రనాథ్ చెప్పిన విషయం విని మరింత విస్మయం చెందారు. సుజాత ఓ బెంగాలీ అబ్బాయిని ప్రేమించిందా? సుజాతని పిలిచి అడిగేడు.

"ఔను" అంటూ ఆమె ధైర్యంగానే జవాబు చెప్పింది.

దాంతో, విధవరాలైన సుజాత జీవిత సమస్య మరో కొత్త మలుపు తిరిగింది.

సుజాత ఇప్పుడు తమ కూతురుకాదు, మరో యింటి కోడలు, ఆమెను అత్తవారింటికి పంపడమా? మానడమా? అని ఆలోచిస్తున్న సమయంలో, ఇప్పుడు బెంగాలీ అబ్బాయితో పునర్వివాహమా? అసలా ప్రశ్నే ఎవరికీ ఒకంతట కొరుకుడుపడలేదు. "ఈ విషయం మాకింతవరకూ ఎందుకు చెప్పలేదు?" అని ఎవరూ సుజాతని అడగలేదు. అలా అడిగితే ఎలాంటి సమాధానం వస్తుందో అందరూ ఎవరికివారే ఊహించుకున్నారు.

"పెళ్లయిన ఎనిమిదినెల్లకే నేను విధవరాలినైతే, ఇంతవరకూ నా భవిష్యత్తు గురించి మీరెందుకు ఆలోచించలేదు?" అని సుజాత తిరిగి అడిగితే ఏంసమాధానం చెప్పాలి? ఇంతవరకూ తమ బాధ్యతనితాము విస్మరించిన విషయాన్ని అందరికందరూ తమలో తాము ఒప్పుకున్నారు. రవీంద్రనాథ్ తన తండ్రి పరిస్థితిని, తన పెళ్లియొక్క ఆవశ్యకతని వివరించి, రెండురోజుల్లో సమాధానం చెప్తే ఉభయులకీ క్షేమం అని చెప్పి, తల్లిని తీసుకుని వెళ్లిపోయాడు.

చలపతి ఆరోజు కోర్టుకి వెళ్లకుండా తన తరఫున తన జూనియర్ని పంపించి, ఆలోచనలో పడ్డాడు. శంకరానంద్ ఆఫీసుకి సెలవుపెట్టేడు. చలపతి, సుజాత గదిలోకి వెళ్లి ఒకటి రెండు ప్రశ్నలు మాత్రం అడిగేడు. ఆమె చెప్పిన జవాబులు ఏమైనా, వాటి సారాంశం ఒకటే.

"నేను మళ్లీ పెళ్లిచేసుకుని సుఖపడాలనుకుంటే, మీరీ వివాహానికి అంగీకరించండి"

ఇప్పుడు చలపతికి సమస్య మరింత జటిలమైనట్టుగా తోచింది.

"అందర్నీ తన గదిలోకి పిలిచి చర్చించేడు. సుజాత విధవరాలైంది. అది దాని దురదృష్టం. అలా అని మనం జాలిపడ్డంవల్ల దాని జీవితానికి ఎటువంటి ప్రయోజనం వుండదు. కాబట్టి దానికి ద్వితీయవివాహం చేయడమే న్యాయం. ఔనా? కాదా?"

"ఔను"

"చేస్తే తప్పేంవుంది"

"ఇప్పుడు చాలామంది చేస్తున్నారుగా" ఇవి వాళ్ల ముగ్గురి అభిప్రాయాలు.

"ద్వితీయ వివాహాలు మన వంశంలో లేవు. అలాంటిదిది ద్వితీయ వివాహం మాత్రమే కాదు, విధవా వివాహం కూడాను సుజాతకి మళ్లీ జరిపిస్తే అది మనం చేసిన సాహసం అవుతుంది. ఓ కొత్తదారి తొక్కినట్టవుతుంది. ఔనా? కాదా?"

"అంతేకదా మరి"

"పరిస్థితిని బట్టే మనమూ ఆలోచించి నిర్ణయం తీసుకోవాలి. గతంలో మన కుటుంబాల్లో ఇలాంటి ఆచారం లేకపోతే మాత్రం, ఇప్పుడు చేస్తే తప్పేంవుంది?"

"మనిషికంటే ఆచారం గొప్పది కాదుకదా" ఇవీ ఆ ముగ్గురి అభిప్రాయాలు.

సుజాతకి ద్వితీయ వివాహం చేయడానికి ఆ ఇంట్లో ఎవరికీ అభ్యంతరంలేదు. అందరూ సంతోషంగా ఒప్పుకున్నారు. కానీ, ఓ ముఖ్య





మైన సందేహం అందరికీ వచ్చింది.

ఈ వివాహానికి నర్సింపంతులు ఒప్పుకుంటాడా? ఈ ప్రశ్న ఎవరికీ మింగుడుపడలేదు. విధవరాలు, తన స్నేహితురాలి పెళ్లికి వెళ్లిందనగానే ఒంటికాలిమీద లేచినవాడు, ఈ పెళ్లికి ఒప్పుకుంటాడా?

ఎంత మాత్రం ఒప్పుకోడు!

తన చిన్నాన్న అంటే నర్సింపంతులుగారి తమ్ముడు బతికుంటే, అతన్ని ఒప్పించే బాధ్యత ఆయన తీసుకుని వుండేవాడు. కానీ, ఆయన పరమపదించేడు.

ఏదోవిధంగా కష్టపడి తనే తన తండ్రిని ఒప్పించినా, సుజాత బెంగాలీ అబ్బాయిని చేసుకోవడం ఏమిటి?

ఇదీ చలపతికి ఏర్పడిన అసలు సమస్య.

ఈ విషయంలో ఆ ఇంట్లోని మిగతా ముగ్గురూ తమ అభిప్రాయాలు వెలిబుచ్చడానికి నీళ్లు నమిలేరు. గంటా రెండుగంటలు, మూడు గంటలు దాటుతున్నా వాళ్లొక అభిప్రాయానికి రాలేకపోయారు.

"మనవాళ్లెవరైనా ముందుకొచ్చి సుజాతని పెళ్లిచేసుకుంటానంటే, అంతకంటే సంతోషకరమైన విషయం మరొకటుండదు. కానీ బెంగాలీవాడికిచ్చి చెయ్యడం అంటే, మరీ బరితెగించినట్టవుతుంది"

ఆ సాయంత్రానికల్లా వాళ్లందరూ తీసుకున్న నిర్ణయం అదీ!

అయితే ఈ నిర్ణయం చెప్పి సుజాతని ఎలా ఒప్పించడం? సుజాత ఎంత సున్నిత మనస్కురాలో, కొన్ని విషయాల్లో అంత మొండి! తామెవరివల్లా ఆ పని జరిగేదికాదు. ఆమెను తమ నిర్ణయానికి ఒప్పించిగాని, రవీంద్రనాథ్‌కి "నో" అని చెప్పడానికి వీల్లేదు. శంకరానంద్ ఓ సలహా ఇచ్చాడు.

"రాజేశ్వరి అత్తయ్య దగ్గర సుజాతకి చనువు ఎక్కువ. అత్తయ్యని పిలిపించి చెప్పిస్తే సుజాత తప్పకుండా ఒప్పుకుంటుంది"

ఆనంద్ ఇచ్చిన సలహా అందరికీ నచ్చింది. ఆ రాత్రి ఎనిమిదిగంటలప్పుడు చలపతి హైదరాబాద్‌కి యస్.టి.డి కాల్‌చేసి నారాయణరావు, రాజేశ్వరిలతో విషయమంతా వివరించాడు.

ఆ సమయంలో నర్సింపంతులు, కామేశ్వరమ్మ మేడమీద వున్నారు. వాళ్లకి వినబడకూడదని కావాలని మెల్లగా మాట్లాడేరు. నారాయణరావుని, రాజేశ్వరిని వెంటనే బయలుదేరి రమ్మనమని చెప్తూనే చలపతి మరో విషయం చెప్పాడు.

"మా నాన్న అమ్మ ఎంత ఇంగువ కట్టిన గుడ్డలో నీకు బాగా తెలును. వాళ్లకీ ద్వితీయ వివాహం సంగతిగాని, మీరు వైజాగ్ వస్తున్న విషయంగాని ఎంతమాత్రం తెలియకూడదు. తెలిసిందో, ముందుకు వెళ్తున్న మనల్ని చొక్కా పట్టుకుని వెనక్కి లాగేసి, ఏ పందొమ్మిది వందల పదహార్లోకో నెట్టేస్తారు అంచేత సుజాతకి మనవాళ్లలోనే ఓ మంచి సంబంధం చూసి, పెళ్లి జరిపించేశాక, అప్పుడు వాళ్లకి తెలియజేద్దాం. అప్పుడు వాళ్లు కోప్పడినా, ఓ మంచిపని చేశామనే తృప్తి ముందు, వాళ్లకోపతాపాలు ఓ లెక్కలోకి రావు".

నారాయణరావుకి రాజేశ్వరికి ఈ సలహా నచ్చింది. ప్రోగ్రెస్సివ్ తింకింగ్ లేని వాళ్లని ఎంత వెనక్కి నెడితే అంత మంచిదని వాళ్లూ అనుకున్నారు. అర్జంటు పనిమీద విజయవాడ వెళ్తున్నామని, రెండురోజుల్లో వచ్చేస్తామని రాజేశ్వరి తల్లిదండ్రుల్తో చెప్పింది. ఆరోజు వుదయమే ఏదో మెడికల్ కాన్ఫరెన్సు వుందని రాజేష్ బెంగుళూరు వెళ్లేడు.

"మీరు వెళ్తున్న పని ఏమిటట?" పంతులుగారు టిఫిన్ చేస్తూ అడిగేడు.

"ఆఫీసు పనే"

"మేం రాకూడదా?"

"మీరొచ్చి ఏంచేస్తారు? అబ్బాయిగూడా వూళ్లోలేడు. మీరూ అత్తయ్య ఇక్కడుండండి. ఇంటిపనంతా చెయ్యడానికిద్దరు నౌఖర్లున్నారు"

"సరే... వెళ్లిరండి"

రాజేశ్వరి, నారాయణరావు గోదావరి ఎక్స్‌ప్రెస్‌కి బయలుదేరేరు.

★ ★ ★

రాజేశ్వరి, సుజాత గదిలోకి వెళ్లి తలుపులు మూసి మాట్లాడింది. ఈ రెండు రోజుల్లోనూ

చలపతి ఫోన్లమీదే చాలామందిని కాంటాక్ట్ చేసి రెండుసంబంధాల్ని కుదిర్చేడు. ఓ అబ్బాయి లాయరు, వయసు ముప్పై వచ్చినా యింకా పెళ్లికాలేదు. మంచి సాంప్రదాయం వున్న బ్రాహ్మణ కుటుంబీకుడే. సుజాత విషయం అంతా తెలిసి, సంతోషంగా ఒప్పుకున్నాడు.

రెండో సంబంధం కమ్మ కులస్తుడైన ఓ డాక్టరు. తమ ఫేమిలీ డాక్టరు రమేష్‌ప్రసాద్ గారి రెండో అబ్బాయి. రమేష్‌ప్రసాద్‌కి ఫోన్ చేసి సుజాత విషయం వివరించి- "మీకు తెలిసిన సంబంధం వుంటే చూడండి" అన్నప్పుడు "ఎవరో ఎందుకు? మీకు అభ్యంతరం లేకపోతే మా అబ్బాయికే చేసుకుంటాం. మాకు అలాంటి పట్టింపులు లేవు" అన్నాడు ప్రసాద్.

దాంతో మళ్లీ చర్చ బయలుదేరింది. లాయరు సంబంధంకంటే యీ డాక్టరు సంబంధం ఎంతో మంచిది. రమేష్‌ప్రసాద్‌కి ఆస్తిపాస్తులు బాగా వుండటంతోపాటు వాళ్లబ్బాయి వచ్చే సంవత్సరం అమెరికా వెళ్తున్నాడు వుద్యోగానికి. అయితే వాళ్లు మన కులస్తులు కారు. అయినా ఫార్వర్డ్ క్లాసువాళ్లే. మనం అభ్యుదయవాదులం కాబట్టి, యీ ఇంటర్‌కేస్ట్ మేరేజీవల్ల మనకెటువంటి యిబ్బందీ లేకపోగా, యీ పెళ్లి చేస్తే మనసంస్కారం అందరకీ బహిర్గతమవుతుంది.

ద్వితీయ వివాహం, విధవా వివాహం, కులాంతర వివాహం, యీ మూడు తమ ప్రోగ్రెస్సివ్ తింకింగ్‌కి నిదర్శనాలు. ఓ రెండు గంటల చర్చ తర్వాత యీ సంబంధానికే ఒప్పుకున్నారు. రాజేశ్వరిని సుజాత గదిలోకి పంపించేముందు, యీ రెండు సంబంధాల గురించి చెప్పి యిందులో సుజాత దేనికి ఒప్పుకున్నా తమకి సమ్మతమే అని చెప్పేరు.

రాజేశ్వరి సుజాతతో దాదాపు గంటన్నరసేపు మాట్లాడి ఆ గదిలోనించి బైటకొచ్చింది. ఆమె రాకకోసమే హాల్లో అంతా వెయిట్ చేస్తున్నారు.

"మాట్లాడేవా?"

"వూఁ"

"ఏం అంది?"

"చెప్పిందంతా విన్నదేగాని, ఏ ఒక్కదానికీ జవాబు చెప్పలేదు"

"బహుశా ఆలోచనలో పడి వుంటుంది"

సుజాత ఆ సాయంకాలం రవీంద్రని బీచ్‌దగ్గర కలుసుకుంది. జరిగిందంతా ఆమె చెప్పింది. జరగాల్సిందేవిటో రవీంద్ర ఆలోచిస్తున్నాడు.

"ఇప్పుడేం చెయ్యాలి?"

ఇద్దరూ ఆలోచించేది ఇదే ప్రశ్న.



రాత్రి సుమారు ఎనిమిది గంటలు దాటుతోంది. చలపతి వగైరాలంతా భోజనాలకి కూర్చున్నారు.

"సుజాత భోజనానికి రాలేదేం?" నారాయణరావు అడిగేడు.

"వద్దులెండి... దాన్నిక్కడకి పిల్చి డిస్టర్బ్ చెయ్యకండి, ఈ పూటకి దాని గదిలోకే కేరేజిని పంపించు వదినా" అంది రాజేశ్వరి.

సుభద్ర కేరియర్ కట్టి వాణీద్వారా సుజాత గదిలోకి పంపించింది.

రెండు నిమిషాల తర్వాత వాణి కాస్త హడావిడిగా వచ్చి "సుజాత గదిలో లేదత్తయ్యా" అంది.

అందరూ తినడం ఆపి ఆమెవైపు చూసేరు. "ఉదయం నించి గదిలోనే వుందికదా" సుభద్ర అంది.

"ఉంది... కానీ సాయంత్రం ఐదు గంటలప్పుడు డేన్స్‌స్కూలుకి వెళ్తొస్తానని నాతో చెప్పి వెళ్లింది" వాణి ఏదో తప్పు ఒప్పుకుంటున్నదా

ఖ్గా జవాబు చెప్పింది.

"వెళ్తే మాత్రం యిప్పటిదాకా అక్కడేం చే స్తున్నట్టు?" చలపతి తనలో తనే గొణుక్కుంటు న్నట్టుగా అన్నాడు.

అదే సమయంలో-

ఆ యింటి కాంపౌండులోకి ఓ టేక్సీ వచ్చి ఆగింది. సుజాత, రవీంద్రనాథ్ మెడలో పెళ్లి దండలు వేసుకుని దిగి యింట్లోకి నడిచేరు.

హాల్లోకి వచ్చిన ఆ జంటని చూసి అందరూ కూర్చున్న కుర్చీల్లోనించి దిగ్గుమని లేచి నిల్చు న్నారు. సుజాత మెడలో తాళిబొట్టు బయటకి కనిపిస్తోంది. అది వాళ్లెవరూ వూహించని విషయం. ఓ అర నిమిషం వరకూ ఎవరి నోటంటా మాటరాలేదు. చలపతి, మిగతావా ళ్లు చేతులు కంచాల్లో కడుక్కుని గబగబా ముందుకొచ్చేరు.

"ఏవిటమ్మా యిది?" చలపతి ఆవేశంగా అడిగేడు.

"మేం పెళ్లిచేసుకున్నాం డేడీ" సుజాత గొంతులో ధైర్యమేతప్ప భయం ఏకోశానా ధ్వ నించలేదు.

"కనబడుతూనే వుంది. కానీ, నీ జీవితసు ఖాల్ని దృష్టిలో పెట్టుకుని నేనురెండు సంబంధాలు చూశాను. అందులో నీకు ఏది యిష్టమైతే ఆ సంబంధమే చేస్తానని మీ అత్తయ్యా చేత చెప్పించేను. ఇంతలోనే, ను వ్వింత తెగిస్తావనుకోలేదు".

"నాకు మళ్లీ పెళ్లిచెయ్యడానికి మీరు మీ సంస్కారంతో అంగీకరించేరు. నాకు యిష్ట మైన వ్యక్తిని నేను చేసుకున్నాను".

"నా యింటి అల్లుడు బెంగాలీ వ్యక్తి కాకూడ దని నేనే కాదు, మేమందరం నిర్ణయించుకు న్నాం. అలాంటప్పుడు మన కుటుంబగౌరవా న్ని నా పరువు ప్రతిష్టల్ని నాశనం చేస్తూ యీపనెందుకు చేశావ్? ఇది నీకు పుట్టిన బుద్ధా? లేక వీళ్ల తల్లిదండ్రులు చేసిన ఘనకా ర్యమా?"

అంటూ గుమ్మంలో కనిపించిన వ్యక్తుల్ని చూసి నివ్వెరపోయేడు.

నర్సింపంతులు, కామేశ్వరమ్మ!

వాళ్లు ఎప్పుడు హైదరాబాదునించి వచ్చేరో, ఎందుకావేళప్పుడు వచ్చేరో ఎవరికీ అర్థంకాలే దు.

"ఎందుకలా ఆశ్చర్యపోతున్నార్రా వెధవ ల్లారా నేను యీరోజు వుదయం బండి కొచ్చే ను. ఇదేం పెద్ద ఆశ్చర్యకరమైన విషయం కాదు. ఈ పెళ్లి నేనే దగ్గరుండి జరిపించేను"

అంతే!

అందరూ ఒక్కక్షణంపాటు చలించేరు. గుండె లు ఒక్కక్షణంపాటు ఆగి మళ్లీ కొట్టుకుంటు న్నాయి.

"నువ్వు చేసేవా?" చలపతి గొణిగేడు మెల్లగా.

"ఔనురా... నేనే చేసేను. ఏంతప్పా? మారు తున్న కాలంగురించి తెలుసుకోకుండా, ఆదిమ వాసికీ, నాకు తేడా తెలీకుండా బ్రతికేస్తున్న యీ చాదస్తుడు, యీ వివాహాన్ని ఎలా జరి పించేడా అని ఆశ్చర్యపోతున్నారా? ఈ చాద స్తపు నర్సింపంతులే యీ పెళ్లిని గుళ్లో జరి పించేడు. నువ్వు నారాయణరావుకి ఫోన్‌చేసి, సుజాత విషయం వివరించినప్పుడు మేడమీ దున్న ఎక్స్‌టెన్షన్ ఫోన్‌లో నేను విన్నాన్లే. నా కూతురూ అల్లుడూ విజయవాడ వెళ్తున్నామని అబద్ధం చెప్పి వచ్చేక నాలో నేనే ఆలోచించు కుని ఓనిర్ణయానికొచ్చి ఆ తర్వాత ట్రైనులోనే ఈ వూరొచ్చేం. ఈ రవీంద్రని కలిసి మాట్లాడి మేమే పూనుకుని దేవుడి గుళ్లో పెళ్లి జరి పించేం. ఇవాళ మంచిరోజు ఔనా కాదా అని కూడా చూడలేదు. ఓ మంచి పనిచేస్తున్నప్పు డు అన్ని సమయాలూ మంచివేనని ఆలో చించేను. దాన్నే మీ ఇంగ్లీషులో ప్రోగ్రెస్సివ్ తింకింగ్ అంటారేమో నాకు తెలీదు.

విధవరాలయిన అమ్మాయి స్నేహితురాలి పెళ్లికి వెళ్తేనే, చిందులు తొక్కిన యీ చాదస్తు డు, నాట్యం చేయడం ఎవరికో చెల్లిందిగాని మనలాంటి సాంప్రదాయవాదులకి చెల్లదని వాదించిన యీ నర్సింపంతులు, యింత సాహసం ఎలా చేశాడని మీరంతా ఆశ్చర్యపోతా రని నాకు తెలుసు.

కానీ నేను చేసింది సాహసమే అయితే, ఆ సాహసాన్నిచ్చింది మీ రెండు కుటుంబాల్లోని మనుమలేరా?

నాలో వచ్చింది మార్పే అనుకుంటే, ఆ




మార్పుని తెచ్చిందీ మీరేరా?

అగ్రహారంనించి యీవూరు, హైదరాబాద్ వచ్చేవరకూ, నేనూ మీ అమ్మా అలా అలా ఏ మార్పు లేకుండా బతికేం. కాలగమనంలో వచ్చిన మార్పుల్ని మేం గమనించకపోవడం మాత్రప్పేనని ఒప్పుకుంటున్నాను.

ఈనాటి నాగరికత, ఈనాటి పద్ధతులు, ఈనాటి ఆలోచనలు, ఇవన్నీ ఇక్కడకొచ్చి, మిమ్మల్ని చూసి మీతోవాదించి తెలుసుకున్న వేరా. నా పద్ధతుల్ని సిద్ధాంతాల్ని మీరు మీ విజ్ఞానంతో ఖండించినప్పుడు తాత్కాలికంగా నేను బాధపడ్డాను. కానీ, తర్వాత నేను నరనరా ల్లో సనాతనాన్ని నింపుకున్న నర్సింపంతులిగా కాకుండా, ఓ మనసున్న మనిషిగా ఆలోచించి, మీ పద్ధతులు, మీ ఆలోచనల్తో రాజీపడ్డాను. మీ బోధనలతో, మీ వాదనలతో నన్ను నేనే మార్చుకున్నాను.

నరే... సుజాత జీవితాన్ని ఆ భగవంతుడు అలా శపించేడు. నిండు నూరేళ్ళూ సుఖసంతో షాల్తో సాగవలసినదాని జీవితం, ఇంత లేత వయసులోనే మోడుబారిపోవడం నేను కూడా సహించలేకపోయేను.

దేవుడు చేసిన తప్పుని, మనిషిగా నేనైనా దిద్దడం, నా నైతిక బాధ్యతగా భావించేను. నాకు ఒక్క విషయం చెప్పండిరా! మీరు ఈతరానికి ప్రతినిధులమని చెప్పేరు, మారు తున్న కాలంతోపాటు మీరూ అడుగుముందుకే స్తున్నామని చెప్పేరు. మూర్ఖ సాంప్రదాయాల కాళ్లు విరగ్గొట్టి, మీ నిలువెల్లా అభ్యుదయాన్ని నింపుకున్నామని చెప్పేరు. గతానికీ, ఇప్పటికీ ఎంతో మార్పు సాధించేనన్నారు.

మీ మార్పు బాగానేవుంది. కానీ, మీరు పూర్తిగా మారకుండా సగంలోనే ఆగిపోయేరేం?

ద్వితీయ వివాహానికి, విధవా వివాహానికి అంగీకరించినవారు, ఓ బెంగాలీ అబ్బాయిని అల్లుడిగా ఎందుకు అంగీకరించలేకపోయే రు?

మీరు చేసే ద్వితీయ వివాహంకూడా మళ్ళీ మన కులస్థుడితోనే జరిపించాలని ఎందుకను కున్నారు? ఆ విషయంలో కూడా మరో అడుగు ముందుకేసేరు. మన కులంకాకపోయినా, మరో అగ్రకులస్థుడికి, ఆస్తిపరుడికిచ్చి పెళ్ళి చెయ్యొచ్చని ముందుకొచ్చేరు.

అంతవరకూవచ్చినవాళ్ళు, అక్కడితోనే ఎందుకు ఆగిపోయేరు? మరో రాష్ట్రంవాడిని, మరో భాషవాడిని మీలో కలుపుకోడానికి ఎందుకు సంకోచించేరు? .
మీ అమ్మాయి సుఖపడాలనే మీరు దీనికి పెళ్ళిచేస్తున్నప్పుడు, అది ప్రేమించినవాడితో దాని పెళ్లి జరిపించాలని ఎందుకు ఆలో చించలేకపోయేరు?

మీరు ఆలోచించకపోయినా, మీవల్ల మార్పు చెందినవాడిగా నేను ఆలోచించేను అందువల్లనే, మీక్కూడా చెప్పకుండా నేనే ఈ పెళ్లి జరిపించేను, ఇది మీకు అభ్యంతరకర మైతే, సుజాత ఇకమీదట మీకూతురిగా కాదు, నా మనవరాలిగానే ఉంటుంది. చింతల అగ్ర హారంలోవున్న నాఇల్లే దానిల్లు అవుతుంది. ఇకమీదట, అక్కడికే దాని రాకపోకలు జరుగు తాయి''

నర్సింపంతులు ఆవేశంగా చెప్తుంటే, అంద రూ రెప్పార్పకుండా, ఊపిరిబిగబెట్టి వింటు న్నారు. మొన్నటివరకు అతను నజీవమైన బండరాయిలా కనిపించేడు. కానీ, ఇప్పుడు మహాశిల్పి చెక్కిన దేవుడి విగ్రహంలా కని పిస్తున్నాడు. కాలాన్నిబట్టి మార్పు చెందింది. మేంకాదు, ఆయనే అని అందరూ తమ అంతఃకరణాల్లో అనుకున్నారు. మేం మారేమా రని మనుమలం, లేదా మాకున్న చదువు, సంస్కారం, విచక్షణాజ్ఞానాలతో, అభ్యుదయప థంలో నడుస్తున్నామని, మమ్మల్ని మేం వంచించుకు బతుకుతున్నవాళ్లం. కానీ, నర్సింపంతులు పరిణతిచెందిన మనిషి. సంపూర్ణమైన జీవితానుభవంతో పండిపోయిన పూర్ణపురుముడు.

''మమ్మల్ని క్షమించండి'' అనేమాట ఎవరి నోటినించీ రాకపోయినా, అందరికళ్ళల్లోను సు ళ్ళుతిరుగుతున్న నీటికి, నోరు వచ్చివుంటే ఆ భాష్పాలు ఇవేమాట చెప్పివుండేవి.

★ ★ ★

మర్నాడు

నర్సింపంతులు, కామేశ్వరమ్మ, కాశీప్ర

యాణం మానుకున్నారని తెలియగానే అందరూ ఆశ్చర్యపోయేరు. అది వాళ్ళ చిరకాల జీవితాశయం. యాభైనాలుగు సంవత్సరాలుగా కాశీవెళ్ళి గంగాస్నానంచేసి విశ్వేశ్వరుణ్ణి దర్శించుకోవాలని, పవిత్ర ప్రేమ చిహ్నమైన తాజ్‌మహల్‌ని సందర్శించాలని ఉబలాటపడుతున్నవాళ్లు ఇప్పుడు తీరికచేసుకు బయలుదేరికూడా, ఎందుకింత అర్ధాంతరంగా తమ ప్రయాణాన్ని మానుకున్నారో అర్థంకాలేదు.

చలపతి ఈ విషయం అడిగేటప్పటికే ముసలాళ్లిద్దరూ స్వగ్రామానికి వెళ్ళిపోయే ఉద్దేశంతో మూటాముల్లె సర్దుకుంటున్నారు.

"మీరు కాశీప్రయాణం ఎందుకు మానుకుని వెళ్ళిపోతున్నారో మాకు అర్థంకావడంలేదు నాన్నా" అన్నాడు చలపతి బాధగా. ట్రంకుపెట్టెలో బట్టలు సర్దుతున్న నర్సింపంతులు అటువైపు తలతిప్పి చూసేడు.

కూతురు, అల్లుడితోసహా అందరూ హాల్లో నిలబడి అతని సమాధానంకోసమే ఎదురుచూస్తున్నారు.

పంతులుగారు ఆ గదిలోంచి హాల్లో కొచ్చి సోఫాలో కూర్చున్నాడు. "నేను ఎవరిమీదో అలిగి ఈ ప్రయాణాన్ని మానుకోలేదురా. కాశీ వెళ్లి గంగలో మునిగి, పిడికెడు పుణ్యం సంపాదించుకోవాలని ఎన్నాళ్ళగానో అనుకుంటున్న మాట నిజమే! కానీ మన సుజాతకి పెళ్ళి జరిపించేక నాకొక్కటే అనిపించింది. గంగలో మునిగి, ఒళ్లు శుభ్రంచేసుకుని, పుణ్యం వచ్చేసిందని అనుకోవడంకంటే, ఓ విధవరాలికి మాంగల్య భాగ్యం కలిగించి సౌభాగ్యవతిని చేసేనన్న తృప్తి చాలా గొప్పదనిపించింది. అంతకంటే పుణ్యంలేదనిపించింది.

అందుకే ఆ ప్రయత్నం మానుకున్నాను. ఇంక ఆగ్రా వెళ్ళి తాజ్‌మహల్ చూద్దం అంటారా... కులాలకి, మతాలకి, భాషలకి అతీతంగా సుజాత, రవీంద్రనాథ్‌లు ప్రేమించుకున్నాక, వాళ్ళమధ్య ఏర్పడిన బంధాన్నిచూసి ఆనందించడంకంటే తాజ్‌మహల్‌ని చూస్తే వచ్చే ఆనందంగొప్పది కాదనిపించి ఆ ప్రయత్నాన్నీ విరమించుకున్నాను"

★ ★ ★

ఆ సాయంత్రం బస్సుకే నర్సింపంతులు, కామేశ్వరమ్మ బయలుదేరారు. వాళ్ళని బస్సు ఎక్కించడానికి సుజాత, రవీంద్రనాథ్‌లతో సహా అందరూ వచ్చేరు. బస్సు ఎక్కేముందు నూతన దంపతులని పంతులుగారు అడిగేరు.

"మీకు పెళ్ళయిపోయిందిగదా. హనీమూన్ ఎక్కడికెళ్లాలనుకుంటున్నారు?"

"ముందు మా నాన్నగారి ఆరోగ్యం బాగుపడాలి. ఆతర్వాత బాంబే, ఢిల్లీ, ఆగ్రా" రవీంద్ర చెప్పేడు.

"ఆ ఊర్లు వెళ్ళడంతోపాటు ఓసారి మా చింతల అగ్రహారానిక్కూడారండి. అక్కడేం ఉంటుంది చూడ్డానికి అని అనుకోకండి. ఇవాళ పట్నాలు, నగరాలు ఎన్ని పెరిగినా ఎంతపెరిగినా, వాటికి పునాదులువేసిన గ్రామాల్ని కూడా అప్పుడప్పుడు చూస్తుండండి. నాగరికత ఎక్కడ కొమ్మలూ, రెమ్మలూ వేసినా ఆ వృక్షానికి వేళ్ళు మన గ్రామాల్లో వున్నాయి. అక్కడి పొలాలు, అందులో పనిచేసే అమాయికపు రైతులు, కూలీలు, ఆ చల్లటిగాలి ఇవన్నీ మీకు ఆనందం కలిగిస్తాయో లేదో చెప్పలేను గాని వాటినిగురించి తెలుకోవాల్సిన అవసరం మీలాంటి పట్నవాసులకి ఉందేమోనని పిస్తోంది. నేను ఏ కొత్త వస్తువుని చూసినా దాన్ని తయారుచేసిందెవరు? కనిపెట్టిందెవరూ అని అడగటం నాకు అలవాటు. అలాగే ఈనాటి పట్నాలకి, నగరాలకి మూలమైన స్థలం ఏదీ? అని మీకు మీరు ప్రశ్న వేసుకుంటే మన గ్రామాలే వీటికి పుట్టినిల్లూ అని సమాధానం వస్తుంది. అలాంటి సమాధానం వచ్చినప్పుడు ఒక్కసారి మా చింతల అగ్రహారం రమ్మని కోరుతున్నాను"

డ్రైవరు బస్సు బయలుదేరబోతోందని హార్న్ మోగించేడు. నర్సింపంతులు, కామేశ్వరమ్మ బస్సులో కూర్చున్నారు.

బస్సు బయలుదేరింది.

అందరూ సజలనయనాలతో గాల్లో చేతులు ఊపుతూ, టాటా చెప్తూ, ఆ పుణ్యదంపతులకి వీడ్కోలిచ్చారు.

★





# చతుర ప్రపంచం

## 'మూడ్' కోసం పాట్లు!

రాసే 'మూడ్' రావడంకోసం రకరకాల తంటాలు పడుతుంటారు రచయితలు. షెర్లాక్‌హోమ్స్ పాత్రను నభూతోనభవిష్యతి అన్నట్లుగా సృష్టించిన సర్‌ఆర్థర్ కానన్‌డాయల్, నిశ్శబ్ద వాతావరణంలో అక్షరం ముక్క రాయలేడు. చుట్టూ జనం కీసర బాసరగా మాట్లాడుతూ కోలాహలం సృష్టిస్తుంటే ఆయనగారి కలం పందెపుగుర్రంలా పరుగులు పెట్టేదట.

ప్రఖ్యాత నాటక రచయిత జార్జి బెర్నార్డ్‌షా తీరే వేరు. రాసే మూడ్‌పోయినప్పుడల్లా ఆయన కన్పించిన బస్ ఎక్కి గమ్యం లేకుండా నగర సంచారం చేసేవాడు. అలాచేయడంవల్ల మూడ్ తిరిగి దానంతటదే వచ్చేదట.

చార్టర్‌టన్‌కు కడుపునిండా తింటే కలం కదలదు. అందుకే అతను ఏదైనా రాయాలనుకున్నప్పుడల్లా భోజనం మాని, నకనకలాడే కడుపుతో రచనా వ్యాసంగం మొదలెట్టేవాడు.

కవి అలెగ్జాండర్ పోప్‌గారికి రాస్తున్నంత సేపూ పక్కన పొగలు కక్కుతున్న వేడివేడి కాఫీ సిద్ధంగా ఉండాలి. పేరాపేరాకో గుక్కెడు కాఫీ గొంతులో పోసుకోందే ఆయన రాయలేడు. అనివార్యకారణాలవల్ల కాఫీ లభించకపోయినా కనీసం కాఫీ వాసనవచ్చే పదార్థమేదైనా తన గదిలో ఉంచండని గోలపెట్టేవాడాయన.



కుళ్లిన ఆపిల్‌పళ్ల వాసన ముక్కుపుటాలను దరగొడ్తుంటే తప్ప ప్రఖ్యాత జర్మన్ కవి సిల్లర్ కవిత్వం రాయలేరట. అందుకోసం నిత్యం కుళ్లిన ఆపిల్‌పళ్ల బుట్టల్ని ఆయనగారి గదిలో

ఉంచేవారు నౌకర్లు.

ఎమర్సన్, థామస్‌కార్లైల్‌ల విషయానికొస్తే వీరు రాసేటపుడు ఎలాంటి శబ్దాల్ని భరించలే కపోయేవారు. అందుకోసం వారు నరమానవు డు తారసపడని దట్టమైన అరణ్యాలకో, పర్వత ప్రాంతాలకో పోయి రాస్తారు. ఎమిలీజోలాకు గుడ్డివెలుగులో రాయడం అలవాటు. కిటికీ తలుపులు మూసేసి ఆ చీకట్లో చిన్న కొవ్వొత్తి పెట్టుకొని రాస్తుంటుంవామె.

అమిత బాధనుంచే అసలైన రచన ఆవిర్భ విస్తుందంటాడు జోనాథన్ స్విఫ్ట్. గాళ్‌ఫ్రెండ్ మోనంచేసినపుడో- ఎడిటరో పబ్లిషరో తనని అవమానించినపుడో అతని కలం కదంతొక్కు తుంది.

బాల్జాక్‌ది మరింత వింతపద్ధతి. అర్ధరాత్రి 12 గంటలకు మేల్కొని మంచం మీదనుంచి లేవకుండానే అందుబాటులో పెట్టుకున్న కాగి తాలమీద తెల్లవారిందాకా బరబరా రాసేస్తాడు.

లార్డ్‌మెకాలే అదేతరహా మనిషి. కనీసం పదిపుస్తకాలైనా తిరగేసికాని ఒక్క వాక్యం రాయలేడు. అలా పుస్తకాలు తిరగేస్తుంటే తప్ప అతనికి అయిడియాలు రావట.

లార్డ్‌చెస్టర్‌టన్ గొప్ప బద్ధకిస్టు. ఎడిటర్లు, పబ్లిషర్లు బతిమాలగా బతిమాలగా ఎప్పటికో గాని కలం కదిలించడు. ప్రేమ, శృంగార సన్నివేశాల్ని పండించడంలో దిట్ట అయిన వేనర్ అవి రాయడంకోసం స్వయంగా ఎవరో ఓ అమ్మాయితో ప్రేమాయణం నడిపి ఆ అనుభవాల్నే రచనల్లో గుప్పించేవాడు.

## శునకసేవ

అన్ని రంగాల్లోలాగే నేర పరిశోధక శాఖలో కూడా ఎంతో అభివృద్ధి చోటుచేసుకుంటోంది. అయితే ఎన్ని ఆధునిక యంత్రాలూ, కంప్యూ టర్లూ ప్రవేశించినా ఏనాటినుంచో ఆ శాఖలో ఉంటున్న పోలీసుకుక్కల ప్రాధాన్యత మాత్రం ఏమీ తగ్గలేదింతవరకూ. సరికదా ఇంకా పెరుగుతోంది. స్కాట్‌లాండ్ యార్డ్ పోలీసులకు ప్రపంచంలోనే అత్యంత పటిష్ఠమైన పోలీసు వ్యవస్థగా పేరు రావడానికి కారణం వారిదగ్గరున్న జాగిలాలేనని చాలామంది చెప్పుకుంటారు.

అన్నిరకాల కుక్కలు పోలీస్ ట్రైనింగ్‌కి



పనికిరావు. అందుకోసం ప్రత్యేకించి ఒకప్పుడు జర్మనీ జాతికుక్కల్నే ఎన్నుకొనేవారు. అవి

చాలా తెలివైనవేగాదు గొప్ప ధైర్యసాహసాలు ప్రదర్శించగలవి; ఎంతటి ప్రమాదంలోకైనా నిర్భయంగా చొచ్చుకుపోగలిగేవి. ఆ తర్వాత్త ర్వాత ఎరిడెల్, డాబర్‌మాన్, పిన్‌జర్ జాతికుక్కల్ని కూడా పోలీస్ వ్యవస్థలోకి తీసుకోవడం మొదలెట్టారు.

సాధారణంగా పోలీసులకు పనికొచ్చే కుక్కలు కనీసం 61 సెంటీమీటర్ల ఎత్తు, 27-40 కిలోగ్రాముల మధ్య బరువు వుండాలి. చురుకైన కళ్ళు, మంచి వినికిడి జ్ఞానంగల చెవులు కావాలి. అంతేకాదు మంచి అవగాహనాశక్తితోపాటు యజమాని సూచనల్ని పాటించే నేర్పు, సామర్థ్యం కూడా ఉండాలి.

ఏడాది వయసులో ఉండగానే కుక్కలకి శిక్షణనివ్వడం ప్రారంభిస్తారు. తొలిదశలో వాటికి వాసన పసిగట్టడం, నేరస్థుల్ని పట్టుకోడం నేర్పిస్తారు. నదులు, కాలువలు ఈదడం, ఇతరత్రా ఆటంకాలని అధిగమించడం నేర్పుతారు. సాధారణంగా ఒక్కొక్క జాగిలానికి ఇద్దరేసి శిక్షకులు చొప్పున ఉంటారు.

పోలీసు కుక్కలు కేవలం నేరస్థుల్ని పట్టడం, దొంగసొత్తుని కనిపెట్టడంవంటి పనులేకాక ఏ యంత్రాలూ, అధికారులూ నిరోధించలేని స్మగుల్డు గూడ్స్ ఉనికిని, మాదకద్రవ్యాల రవాణాల్నీ ఆయుధాల్నీ కూడా పసికడుతున్నాయి. సాధ్యమైనంతలో కస్టమ్స్‌శాఖకూ ఉపయోగపడుతున్నాయి. బెల్జియం, రుమేనియా వంటి దేశాలలోనైతే పైపనులతోపాటు తప్పిపోయిన మనుషులు, జంతువుల ఆచూకీని కూడా ఇవే కనిపెడ్తున్నాయి. ఇంత విశ్వాసపాత్రంగా పనిచేసే జాగిలాల్ని పోలీసుశాఖలో తొలిసారిగా ప్రవేశపెట్టిన ఘనత బ్రిటీష్‌వారిదే నంటారు.

## ఎలక్ట్రానిక్ బ్రెయిన్

**చం**డీఘర్‌కి చెందిన ఇరవై రెండేళ్ళ ప్రశాంతపురిది ఎలక్ట్రానిక్ పరికరాలు తయారు



చేయడంలో అందెవేసిన చెయ్యి. ఇటీవల అతను తయారుచేసిన 'ఎలక్ట్రానిక్ పెన్ సంచలనం సృష్టించింది. సుమారు 20 వేల పదాల వరకూ గుర్తుంచుకోగల ఆ పెన్‌ను ఎలక్ట్రానిక్ టైప్‌రైటర్‌కు కనెక్టుచేస్తే మనం రాసేదంతా ఆటోమేటిక్‌గా టైప్ అయిపోతుంది. అలాకాక దీన్ని కంప్యూటర్‌కి కనెక్టు చేసినట్లయితే అదంతా కంపోజ్ అయి

ప్రింట్ కూడా అయిపోతుంది. ఇలాంటి పెన్ను లు పత్రికా సంపాదకులకు, రచయితలకు బాగా ఉపకరిస్తాయనడంలో సందేహం లేదు.

ఇంజనీరింగ్ చదవాలని మోజుపడుతున్న ప్రశాంతపురి బాల్యం నుంచీ ఎలక్ట్రానిక్ పరిక రాలని, వాటి నిర్మాణ విశేషాలనీ గమనించ డంపట్ల ఆసక్తిని ప్రదర్శించేవాడు. కనిపించిన ప్రతి వస్తువుని ఊడదీయడం తిరిగి బిగించడం అతని నిత్య కృత్యమైపోయింది. సున్నితమైన విదేశీ ఎలక్ట్రానిక్ పరికరాల్ని తన సునిశితమేధాశక్తితో స్వయంగా గ్రహించి పని చేయించేవాడు. పెద్దపెద్ద మేధావులకే బుర్ర పగులకొట్టుకున్నా అంతుబట్టని ఆయా పరిక రాల్ని అతడు సునాయాసంగా పనిచే యించడం చూసి ముక్కున వేలేసుకునే వారంతా. 13 ఏళ్ళ వయస్సులోనే ప్రశాంత్ కేవలం 15 రూపాయల పెట్టుబడితో ఒక టి.వి. ఏంటెన్నా తయారు చేశాడు. ఆ తరువాత కేవలం 10 రూపాయలతో ఓ వైర్‌లెస్‌సెట్‌ని, బర్గ్లర్ అలారమ్‌ని కూడా తయారు చేయగ లిగాడతను. అంతేకాదు 50 రూపాయల ఖర్చుతో రిమోట్ కంట్రోల్‌తో పనిచేసే ఫాన్‌ని, లైట్‌ని కూడా చేశాడు. వీటివల్ల అతని ఖ్యాతి దేశమంతా పాకింది.

నాటి ప్రధాని రాజీవ్‌గాంధీ ఆ కుర్రవాడి ప్రతిభకు ముచ్చటపడి అతన్ని పరీక్షించే నిమిత్తం రకరకాల కార్లను చండీఘర్‌కి పంపే వారు. వాటిని అలాచూసీ చూడడంతోనే వాటి నిర్మాణ రహస్యాలను పసిగట్టేసేవాడు ప్ర శాంత్.

అవి నడుస్తుండగా ఎక్కడో రెండు మూడు కిలోమీటర్ల దూరంలో ఉండగానే రిమోట్ కంట్రోళ్లసాయంతో వాటిని ఆపేసేవాడు. అత ను రిలీజ్ బటన్ నొక్కేంతవరకూ బ్రహ్మరుద్రా దులు ప్రయత్నం చేసినా ఆ వాహనాలు కదిలేవికావు. నేరస్థుల కార్లని పట్టుకోడానికి ఆ రిమోట్‌కంట్రోల్ పరికరాలు పనికొస్తాయని పోలీసులు ప్రశాంత్ సాయం తీసుకుంటున్నా రు. విదేశాలు అతన్ని కిడ్నాప్ చేసి తమ స్వప్రయోజనాలకుఉపయోగించుకుంటాయనే భయంతో ప్రభుత్వం నెలకు 15000 రూపా యల ఖర్చుతో అతనికి రక్షణ కల్పిస్తోంది. ప్రశాంత్ పరిశోధనల గురించి 'టిస్కో' పత్రిక వివరంగా ప్రచారం చేస్తోంది.

## ఓనమాలు దిద్దబెడ్తున్న 'డాక్టరేట్'

డాక్టరేట్ పట్టాదారెవరైనా ప్రైమరీ స్కూలు పంతులుద్యోగం వెలగబెడుతున్నాడంటే మనమో పట్టాన నమ్మలేం. కాని కర్ణాటకకు చెందిన శివగౌడ అపనే చేస్తున్నాడు. ప్రస్తుతం



యాభయ్యేవపడిలో పడబోతున్న ఆ పెద్దమ నిషి జీవితమంతా ఇప్పటివరకూ కష్టాలు కన్నీళ్ళతోనే గడిచిపోయింది. అయినా పట్టుదలతో తాననుకున్నది సాధించుకున్నాడతను.

ప్రైమరీ స్కూలు చదువు ముగిశాక ఒక ప్రైవేటు విద్యాసంస్థలో ఉపాధ్యాయుడుగా చేరాడు శివగౌడ. అలావచ్చే స్వల్పాదాయంతోనే పొట్టపోసుకొంటూ టీచర్స్ ట్రైనింగ్ పూర్తి చేశాడు. ఆ తర్వాత అతనికి కార్వార్ జిల్లాలోని ప్రభుత్వపాఠశాలలో ఉద్యోగం దొరికింది. అది చేసుకుంటూనే ప్రైవేటుగా యస్.యస్.యల్.సి. పాసయ్యాడు. అదే బిగువున దీక్షగా చదివి బి.ఎ., ఆపైన ఎం.ఎ. కూడా పూర్తి చేశాడు. ఆ తరువాత మిత్రులు బి.ఇడి. చేయమని సలహాయిచ్చినా వినకుండా డాక్టరేట్ చేయాలని నిర్ణయం తీసుకున్నాడు. కాని యూనివర్శిటీలో అతన్ని గైడ్ చేయడానికి ఎవరూ ముందుకురాకపోగా 'ఆఫ్టర్ఆల్.... ప్రైమరీస్కూల్ టీచర్' అంటూ గేలిచేశారు. అయితే లోకమంతా చెడ్డవాళ్ళే ఉండరుగదా! ఒక పుణ్యాత్ముడు అతనికి గైడెన్స్ ఇచ్చేందుకు ముందు కొచ్చాడు. ఆయన సహకారంతో నాలుగేళ్ళు అవిరళకృషి చేసి తన పరిశోధనాపత్రాలను యూనివర్శిటీకి సమర్పించుకున్నాడు శివగౌడ. అయితే డాక్టరేట్‌కు ఒక వంక కృషి చేస్తూనే మరో వంక తన ఉపాధ్యాయ వృత్తిని నిర్వహించుకొచ్చాడతను. యూనివర్శిటీవారు 1986లో అతనికి డాక్టరేట్ ప్రకటించారు. గేలి చేసినవారంతా సిగ్గుతో తలలు వంచారు.

"ప్రైమరీ స్కూలులో చిన్నపిల్లలకి చదువు చెప్పడం చిన్నతనమెందుకవుతుంది? నా వృత్తిపట్ల అపారగౌరవం ఉండబట్టే సుమారు పాతికేళ్ళుగా ఈ వృత్తిలో ఉన్నాను" అంటున్న శివగౌడ ప్రస్తుతం బెల్గాం జిల్లాలోని శంకేశ్వర్ గ్రామ పాఠశాలలో పనిచేస్తున్నాడు.

## చక్రవర్తుల సంతకాలు చూస్తారా?

అలనాటి అక్బర్, ఔరంగజేబు వంటి మొగలు చక్రవర్తుల స్వదస్తూరీ చూడాలని ఉందా లేక దక్షిణాఫ్రికా నుండి మన గాంధీజీ నడిపిన ఉత్తర ప్రత్యుత్తరాలను యధాతథంగా చూద్దామనుకుంటున్నారా? అన్ని వందల సంవత్సరాలనాటివి ఇప్పుడెక్కడ దొరుకుతాయని నిరుత్సాహపడనక్కరలేదు. అటువంటి అపురూపమైన వ్రాత ప్రతులు ఎన్నెన్నో న్యూఢిల్లీలోని



'నేషనల్ ఆర్కైవ్'లో భద్రంగా ఉన్నాయి.

240 సంవత్సరాల కాలంనాటి ప్రభుత్వప త్రాలు, రాజశాసనాలు, తాఖీదులు అక్కడ అతిభద్రంగా ఉన్నాయి. ఆ భవంతిలో నున్న అతిప్రాచీన పత్రం క్రీస్తుశకం 6వ శతాబ్దంనాటిది. 'బ్రహ్మి'లిపిలో తాళపత్రాల మీద గిల్గిట్ దాన్ని రచించాడు. ఝాన్సీలక్ష్మీబాయికి సంబంధించిన పత్రాలు అక్కడ లెక్కకు మిక్కిలిగా ఉన్నాయి. ఆంగ్లేయుల విద్యావిధానానికి సంబంధించినవి. పర్వతారోహకులకు సంబంధించినవీ ఎన్నో వివరాలు ఆయా వ్యక్తుల దస్కతులతో సహా అక్కడ లభిస్తాయి.

ఆ భవంతిలో ఉన్న బీరువాల్ని వరుసగా నిలబెడితే 25 కిలోమీటర్ల పొడవు వుంటాయట. దానికి అనుబంధంగా కట్టిన మరో భవనంలోని బీరువాలు 40 కిలోమీటర్ల వరకూ ఆక్రమించవచ్చు. ప్రపంచంలో అతి అరుదుగా లభించే 2 లక్షల పుస్తకాలు అక్కడ ఉన్నాయి. ఇంకెంతో సమాచారమూ మైక్రో ఫిల్ముల రూపంలో అక్కడ భద్రంగా ఉంది.

## గోతుల పోటీ



"రోడ్డు మీద అతి పెద్ద గోతిని చూపినవారికి బహుమతి" అంటూ కర్నాటకకు చెందిన ఓ వినియోగదారుల శిక్షణా సంస్థ ఆ మధ్య ఓ చిత్రాతి చిత్రమైన పోటీని నిర్వహించింది. మంగుళూరు నగరంలోని రోడ్ల దుస్థితికి వినుగెత్తే ఆ సంస్థ ఏలినవారి కళ్ళు తెరిపించేందుకు ఈ కొత్త ఎత్తు ఎత్తింది. పోటీ నిబంధనల ప్రకారం కార్పొరేషన్ ఉద్యోగులు తప్ప మరెవ్వరైనా ఆ పోటీలో పాల్గొనవచ్చు. పోటీకి నిర్ణయించిన గడువు తేదీలోగా కార్పొరేషన్‌వారు గోతులన్నీ పూడ్చివేస్తే పోటీ రద్దవుతుంది. కాని ఆ పోటీ రద్దు కాలేదు. 6 మీటర్ల పొడవు, 4.2 మీటర్ల వెడల్పు, 45 సెంటీమీటర్ల లోతు కల్గి, నట్టనడి రోడ్డు మీదే సుమారు 10వేల లీటర్ల నీటిని నిలువ చేయగల ఓ పెద్ద గోతిని చూపించి బహుమతి నందుకున్నాడో పెద్దమనిషి. బహుమతి ప్రదానం సాక్షాత్తు ఆ నగర మేయరుగారి చేతే చేయించి మరింత గడుసుదనాన్ని ప్రదర్శించింది ఆ వినియోగదారుల శిక్షణా సంస్థ.

అయితే మాత్రమేం? సమస్య సమస్యగానే మిగిలిపోయింది. ఇలాంటి చిట్కాలకి చిత్తయిపోవడానికి ఏలినవారేమైనా మామూలు మనుషులా? వారిలాంటి విషయాలకు అతీతులు గనుకనే మనకి ఏలికలయ్యారు గదా!

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd. Hyderabad. Tel. 229428. Office Address: CHATURA Telugu Monthly Eenadu Compound, Somajiguda, Hyderabad. Tel. Hyderabad: 223422, 229444, Madras 470434, Vijayawada 476685, Visakhapatnam 52211, Tirupati 5291.



హిమాచలప్రదేశ్ యువతి

Hbad-500 004. Regd No. H/ HD /402

# ప్రియతో భోజనం- ఇంటా బయటా బహురుచికరం!

ఎప్పుడైనా, ఎక్కడైనా... ప్రియ!

ఉదయం, మధ్యాహ్నం, రాత్రి -
ఏ వేళప్పుడయినా సరే,
అల్పాహారం, భోజనం, ఉపాహారం - ఏదైనా సరే,
ఇంటా బయటా - ఎక్కడైనా సరే,
ప్రియ పచ్చళ్లుంటేనే అది బహురుచికరం!

నవకాయ పిండి వంటలెన్నున్నా
ప్రియ పచ్చళ్లతోనే భోజనం పరిపూర్ణం!

మీ పళ్లెంలో ప్రియ ఉంటేనే మీకు
సంతృప్తి సంతుష్టి!!

**ఎంతో రుచి... ఎంతో రుచి...**

# ప్రియ






మామిడి • నిమ్మ • గోంగూర
• అల్లం • టొమాటో • పండుమిరప
• పచ్చిమిరప • మిక్స్‌డ్ వెజిటబుల్.
పచ్చళ్లన్నీ వెల్లుల్లితోనూ,
వెల్లుల్లి లేకుండానూ లభిస్తాయి

ఉషోదయ
ఎంటర్‌ప్రైజెస్ లిమి
(ప్రియ ఫుడ్స్ డివిజన్)
ఈనాడు కాంపౌండ్,
సోమాజిగూడ,
హైదరాబాదు -50048